# విషయానుక్రమణిక

# ఉపోద్ఘాతం

వీరోచిత తెలంగాణా విప్లవ గాథలు కొన్ని ఈ ప్రచురణలో వెలువడ్డాయి. ఇందులో ఎక్కువభాగం ఇంతకుముందు 'ప్రజాశక్తి' ప్రత్యేక సంచికలలోనూ, వార పత్రికల్లోనూ అచ్చయినాయి. ఐనా వాటన్నింటినీ సంకలితంచేసి చదువరులకూ, నేటి యువతీ యువకులకూ అందించాలన్న ఆకాంక్షతో ప్రత్యేక పుస్తకరూపంతో తీసుకు వచ్చారు.

ఆ మహత్తర పోరాటంలో వేలసంఖ్యలో సంభవించిన ఘటనలలో ఇ కొద్దిసంఖ్యలో కొన్ని ప్రాంతాలకు పరిమితమైనవి మాత్రమే. ఐనా ఆ పోరాటం ఆర భమై విజృంభించిన ప్రాంతాల్లో ప్రఖ్యాతివహించిన పోరాటరూపాలు ఈ రచనల్ల వెల్లడైనాయి. ఇవి ఊహాజనితాలూ గావు; విని వ్రాసిన చిత్రీకరణలూ గావు. ఆ యా సందర్భాల్లో ప్రత్యక్షంగా పాల్గొన్న నాయకులు తమ అనుభవాలను, జ్ఞాపకాలను ఆధారం చేసుకొని స్వయంగా వ్రాసినవే యీ గాథలు.

అధునిక భారతదేశచరిత్రలో ఒక మహోజ్వల పోరాటం, వీరతెలంగాణా రైతాంగ సాయుధ విప్లవపోరాటం. 1946 నుండి 1951 వరకు జరిగిన ఆ పోరాటంలో దాదాపు 5000 మంది మహావీరులు నేలకొరిగారు. మన జాతీయోద్యమ చరిత్రలో ఇదొక అపూర్వస్థానాన్ని అందుకున్నది.

వెట్టికి వ్యతిరేకంగా భుక్తికోసం, దున్నుకునేవాడికే భూమికోసం ప్రారంభ మైన యీ పోరాటం పాక్షికవిజయాలను కొన్నింటిని సాధించింది. పూర్తి విజయాలు పొందలేకపోయింది. అయినా ఆ పోరాటం స్వాతంత్ర్య భారతావని ముందు అనేక కీలకసమస్యలను ఎజెండామీదికి తెచ్చింది.

ఆ పోరాటం తమ చేతులుదాటిపోతుందన్న భయంతోనే యూనియన్ సేనలు నైజాం సంస్థానంలో అడుగుపెట్టడం జరిగింది.

స్వాతంత్ర్యమొస్తేనే చాలదు,ఫ్యూడల్ భూస్వామ్య వ్యవస్థను అంతం చేయ కుండా ఆర్థికవిధానం ముందడుగు వేయదన్న సత్యాన్ని ఆ పోరాటం ఎలుగెత్తి చాటింది. వినోబాభావే భూదానంతో ముందుకువచ్చారు. కానూన్ల ద్వారా కౌలుదారీ రక్షణ, గరిష్ట పరిమితి ద్వారా మిగులుభూమి పంపకం మొదలైనవన్నీ రంగం మీది కెక్కాయి. పంచవర్ష ప్రణాళికలకు భూసంస్కరణలొక ప్రధానాంశం అయింది.

ఫ్యూడల్ సంస్థానాలను బద్దలుగొట్టడం, భాషాప్రయుక్తంగా జాతులవారీ రాష్ట్రాలను పునర్నిర్మాణంచేయడం రంగంమీదికి వచ్చాయి. అందుకు అనలు వేసినవి

కమ్యూనిస్టుల నాయకత్వాన జరిగిన ఆంధ్ర-తెలంగాణా పోరాటాలు. ఈ పరిణామం దేశవ్యాపితంగా జరగడానికి, ఆంధ్రప్రదేశ్ అవతరణే నాందీప్రస్తావన పలకడానికి కారణం అదే.

ఆంధ్ర-తెలంగాణాలు సమైక్యంగా అభివృద్ధిచేసుకునే విధంగా నీటిపారుదల' విద్యుచ్ఛక్తి ప్రాజెక్టులు తిరిగి వ్రాయబడటానికి దారితీసినదీ ఈ పరిణామమే.

అందుకే వీరోచిత తెలంగాణా విప్లవపోరాటం దేశాన్ని ముందుకు నడప టానికి, సమైక్య ఆంధ్రప్రదేశ్ అభివృద్ధికీ అనేకవిధాల దోహదమిచ్చింది.

అంతేగాదు. విప్లవ పోరాటాలకు తెలంగాణా అనేక గుణపాఠాలు నేర్పింది కూడా. పోరాడేవారు ప్రజలు. "నీ బానిసోణ్ణి దొరా, నీ కాలికి మొక్కుతా" నన్నంతగా వెనకబడున్న జనం, వడిసెలరాయినుండి గ్రెనేడ్లవరకు, నాటు తుపాకులనుండి స్టెన్ గన్‌లవరకు ప్రయోగించి ఆ దొరలను-నైజాం నవాబు రజాకారులను తరిమికొట్టడమే గాక, యూనియన్ సేనలతో సైతం తారసిల్లి ప్రతిఘటించారంటే ప్రజల మనస్తత్వం ఏ పోరాటరూపాన్నయినా చేపట్టగలదనీ, ఏ పోరాట రూపానికైనా ఆ జనం సంసిద్ధతే మూలమనీ విదితం అయింది.

ప్రజల మనస్తత్వాలనుబట్టి పోరాటరూపా లుంటాయి. ప్రజలు ఏ పోరాట రూపానికి సిద్ధం అయితే ఆ పోరాటరూపాన వారికి నాయకత్వం వహించడానికి కమ్యూనిస్టులు సంసిద్ధులైవుండాలి. మారిన రాజకీయ, ఆర్థిక, సాంఘిక పరిస్థితుల ఆధారంగా ప్రజల సంసిద్ధత వుంటుంది. దీన్ని అర్థంచేసుకోలేని పిడివాదులు పిడుక్కీ, బియ్యానికి ఒకేమంత్రం అన్నట్లు, తమ బుర్రలోవున్న పైత్యాన్నే జనంపై రుద్దడా నికి ప్రయత్నించి పరాభవం పొందుతారు. విప్లవ పోరాటానికి మేలుకంటే కీడే ఎక్కువ తెచ్చిపెడతారు. తెలంగాణా పోరాటం ఆ కోవకు చెందినదిగాదు.

ఒక చారిత్రకావసరాన్ననుసరించి అది జన్మించింది. మారిన రాజకీయ, ఆర్థిక పరిస్థితులరీత్యా అది నిష్క్రమించింది. అయినా దాని ప్రభావం చరిత్రపై బడ్డది. భారత విప్లవోద్యమంలో విప్లవకారులు నిర్వహించవలసిన కర్తవ్యాలకు, పోరాటాలకు వెలుగుబాటలు తీర్చిదిద్దింది.

జనతా ప్రజాస్వామిక విప్లవంద్వారా సోషలిజం, కమ్యూనిజం అన్న మహత్తరాశయాల సాధనకు కంకణంగట్టిన వీరుల త్యాగనిరతికి నిదర్శనంగా అది మనముందున్నది. ఆ పోరాటంలో పాల్గొన్న వీరులచరిత్ర, వారనుసరించిన పోరాట రూపాలు, అందులో ప్రజలు చూపిన సాహసం, చేసిన త్యాగం- అన్నీ కంటికిగట్టి నట్లున్న గాథల సంకలితమే యీ పుస్తకం. నిస్సందేహంగా యీ సంకలనం చదువరు లకు చైతన్యవేదికగా ఉపయోగించగలదని భావిస్తున్నాను.

విజయవాడ
24-1-84

మోటూరు హనుమంతరావు



1

# వీర తెలంగాణా విప్లవ పోరాటం

1946 - 1951 మధ్య జరిగిన తెలంగాణా ప్రజల విప్లవ పోరాటం అనేక విజయాలను సాధించడమేగాక మన దేశానికి అత్యంత ప్రధానమైన వ్యవసాయ సమస్యను, జాతుల, భాషా రాష్ట్రాల సమస్యనూ శక్తివంతంగా భారత రాజకీయరంగం మీదకు తెచ్చింది. అంతేకాదు ; భారతదేశ ప్రజాతంత్ర విప్లవానికి సంబంధించిన వ్యూహం, ఎత్తుగడలకు సంబంధించిన మౌలిక సూత్రాలు, సిద్ధాంత సమస్యలను-దాదాపు అన్నింటినీ ఆ పోరాటం మన ముందుకు తీసుకొనివచ్చింది. ఎవ్వరూ నిర్లక్ష్యం చేయడానికి వీలులేనంతటి పటిష్టమైన రాజకీయ శక్తిగా కమ్యూనిస్టుపార్టీ రూపొందేలా ఆ పోరాటం సహాయపడింది. ఈవిషయాలన్నింటినీ క్లుప్తంగా సమీక్షించుతూ కామ్రేడ్ సుందరయ్యగారు 1972 లో రచించిన "వీరతెలంగాణా విప్లవ పోరాటం - గుణపాఠాలు"కు ఉపోద్ఘాతంగా రాశారు. దానిని పాఠకులకు అందజేస్తున్నాం-



— ఎడిటర్.

తెలంగాణా రైతాంగ సాయుధ పోరాటం 1951 అక్టోబర్ 21 వ తేదీన ఉపసంహరించుకోబడింది. ఆ ఉపసంహరణ జరిగి ఇప్పటికప్పుడే ఇరవై సంవత్సరాలు గడిచిపోయాయి. అయినప్పటికీ నైజాం పరిపాలన క్రిందనున్న ఆ ఫ్యూడల్ హైదరాబాదు సంస్థానంలో ఈ రైతాంగ పోరాటం ప్రజల సాయుధ తిరుగుబాటుగా ఎలా పెంపొందిందీ, 1948 సెప్టెంబర్ 13 వ తేదీన భారతసైన్యం ప్రవేశించగా నెహ్రూ ప్రభుత్వపు సాయుధ బలగాల అండదండలతో భూస్వాములు తిరిగి హస్తగతంచేసుకోకుండా గతంలో తాము పోరాడి సంపాదించుకున్న భూములను కాపాడుకొనడం కోసం సామాన్య రైతాంగం మూడు సంవత్సరాలపాటు వీరోచితమైన సాయుధ ప్రతిఘటన ఎలా సాగించిందీ క్లుప్తంగానైనా వివరించే సాధికార కథనమేదీ ఇంతవరకూ వెలువడలేదు. ఈ మహోద్యమానికి అగర్భ శత్రువులు, శత్రుతత్వంతో గూడిన విమర్శకులు మాత్రం ఈ పోరాటాన్ని కమ్యూనిస్టు "హింసాకాండ, బందిపోటుతనం, అరాచకత్వం"గా తెగనాడుతూ టన్నులకొలది పుస్తకాలను తయారుచేయించి ప్రచారంలో పెట్టారు.

ఆ పోరాటాన్ని-ప్రత్యేకించి 1948-51 సంవత్సరాల మధ్యకాలంలో సాగిన సాయుధ ప్రతిఘటనాదశను-ఒంటెత్తు పోకడగా, పిడివాదంగా, ప్రధానంగా వ్యక్తిగత దౌర్జన్యకాండగా చిత్రించడంలో మితవాద కమ్యూనిస్టులు నిమగ్నమైనారు. 1951 అక్టోబర్‌లో ఉపసంహరించడం ద్వారా తెలంగాణా పోరాటపు నాయకత్వం ఆ పోరాటానికి ద్రోహంచేసిందని నక్సలైట్ నాయకులు గుసగుసల ప్రచారం సాగిస్తున్నారు.

ఈ వీరోచిత రైతాంగ తిరుగుబాటు మొత్తంమీద సాధించిన లాభనష్టాలను బేరీజువేసి క్లుప్తంగా చెప్పుకుందాం : ఈ పోరాటంలో వీరతెలంగాణా రైతాంగమూ, ఈ రైతాంగ ప్రజల తిరుగుబాటుకు నాయకత్వ బాధ్యతను స్వీకరించిన కమ్యూనిస్టు పార్టీ విశాలాంధ్ర రాష్ట్రశాఖ అనుపమ త్యాగాలు చేశాయి. నాలుగువేలమంది కమ్యూనిస్టులు, రైతు యోధులు చంపివేయబడ్డారు. పదివేలమందికి పైగా కమ్యూనిస్టు కార్యకర్తలు, ప్రజాపోరాట కార్యకర్తలు మూడు నాలుగు సంవత్సరాల కాలం నిర్బంధ శిబిరాలలో, జైళ్ళలో బంధించబడ్డారు. కనీసం యాభై వేలకుతగ్గకుండా ప్రజలనుపోలీసు క్యాంపులలోకి, మిలటరీ క్యాంపులలోకి ఈడ్చుకెళ్ళి వారాల తరబడి, నెలల తరబడి చిత్రహింసల పాలుజేయడం, దెబ్బలు కొట్టడం, బీభత్సపరచడం జరిగింది. వేలాది గ్రామాలకు చెందిన అనేక లక్షల మంది ప్రజలపై పోలీసు దాడులు, మిలటరీదాడులు జరిగాయి. క్రూరమైన లాఠీదెబ్బలకు ప్రజలు గురిఅయ్యారు. ఈ మిలటరీ, పోలీసు దాడుల సమయంలో ప్రజలు లక్షల రూపాయల విలువజేసే ఆస్తులను కోల్పోయారు. ఆ ఆస్తులు లూటీ చేయబడడమో, ధ్వంసం చేయబడడమో జరిగింది. వేలాది మంది మహిళలు మానభంగాలకు, నానారకాల అవమానాలకు, అత్యాచారాలకు గురియైనారు. ఒక్కమాటలో చెప్పాలంటే- మొట్టమొదట్లో నైజాము, అతని రజాకార్ సాయుధ

మూకలు, ఆ తర్వాత కేంద్రప్రభుత్వానికి, హైదరాబాదు సంస్థానానికి చెందిన సాయుధ బలగాలు ఐదు సంవత్సరాలకాలం ఈ ప్రాంతం మొత్తంపైనా పాశవికమైన పోలీసు, మిలటరీ బీభత్సపాలన సాగించారు. పోలీసుచర్య అనంతరం వివిధరకాలకు చెందిన యాభై వేల మంది సాయుధ బలగాలను దించారు. హింసాకాండ ద్వారా ఈ ఉద్యమాన్ని అణచివేయడానికి, చెదిరిపోయిన భూస్వామ్య పాలనను పునరుద్ధరించడానికి ఆ సాయుధ బలగాలనుపయోగించారు. కాశ్మీరు సమస్యపై భారతప్రభుత్వం 1947-48 సంవత్సరాలలో పాకిస్థాన్‌తో యుద్ధం చేయడానికి ఎంత డబ్బు ఖర్చుచేసిందో అంత డబ్బును, వనరులను ఆనాడు హైదరాబాద్‌లో ఉపయోగించిందని కొన్ని అనధికార అంచనాల వల్ల తేలింది.

అంతటితోనే ఈ చిత్రీకరణ సమగ్రం కాజాలదు. మరోవైపు రైతాంగ తిరుగుబాటు సాధించిన అమోఘమైన విజయాలను చిత్రీకరించినప్పుడే ఈ గాథ పూర్తి కాగలదు. ఈ పోరాట కాలంలో ఎక్కువగా నల్గొండ, వరంగల్, ఖమ్మం జిల్లాలకు చెందిన పదహారు వేల చదరపు మైళ్ళ విస్తీర్ణంగల ప్రదేశంలో సుమారు ముప్పయి లక్షల జనాభా కలిగిన దాదాపు మూడువేల గ్రామాలలో రైతాంగం పోరాటం సాగించింది. ఆ పోరాట ఫలితంగా ఆ ప్రాంతాలలో పంచాయతీల ప్రాతిపదికగా గ్రామ రాజ్యాలను నెలకొల్పుకోగలిగారు. తాము ద్వేషించే భూస్వాములను ఆ గ్రామాలనుండి "గడీ"లని పిలువబడే కోటలవంటి వారి గృహాలనుండి ప్రజలు తరిమివేశారు. వారి పొలాలను రైతాంగం స్వాధీనపరచుకుంది. గ్రామీణ ప్రాంతాలలో నైజాం నిరంకుశ పాలనకు మూల స్థంభాలుగా వున్నది ఆ భూస్వాములే. ప్రజా కమిటీల ఆధ్వర్యాన పది లక్షల ఎకరాల భూమి రైతాంగానికి పంపిణీ చేయబడింది. పేదఋణాలన్నీ నిలుపు చేయబడ్డాయి. వెట్టిచాకిరీ రద్దు చేయబడింది. వడ్డీ వ్యాపారంలో సాగుతున్న కొల్లగొట్టే అత్యధిక వడ్డీరేట్లను తీవ్రంగా తగ్గించివేయడమో మొత్తంగా రద్దు చేయడమో జరిగింది. వ్యవసాయ కార్మికుల రోజు కూలీ పెంచబడింది. కనీస వేతనం అమలుపరచబడింది. పీడించే ఫారెస్టు అధికార బృందమంతటినీ ఆ ప్రాంతంలోని అడవులనుండి వెళ్ళగొట్టడం జరిగింది; దీనితో ఆటవిక తెగల ప్రజలు, ఆ ప్రాంతానికి ఆనుకొని నివసిస్తున్న ప్రజలు తమ శ్రమఫలితాన్ని స్వేచ్ఛగా అనుభవించగలిగారు. 12 నుండి 18 మాసాల కాలం ఈ ప్రాంతాలలోని పరిపాలన నంతటినీ గ్రామ రైతు కమిటీలే నిర్వహించాయి. నైజాం నిరంకుశ పాలనకు వ్యతిరేకంగా ఈ పోరాటం సాగించేక్రమంలో నైజాం పోలీసుల సాయుధ దాడులబారినుండి రైతాంగానికి రక్షణ కల్పించడం కోసం ప్రజలు పదివేలమంది గ్రామదళ సభ్యులు, దాదాపు రెండు వేలమంది గెరిల్లాదళ సభ్యులతో కూడిన శక్తివంతమైన సాయుధ బలగాన్ని నిర్మించుకోగలిగారు. లక్షలాది ప్రజలు తమ జీవితంలో మొట్టమొదటిసారిగా రెండుపూటలా భోజనం చేయగలిగారు. ఒక్కమాటలో చెప్పాలంటే చారిత్రాత్మకమైన ఈ రైతాంగ తిరుగుబాటు అసఫ్‌జాహీ వంశపు మధ్యయుగాలనాటి నిరంకుశ పాలనను మొదలంటా కుదిపివేసింది. ఆ పాలనపై చావుదెబ్బకొట్టింది.

వ్యావసాయక విప్లవ సమస్యను ముందుకు తీసుకొనివచ్చి అవెంతటి లోప భూయిష్టమైనవైనా - అరకొరచర్యలైనా - వివిధ వ్యావసాయిక సంస్కరణలు ఇష్టంలేని కాంగ్రెస్ నాయకులు చేపట్టటం తప్పనిసరి అయ్యేట్లు చేసిన ఖ్యాతి ఈ వీరోచిత రైతాంగ పోరాటానిదే. రైతాంగాన్ని శాంతింపజేసే కార్యక్రమం పేరుతో కమ్యూనిస్టువ్యతిరేక ప్రచారం చేయడానికి కాంగ్రెసు నాయకులచే అక్కడకుపంప బడిన సర్వోదయనాయకుడు శ్రీ వినోబాభావే ఈ పోరాటం జరుగుతున్న సమయంలోనే భూదానమనే ఊహాజనిత ఉద్యమాన్ని ప్రారంభించాడు. బూర్జువా,భూస్వామ్యపాలకుల తియ్యనికబుర్లతో, ఆడంబరమైన వాగ్దానాలతో భూసమస్య ఎన్నిటికీ పరిష్కారం కాదని, శక్తివంతమైన సంఘటిత, సమరశీల ప్రజాపోరాటం మాత్రమే భూసమస్యను పరిష్కరించగలదనే సత్యాన్ని ప్రజలు గ్రహించగలిగింది. సుదీర్ఘమైన ఈ భీషణ పోరాటం సాగుతున్న రోజులలోనే.

భాషా ప్రయుక్తంగా మన దేశంలో రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ త్వరగా జరగడానికి, ఛిన్నాభిన్నమైన-చెల్లా చెదురుగావున్న అనేకజాతులు తమ చిరకాల వాంఛితమైన ప్రత్యేక రాష్ట్రాలను సాధించుకొనటానికి తెలంగాణా పోరాటం దోహద పడింది. దీనిపాత్ర తక్కువేమీకాదన్న విషయాన్ని కూడా మనం గుర్తించుకోవాలి. దేశంలోకెల్లా అతి పెద్దదైన హైదరాబాదు సంస్థానంలో నైజాం నవాబు పాలనపై ఈ పోరాటం కొట్టిన శక్తివంతమైన దెబ్బలే 1952 లో పొట్టి శ్రీరాములు ఆత్మార్పణ అనంతరం ఆంధ్రరాష్ట్ర సాధనకోసం పోరాడేందుకు ఉత్తేజాన్ని కలిగించాయి. ఆ తర్వాత 1956 లో భారతదేశమంతటా భాషా ప్రయుక్త రాష్ట్రాల నిర్మాణానికి ఆంధ్రరాష్ట్ర నిర్మాణమే మార్గాన్ని సుగమంచేసింది. పూర్వపు బ్రిటిష్ పాలకులు సూత్రరహితంగా, నిరంకుశంగా భారతదేశంలో ఏర్పరచిన పరిపాలనా రాష్ట్రాల జాతుల విభజనను అంతం చేసేట్లుగా కాంగ్రెసు నాయకత్వాన్ని మెడలు వంచింది కూడా ఈ తెలంగాణా పోరాటపు ప్రభావమే. భారతదేశపు రాజకీయపటాన్ని జాతీయ, ప్రజాతంత్ర, భాషా ప్రాతిపదికపై తిరగ రాయడానికి ఆ విధంగా వీర తెలంగాణా రైతాంగ పోరాటం అసమానమైన పాత్రను నిర్వహించింది.

ఈ చరిత్రాత్మకమైన తెలంగాణా పోరాటానికి నాయకత్వం వహించి అతి దారుణ నిర్బంధకాండకు గురియై అగణిత త్యాగాలతో గర్వకారణమైన పాత్ర వహించింది కమ్యూనిస్టుపార్టీ. కేరళలో వాయలార్ - పున్నప్రా పోరాటానికి నాయకత్వం వహించిందీ, యుద్ధానంతరం బెంగాల్ లోసాగిన కార్మికవర్గపోరాటాలకు, రైతాంగపోరాటాలకు నాయకత్వంవహించిందీ కమ్యూనిస్టుపార్టీయే. ఈ కారణంగానే కమ్యూనిస్టుపార్టీ జాతీయ రాజకీయరంగంలో విస్తృతంగా గుర్తించబడింది. ఎవ్వరూ నిర్లక్ష్యం చేయడానికి వీలులేనంతపటిష్టమైన రాజకీయశక్తిగా పార్టీ రూపొందింది. భారతదేశంలోని కోటానుకోట్ల ప్రజల భవితవ్యాన్ని తీర్చిదిద్దటంలో అప్పటివరకు సమరశీల కార్మికశ్రేణులకు చెందిన స్వల్పశక్తిగావుంటూవచ్చిన కమ్యూనిస్టుపార్టీ

952 సార్వత్రిక ఎన్నికల అనంతరం మొట్టమొదటి పార్లమెంటులో అన్నింటికంటె పెద్దదైన ప్రతిపక్షగ్రూపుగా రూపొందే ప్రతిష్టను, గౌరవాన్ని సాధించుకోగలిగింది.

చివరకు తెలంగాణా రైతాంగ తిరుగుబాటు భారతదేశంలో కమ్యూనిస్టు ఉద్యమానికి అత్యంత ప్రాధాన్యతగల ఒక బ్రహ్మాండమైన మేలుచేసింది. అదేమంటే భారతదేశ ప్రజాతంత్ర విప్లవానికి సంబంధించిన వ్యూహం, ఎత్తుగడలకు చెందిన మౌలిక సూత్రాలు, సిద్ధాంత సమస్యలను దాదాపు అన్నింటినీ ఈ పోరాటం ముందుకు తెచ్చింది. వాటికి సవ్యమైన - శాస్త్రీయమైన సమాధానాలను, వాస్తవికతతో కూడిన ఆచరణాత్మకమైన పరిష్కారాలను వెదకవలసిన అవసరం ఏర్పడింది. జనతా ప్రజాస్వామ్య విప్లవంలో రైతాంగం పాత్ర, సాయుధ ప్రతిఘటనకు, గ్రామీణ విప్లవాలకు గల స్థానం ప్రాధాన్యత, రైతాంగాన్ని ఖచ్చితంగా వర్గీకరించడం రైతాంగంలోని వివిధ తరగతులు విప్లవంలో నిర్వహించే పాత్ర, భారతదేశ విప్లవలక్ష్యం, మన విప్లవంలో కార్మికవర్గానికి, పట్టణ కేంద్రాలకుగల నిర్దిష్టమైన స్థానం పాత్ర, కార్మిక వర్గ నాయకత్వం అన్న భావానికిగల ఖచ్చితమైన అర్థం, దీనికిగల ప్రభావం ఆధునిక కార్మికవర్గం జనాభాలో నూరింట ఒకటికి మించని - అభివృద్ధి చెందని వెనుకబడిన దేశంలో ఆ నాయకత్వాన్ని సాధించడంలో కమ్యూనిస్టు పార్టీ నిర్వహించవలసిన పాత్ర-మొదలయిన సమస్యలన్నీ ముందుకువచ్చాయి. పార్టీలో అంతర్గతంగా చర్చలు జరిపి వానిపై నిర్ణయాలు తీసుకోవలసిన ఆవశ్యకత ఏర్పడింది. చారిత్రక పరిణామం, అనుభవమూ ఫలితంగా దీర్ఘకాలంపాటు జరిగిన పార్టీ ఆంతరంగిక పోరాటం అనంతరం ఈ సమస్యలలో చాలావాటికి సంతృప్తికరమయిన సమాధానాలు లభించాయి. చాలావరకు సవ్యమయిన రాజకీయపంథాను రూపొందించుకొనడానికి పార్టీకిఅవకాశం కలిగింది.

పోరాటం సాగుతున్న కాలంలో - ప్రత్యేకించి ఆ పోరాటంలోని చివరి రెండుసంవత్సరాల కాలంలో - కమ్యూనిస్టుపార్టీ పైనుండి క్రిందవరకూ రెండుప్రత్యర్థి శిబిరాలుగా చీలిపోయిన విషయం కూడా ఇక్కడ ప్రస్తావించవలసిన అవసరం వుంది. ఒక శిబిరం పోరాటాన్ని, దాని విజయాలను సమర్థించేదిగాను, రెండోది ఆపోరాటాన్ని బీభత్సకాండ అని, ఇంకేమేమో అని తెగనాడేదిగాను చీలిపోయింది. ఈ పోరాటాన్ని వ్యతిరేకించినవారు బహిరంగంగా పత్రికలకెక్కారు కూడా. ఆ పోరాటంపైన దానికి నాయకత్వం వహించిన కమ్యూనిస్టు పార్టీపైన బురద చల్లడానికి అవకాశం కల్పించారు. నిశితమైన ఈ రాజకీయ, సిద్ధాంత సంబంధమైన చీలిక దేశంలో మొత్తంపార్టీలో ప్రబలింది. అయితే ఈ వీరోచిత రైతుపోరాటంలో ప్రత్యక్షంగా నిమగ్నమైయున్న విశాలాంధ్ర కమిటీలో ఈ చీలిక ప్రత్యేకించి మరింత నిశితంగాను, తీవ్రతరంగాను ఏర్పడింది. 1951 అక్టోబరులో తెలంగాణా సాయుధ ప్రతిఘటనను ఉపసంహరించిన అనంతరం పార్టీలో సాధించబడినది కేవలం లాంఛనప్రాయమైన - తాత్కాలికమైన

పైపై ఐక్యత మాత్రమేనని : ఆ చీలిక నిజానికి రెండు ప్రత్యర్థి రాజకీయ ధోరణుల మధ్య గండిగా స్థిరపడిపోయిందని ఆ తర్వాత చరిత్ర రుజువుచేసింది.

1962-63 లో పార్టీలో ఏర్పడిన చీలిక సందర్భంగా విశాలాంధ్ర రాష్ట్ర కమిటీ విభజన 1950-51 పార్టీ అంతర్గత పోరాటంనాటి విభజన స్వరూప స్వభావాలనే దాదాపుకలిగివుండడం యాదృచ్ఛికమేమీకాదు; ఇది ప్రత్యేకించి గమనించవలసిన విషయం. తమ విశ్వాసాలను, రాజకీయాభిప్రాయాలను మార్చుకున్న బహుకొద్దిమంది కమ్యూనిస్టు నాయకులు, కార్యకర్తలు మినహా ఏదో ఒక సందర్భంలో తెలంగాణా పోరాటానికి వ్యతిరేకంగా నిలచినవారంతా సంస్కరణవాద రివిజనిస్టు మితవాద కమ్యూనిస్టుపార్టీలో చేరిపోవడానికే నిర్ణయించుకున్నారు. ఆ పోరాటాన్ని తుదకంటా బలపరిచినవారిలో అత్యధిక సంఖ్యాకులు భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు) వెనుక దృఢంగా నిలిచారు. తెలంగాణా పోరాటాన్ని- వీరోచితమైన ఈ రైతాంగ ప్రతిఘటనోద్యమాన్ని నడిపేసమస్య చుట్టూ పార్టీలో అంతర్గతంగా తలెత్తిన పలు విభేదాలను దృష్టిలోకి తీసుకోకుండా నిర్లక్ష్యంచేస్తే భారత కమ్యూనిస్టు ఉద్యమాన్ని గూర్చి అధ్యయనంచేసే వారెవరయినా 1962-63 లో చీలిక అనివార్యం అవటానికి దారితీసిన మూలకారణాన్ని గ్రహించజాలరు.

ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలలో కమ్యూనిస్టు ఉద్యమం ప్రారంభమైనప్పటినుండీ ఆ ఉద్యమాభివృద్ధితో సన్నిహితంగా సంబంధం కలిగివుండే అవకాశం నాకు కలిగింది. అలాగే తెలంగాణా పోరాటంలోని వివిధ దశలతో నాకు సన్నిహిత సంబంధం వుంది. అంతేకాదు, తెలంగాణా విజయాలన్నింటినీ పూర్తిగా హరింపజేయడానికై సాయుధపోరాటం ఉపసంహరణ అనంతరం గత రెండు దశాబ్దాలుగా కాంగ్రెసు భూస్వాములు ప్రయోగిస్తున్న క్రూరనిర్బంధాన్ని, అత్యాచారాలను ఎదుర్కొని సాగిస్తున్న పోరాటంతోనూ నాకు సన్నిహిత సంబంధం వుంది.

ఆ మహత్తర పోరాటం యొక్క అమూల్యమైన వివిధ విప్లవానుభవాలను, గుణపాఠాలను గూర్చి కనీసం క్లుప్తంగానైనా వ్రాయటం నా ప్రాథమిక బాధ్యతగా పరిగణిస్తున్నాను. గత రెండు దశాబ్దాలకాలంలో ఈ బాధ్యతను నిర్వర్తించలేకపోయాను. ఆనాడు తెలంగాణా పోరాటంలో ఆర్గనైజర్లుగా పనిచేసిన వారినుండిఅందిన నివేదికలోని వాస్తవిక సమాచారం ప్రాతిపదికగా, ఆనాడూ, ఈనాడూ కూడా అచ్చటి ఉద్యమంలో నిమగ్నమైయున్న అనేకమంది ప్రముఖ కామ్రేడ్స్ వ్యక్తిగత అనుభవాల ప్రాతిపదికగా తెలంగాణా పోరాట చరిత్రను వివరించడానికి ఇక్కడ ప్రయత్నించాను. తెలంగాణా పోరాటం నుండి మనం నేర్చుకొనవలసినవిగా నేను భావిస్తున్న కొన్ని అనుభవాలను, గుణపాఠాలను కొన్నింటిని ఈ రచన ద్వారా అందజేస్తున్నాను

పి. సుందరయ్య.



2

# అచంచలయోధుడు చిర్రావూరి జ్ఞాపకాలు

కామ్రేడ్ చిర్రావూరి లక్ష్మీనర్సయ్యగారి జ్ఞాపకాల నుండి, యీ అంశం తీసుకున్నాం. ఆయన మాటల్లోనే ఆయన గురైన నిర్బంధకాండ ఆయన చెప్పారు. ఎన్నో విధాలుగా శారీరక, మానసిక చిత్రహింసలకు గురైనా, ఎర్రజెండాపై అచంచల భక్తిప్రపత్తులతో, పార్టీ రాజకీయాలపై చెక్కుచెదరని విశ్వాసంతో నేటివరకూ, మొక్కవోని దీక్షతో నిలబడిన కామ్రేడ్ చిర్రావూరి అనుభవాలు యువతరానికిఆదర్శప్రాయం, వుత్తేజపూర్వకం కాగలవని ఆశిస్తాము.

ఆయన గురైన చిత్రహింసలు- ఆయన ధైర్యంగా అందుకు తలవొగ్గకుండా నిలిచిన తీరు మాత్రమే యీ వ్యాసం పరిధి, ఆయన జ్ఞాపకాలను, వేరే ఒక చిన్న పుస్తకంగా తర్వాత తీసుకురాగలం. — ఎడిటర్.

1946 లో ఢిల్లీలో సంస్థాన ప్రజాప్రతినిధుల సభజరిగింది. నారాయణరెడ్డి గారు, నేను ఆ సభలో పాల్గొన్నాం. బూర్గుల, రామానందతీర్థ వగైరాలుకూడ వచ్చారు. కాశ్మీర్ నుండి షేక్ అబ్దుల్లా, అబ్దుల్లా భార్య కూడ వచ్చారు. అప్పుడు కాశ్మీర్‌లో బలీయమైన ప్రజా ఉద్యమం కొనసాగుతూవుంది. ఆ సభకు వచ్చిన గులాం మహమ్మద్ సాదిక్‌గారు కమ్యూనిస్టుగానే వచ్చారు. అప్పుడే వారు పరిచయం అయ్యారు. సాదిక్‌గారు తర్వాత చీఫ్ మినిష్టరు గూడ అయ్యారు

బలీయమైన ప్రజా ఉద్యమ నిర్మాణంద్వారానే సంస్థానాధీశులనుంచి సంస్థానాలను ఇండియన్ యూనియన్‌లో విలీనం చేసుకోవలననే ధోరణిని నెహ్రూగారు ప్రదర్శించగా, సంస్థానాధీశులు గూడ దేశీయులేకాబట్టి, వారిని అనునయించి ఇండియన్ యూనియన్‌లో విలీనంచేసుకోవడమే మంచిదనే వాదన వల్లభాయి పటేలుగారిదిగా వుండేది. ఈ సభలో మాట్లాడిన బూర్గులవారు వల్లభాయిని బలపరచగా, తీర్థాగారు నెహ్రూవాదాన్ని బలపరిచారు. వల్లభాయిని బలపర్చిన బూర్గులవారు తర్వాతకాలంలో ముఖ్యమంత్రి అయ్యారు.

ఢిల్లీ వెళ్ళిన మమ్మల్ని అక్కడే అరెస్టు చేయవచ్చుననే హెచ్చరిక ఇక్కడే చేయబడింది. మేము విజయవాడనుండి సరాసరి ఢిల్లీ వెళ్ళాం. ఢిల్లీలో మేము దిగినప్పటినుండి సి. ఐ డి. లు మమ్మ వెంటాడుతూనే వున్నారు. సభలు పూర్తి కాగానే తిరిగి బయలుదేరేం. అయితే ఈసారి సరాసరి ఢిల్లీనుండి ఖమ్మం రాకుండా మధ్య భారత్‌లోని రాయ్‌పూర్‌నుండి వైజాగ్‌మీదుగా విజయవాడ చేరి అక్కడనుండి సరాసరి మానుకోట చేరేను.

ఇక్కడనుండే నా రహస్య జీవితం ఆరంభమైంది. అయితే నిజాంకాలంలో రహస్యజీవితం వొకవిధంగా బహిరంగరహస్యమే. ఎందుకంటే సాధారణంగా నిజాం మిలటరీగాని, పోలీసు, రజాకార్ తదితర మూకలు పల్లెల్లోకి అడుగుపెట్టడానికి సాహసించేవి కావు. వందలసంఖ్యలో వుంటే తప్ప వాళ్ళు వూళ్ళల్లోకి వచ్చేవాళ్ళ కాదు. వాళ్ళకు సమాచారం చేరవేసే వాళ్ళుకూడ చాలా అరుదుగా వుండేవాళ్ళు. సాధారణంగా వుండేవాళ్ళు కాదు. వాళ్ళు వెయ్యి, పదిహేనువందలు, రెండువేలమంది సంఖ్యలోనే పల్లెలపై దాళ్ళు, దోపిడీలు, కిరాతక చర్యలు చేయడానికి వచ్చి చేసే వాళ్లు. అలాంటి సమయాల్లో పల్లెల్లో జనం సాధారణంగా వూళ్ళను ఖాళీచేసి ఎక్కడో వొకచోట తలదాచుకొనేవారు. పల్లెలు దాదాపుగా పార్టీ అదుపు ఆజ్ఞల్లోనే వుండేవి. వెల్లువలా శత్రువు యెగసి మీదపడుతున్నపుడు వొదిగివుండి శత్రువు వెను దిరగగానే దళాలు మళ్ళా తమ కార్యక్రమాలు చేపడుతూ వుండేవి. వొకోక్కసారి వీలువెంట వెన్నంటి దాళ్లుకూడ చేసేవాళ్ళం.

ఫ్యూడల్ భూస్వామ్యశక్తులనుండి ఆయుధాలు స్వాధీనపరచుకోవలసిందిగాను, ధాన్యాగారాలు స్వాధీనపరచుకొని నిరుపేదలకు పంచవలసినదిగానూ, గ్రామ రక్షణదళా

లను, ప్రాంతీయ దళాలను, ప్రతిఘటనా దళాలను ఏర్పరచవలసినదినుగాపార్టీ పిలుపు ఇచ్చింది.ఈ పిలుపు అందగానే ప్రతిపల్లెలోను నిరుపేదవ్యవసాయకూలీవర్గంనుండియే గాక, పేద, మధ్యతరగతి రైతాంగంనుండి నిజాం వ్యతిరేక పోరాటంలోకి ఫ్యూడల్ భూస్వామ్య వర్గాల దోపిడీ దుర్మార్గ కిరాతకాలనుండి రక్షణకుగాను ప్రవాహంలాయున లోకం కదిలింది. ధనిక రైతాంగంకూడా వుండేది. వాళ్ళ పీడనకు గురిఅయే చిన్న చిన్న వ్యాపారవర్గాలుకూడా తోడ్పాటు ఇవ్వడానికి ముందుకువచ్చాయి ఒకళ్ళిద్దరుమినహా ఫ్యూడల్ భూస్వామ్యశక్తులు దళాలు ఏర్పడిన తర్వాత పల్లెలు వదలి పారిపోయేరు. ఆ మిగిలిన ఒకళ్ళిద్దరు నిరంతరం నిజాం మిలిటరీ కాపలా మధ్యనే గడిపారు. ఆఖరిలోవాళ్ళు పరారీ చిత్తగించారు. చాలామంది లొంగిపోయేరు.

మొదటిలో చెప్పుకోదగిన ఆయుధాలుయేవీ వుండేవికావు. ఆమాటకువస్తే నిజాంమిలటరీవద్దతప్ప పోలీసులవద్ద, రజాకార్లవద్ద, గొప్పగాచెప్పుకోదగిన ఆధునిక ఆయుధాలు యేమీవుండేవికాదు. కఱ్ఱ, కత్తి, వడిసె, బరిసె మనప్రధాన ఆయుధాలు, బర్మారోలు, నాటుతుపాకులు వుండేవి.

పనివిభజనచేసి కార్యక్రమాలు జయప్రదంగా జరిగేవిగా వుండేయేర్పాట్లు చేయబడ్డాయి. గ్రామరక్షణ దళాలు, ఏరియా దళాలు, పోరాట దళాలు - ఇలా ఏర్పాటు చేయబడ్డాయి. ఆర్గనైజింగు విభాగం వేరుగావుండేది.

ఆయుధసేకరణలో భాగంగానే సిండిపోలు జగన్నాధరెడ్డి గడీపై దాడిచేయాలని నిశ్చయించాం. ఇతడుమహాపీడకుడిగా పేరుబడినవాడే. రాయల వెంకటనారాయణ మొదలైన చాలామంది ఇతనినిర్బంధాలకు గురియైనవారే. గడీముందువరకూవచ్చినాక కొందరు జారిపోయారు. గడీలో ప్రవేశించాం. ఆయుధధారియైన వొకగిర్దావరు కూడ అక్కడేవున్నాడు. ఆయుధాలులేవని జగన్నాధరెడ్డి బుకాయించేడు. ఆయనను బంధించి ఆయుధాలుస్వాధీనం చేసుకొన్నాం. అలాగే గిర్దావరును కూడా బంధించి ఆయుధం తీసుకొన్నాం. ఆ తర్వాత ధాన్యం స్వాధీనంచేసుకొని ప్రజలకుపంచాం.

సరిగ్గా యీ కాలంలోనే కాంగ్రెస్ పార్టీకూడా నిజాంకువ్యతిరేకంగా గెరిల్లా యుద్ధం ప్రారంభించినట్లు ఆంధ్రప్రభలో వొక ప్రకటన ద్వారా తెలిపింది. చందాలు వసూలుచేసి సరిహద్దుల్లోకి పారిపోవడం యిక్కడేదో పొడిచి గెలిచినట్లు అక్కడ డంభాలు కొడుతూ గడపడం వీళ్ళ పనిగా వుండేది. యిలాంటి ముఠాలలో ఓ ముఠాకు కృష్ణారెడ్డి అనేవారు లీడరుగా వుండేవారు. మనం పల్లెల్లో స్థిరపడిపోయాక వీళ్ళజాడ పూర్తిగా లేదనే చెప్పాలి.

నేను ముఖ్యంగా ఆర్గనైజింగు వ్యవహారాలను చూస్తూ వుండేవాణ్ణి. మంచి కంటి, తీగెల మొదలైన వారు పోరాట దళాలైన సెంటరుదళాల వెంట వుండేవారు. ఆయుధసేకరణ, ధాన్యపంపకం, దళాల నిర్మాణ కార్యక్రమాలతోబాటు 1947 లో ఫ్యూడల్ భూస్వాముల భూములను పంపకం చేయడం అనే కార్యక్రమం కూడా

చేపట్టడం జరిగింది. పంపకాలు జరిగాయి. పార్టీ పిలుపు వినబడగానే వేలాది ప్రజలు కదిలేవారు. భూస్వాముల రక్షణ దుర్గాల్లా వున్న గడీలు కొన్ని నేలమట్టంచేయబడ్డాయి. ఫ్యూడల్ భూస్వామ్య శక్తులు పల్లెల నుండి పారిపోయారు. లేదా పూర్తిగా లొంగిపోయారు నిజాం మిలటరీ, పోలీసు, రజాకార్ బలగాలు కూడా పల్లెల్లో అడుగుపెట్ట సాహసించలేకపోతున్నాయి. యిలా నిజాం పాలనా యంత్రాంగం పల్లెల్లో తుడిచి పెట్టుకుపోవడంతో గ్రామాల్లో శాంతి భద్రతల బాధ్యత పార్టీ స్వీకరించవలసివచ్చింది. స్వీకరించింది. అలాగే పల్లెల్లో సహజంగా ప్రజల మధ్య తలయెత్తే చిన్నా పెద్దపంచాయతీలను పరిష్కరించవలసివచ్చేది. అలాపంచాయతీ వ్యవహారాలుపరిష్కరిస్తుండేది. అంతేకాదు. అంతక్రితం యెంతోకాలంగా అపరిష్కృతంగా వున్న పంచాయతీలు కూడ పరిష్కరించడం జరిగింది.

గ్రామ పాలనా వ్యవస్థ సంపూర్ణంగా పార్టీ అధీనంలోవుందని చెప్పవచ్చు. పోలీసుకు సమాచారం చేరవేసేవాళ్లు ఈ కాలంలో సాధారణంగా వుండేవాళ్లుకాదు. ఎవరైనావుంటే వారి విషయం మనదృష్టికివస్తే తీవ్రదండన వుండేది. ప్రజలు వాణ్ణి బ్రతకనిచ్చేవాళ్లుకాదు

జల్లేపల్లి దాడిలో కిషన్‌రావు, నెల్లికుదురు దాడిలో తీగెల సత్యనారాయణ తీవ్రమైన గాయాలకు గురియైనారు.

ఈ రోజుల్లోనే పెద ముప్పారం ప్రజలు పోలీసులనుండి తుపాకులు గుంజుకొన్నారు. కంది,జొన్నచేలు బాగా యేపుగా పెరిగివున్న రోజులవి. అక్కడివారిని కలిసేందుకు ఒక రాత్రి పెదముప్పారం వెళ్ళాను. వూరంతా తిరిగాను. కలువవలసిన వారినందరిని కలిశాను. అప్పటికి చాలా ప్రొద్దుపోయింది. ఏ క్షణంలోనయినా నిజాం మిలిటరీ పోలీసు, రజాకార్ మూకలు వూరిమీదపడవచ్చు. అవమానంతో పారిపోయిన పోలీసుపిచ్చికుక్కల్లా రెచ్చిపోవచ్చు. అప్పటికే జనంకూడా ఎటువాళ్ళు అటు సర్దుకొంటున్నారు. ఆయుధాలు ముందే అక్కడినుండి సురక్షిత ప్రాంతాలకు చేరాయి. నేను అక్కడినుండి బయలుదేరి పెదముప్పారం,సూరేగుమ్మడిల మధ్యకు వచ్చాను. అక్కడవో కుంట ఒడ్డున గుడిశె వుంది. గుడిశకాడ వున్న ముసలయ్య ఒక నులక కుక్కిమంచం యిచ్చాడు. అలసటవల్ల కాబోలు నిదుర బాగా పట్టింది. తెలివిరాలేదు తెల్లవారుతూ వుంది. దాదాపు అయిదు వందలనుంది నిజాం మిలిటరీ, పోలీసు, రజాకార్ మూకలు ముప్పారాన్ని అన్నివైపులనుండి ముట్టడించి దగ్గరకు వస్తున్నాయి. ఇటు సూరేగుమ్మడి వైపునుండికూడా చుట్టుముట్టుకవస్తున్నాయి. అంటే నేను, నాతోవున్న కామ్రేడ్ వాళ్ళ చక్రబంధంలో ఇరుక్కుపోయాం. దిగ్గున లేచిచూద్దుంగదా దగ్గరకు వచ్చేస్తూనేవున్నారు. ఒకవైపు మాత్రం ఒక ఫర్లాంగు ఎడంవుంది. ఈ సందు గుండా తప్పుకోడానికై పరుగు లంకించుకున్నాం. నేనంతగాపరుగెత్తగలిగేవాడినికాదు. మొదటనుండి కాస్తి బొద్దుగా స్థూలకాయుడిలా వుండేవాడిని. నావద్ద స్టెన్‌గన్‌కూడా వుంది. ఎలాగో వాళ్ళ చక్రబంధం నుండి తప్పుకుపోయాం.

ఆకాలంలోనే ఒకనాడు జగ్గయ్యపేట దగ్గరగల పోలంపల్లివెళ్ళి ముఖ్యుని కలిసి తిరిగివస్తున్నాను. నావెంటమరియొక కామ్రేడ్ కూడ వున్నాడు అపుడు తెల్లవారు ఝాము. మంచుదాగాకురుస్తుంది. చీకటి. ఆ చీకటిలో, మంచులో కాకీడుస్తులలోవున్న పోలీసులు కనబడలేదు. దగ్గరదాకావచ్చేరు. ఎటూపరుగెత్తే అవకాశం కూడా లేదు. వాడికి ప్రేటుదూరంలోకే వచ్చాం. గబుక్కున నేలమీదపడిపోయి కొంతలెక్క ఆ చీకటిలో దొల్లుకొంటూపోయి పరుగులంకించుకొన్నాం. పెదముప్పారం సంఘటనలో రెండుమైళ్ళదాకా పరుగెత్తవలసి వచ్చింది గాని యీసారి అంతప్రయాస లేకుండా తప్పుకోగలిగాను.

రాయపాడు ధాన్యం నాగువ్యాపారులపై దాడిచేసేం. ఈ దాడిలోవందలాది జనం మనవెంటకదలిధాన్యంపంచుకున్నారు. నాల్గురోజులపాటు సుమారు నాలుగువందల పుట్ల ధాన్యందాకాజనం పంచుకున్నారు. ఇంకా అతనివద్దధాన్యం మిగిలిపోయింది. ఆనాడు మనపిలుపువింటే జనం అలావేలాదిగా కదిలివచ్చేది. తిరుణాళ్ళకుబయలు దేరినట్లు సంబరంతో బయలుదేరేవారు. బండ్లతో కదిలివచ్చేవారు.

చుట్టూరా నలువైపులా యెటు చూసినా గుట్టలు. అటునుండి ఆకేరు యిటు నుండి మునేరు మధ్యభాగం. అందులో ఒకగుట్ట. ఆ గుట్టకు ప్రకృతి సిద్ధంగా ఏర్పడిన పెద్ద గుహ. అంతా చిన్న పెద్ద చెట్లతో నిండిన చిట్టడవి. యీ దట్టమైన చిట్టడవి మధ్యలోని గుహయే మా కార్యాలయం. నివాస స్థావరం. ఆ గుహలోని రాయి, రప్ప, పుట్ట, బుడుసులు అన్నీ బాగుచేసి అందులో వుండేవాళ్ళం. ఈ ప్రాంత కార్యకలాపా లన్నింటికి యిదే కేంద్ర స్థానము.

ఎల్లారుగూడెం దాడిలో దళ నాయకుడు చంద్రయ్య నా కనులముందే చని పోయాడు. మేం తప్పుకొన్నాం. ఆ శవాన్ని శత్రువు స్వాధీనం చేసుకొని ఖమ్మం తీసుకవెళ్ళారు. ప్రజలను చూడనివ్వకుండా, దగ్గరకు రానివ్వకుండా వుంచి చచ్చిపోయిందినేనని చెప్పి ప్రచారం చేసేరు. ప్రజల స్థైర్యాన్ని దెబ్బతీయడం, గందరగోళం సృష్టించి ప్రజా వెల్లువను అరికట్టాలని శత్రువుతావత్రయం, ఎత్తుగడ.

నిజాంపై పోలీసు యాక్షన్ జరిగేవరకు మనదే పైచేయి, వారిఎంత మిలటరీ పోలీసు బలగమున్నా స్థానిక ప్రజాబలం మనకు వుండేది. అదే మన పెట్టని కోట. వారే మనకు అండదండ మనకు భోజనాలు పెట్టడం, రక్షణ యివ్వడం, అనుక్షణం శత్రుకదలికలను యెప్పటికప్పుడు తెలియచేయడం, దాడుల్లో పూర్తిగా సహకరించడం, తామూ పాల్గొనడం తమ బాధ్యతగా స్వీకరించారు. అది తమ రక్షణకు అవసరకార్యముగా భావించారు.

చిన్నచిన్న వర్తకులపై పోలీసు, రజాకార్ దౌర్జన్యాలులేవు. రైతులపైగాని, మరి యేవర్గాలపైన పన్నులభారంలేదు. బలవంతంగాప్రభుత్వంప్రజలనుండిశిస్తు కూడా

పనులు చేయలేకపోయింది ఏదైనా మారుమూల ప్రాంతంలో పట్వారీ యెవరైనా అలా చేశాడని పార్టీ దృష్టికి వస్తే వెంటనే వాడినుండి ఆ ధనం గుంజుకోవడంజరిగేది.

నిజాంపై పోలీసు యాక్షన్ జరిగిపోయింది. నిజాంపై పోలీసుయాక్షన్‌గా కొనసాగినా, ఇది మనలను చుట్టబెట్టి అందులోనే హతమార్చివేసే యాక్షన్‌గా కొనసాగింది యూనియన్ మిలటరీ పెద్దయెత్తున విరుచుకుపడసాగింది. మనకండదండలిస్తున్న ప్రజలపై క్రూరమైనదాడి ప్రారంభించింది. పల్లెలు వదలి పారిపోయిన ఫ్యూడల్ భూస్వామ్యవర్గాలను తిరిగి పల్లెల్లో ప్రవేశపెట్టింది వాళ్ళకు కాపలాదారుగా నిలబడింది వాళ్ళు చెప్పినట్లుచేయసాగింది.

మిలటరీ బలగాల అండతో భూస్వాములు, వాళ్ళ ఏజంట్లు పల్లెల్లో మన కదలికలను పోలీసులకు చేరవేయసాగారు. ప్రజలపై భయంకరమైన నిర్బంధాలు ఆరంభమైనాయి. ప్రజలు భయభ్రాంతులైపోయేలా, మనకు ఏమాత్రం సహకరించినా బ్రతకలేమనే భయంకలిగేలా వారిపై విరుచుకుపడసాగేరు పోలీసులు, మిలిటరీవాళ్లు, వాళ్ళ అండదండలతో తిరిగి పల్లెలకు చేరిన ఫ్యూడల్ భూస్వాములు, వాళ్ళ గూండాలు, ఏజంట్లు.

చాటుమాటుగా మనం సహాయపడుతున్నా "బాబూ మేం బ్రతికేలాలేదు. మిమ్మలను బ్రతకనివ్వరు. వెళ్ళి యెక్కడైనా రక్షణపొందండి" అంటూ అశక్తతతో తమ నిస్సహాయతను తెలుపసాగేరు.

నల్లగొండ ప్రాంతం నుండి బి. యన్., స్వరాజ్యం మొదలైనవారు యీ ప్రాంతాలకు వచ్చారు. సుందరయ్యగారు, దేవులపల్లి కూడ వచ్చారు. మా స్థావరం వారికి అప్పగించి మేం గార్లవైపు సాగిపోయాము. తర్వాత కొందరు జనగామ వైపు వెళ్ళిపోగా, మిగతా వారు గార్లవైపు కదలివచ్చేరు.

గాంధీజీ చనిపోయిన రోజున నేను కొత్తగూడెం ప్రాంతంనుండి ఖమ్మం పరిసరాలలోనే వున్న కైకొండాయగూడెం వచ్చాను. ఆ రోజుల్లో మాకు ప్రతి వారికి మామూలు మిలటరీ వాడికిలాగానే మోతబరువు సామాను వుండేది. ఒక గొంగళి, ఓ జత బట్టలు తప్పనిసరిగా వుండేవి. రాత్రికి ఖమ్మం వచ్చాను. ఖమ్మంలో ఓ మిత్రుని సహాయంతో విజయవాడ ట్రెయిన్‌కు టికెట్ తెప్పించుకొని విజయవాడ వెళ్ళాను. అక్కడకూడ అప్పటికే పార్టీ కార్యక్రమాలు ఛిన్నాభిన్నం చేయబడ్డాయి. కార్యాలయం విచ్ఛిన్నం చేయబడింది. నా కుటుంబం అక్కడే వుంటూవుంది. విజయవాడలో వుండే అవకాశం లేకపోయింది. అక్కడనుండి గుడివాడ పంపబడ్డాను. గుడివాడనుండి పార్టీ పిలుపుపై విశాఖపట్నం వెళ్ళాను. అప్పుడు అక్కడికి సమీపంలోనే వున్న అనకాపల్లి ప్రాంతంలో చెరకుతోటల్లో పార్టీ అత్యవసర సమావేశం జరిగింది. ఈ సమావేశంలో పాల్గొన్నాను. దళాలను రీఆర్గనైజ్ చేయాలని, మైదాన ప్రాంతాల నుండి, పల్లెలనుండి నిర్గమించి అడవుల్లో రక్షణ స్థావరాలు ఏర్పాటు చేసుకోవాలని

రక్షణ కవసరమైన యింకా అనేక ఇతర నిర్ణయాలు ఈ సమావేశంలోనే తీసుకో బడినాయి.

నేను ములుగు ప్రాంత ఆర్గనైజర్‌గా పంపబడ్డాను. మానుకోట దాకా దాని పరిధి విస్తరించియుండేది. మా రక్షణకు వొక సెంట్రల్ దళం వుండేది.

గతంలో మనకు మైదాన ప్రాంతాలలో యెలాంటి, రక్షణ సహకారం లభించిందో యీ అడవుల్లో అంతకంటే అధికమైన రక్షణ సహకారం లభించింది. గిరిజనులు మనకు సంపూర్ణ సహకారం యిచ్చారు. ఆ అడవుల్లో, వాగులు, వంకలు, కొండలు, కోనలు, లోయల్లో వొక చోటు నుండి వొకచోటికి వెళ్ళేదార్లు అవి వాళ్ళకు తప్ప యితరులకు తలవాదుకొన్నా అర్థం అయ్యేదికాదు. ఆ భయంకర అడవుల్లోకి అడుగుపెట్టాలంటే పోలీసు, మిలటరీ గూడ అంతగా సాహసించేదికాదు. పైగా కోయలు మొదలైన గిరిజనులకు, మన మంటే తప్ప తెల్లగుడ్డలవాళ్ళంటే శత్రుత్వం వుండేది. తెల్లబట్టల తెలివైనవాళ్ళ నిరంతర దోపిడియే అందుకు కారణం. యీ గిరిజనులు పూర్తిగా మనతోనే వుండిపోయేరు. మనను తమలో వొకరిగా చూచుకొనేవారు.

కటిక చీకటిలో సైతం మనవాళ్ల గురితప్పక కాల్చేవారు. పిండిపోలు వద్ద వున్న అశ్వికదళంపై గాడాంధకారమైన రాత్రి వర్షపు టైములో మనవాళ్ళు గుర్రాల సకిలింపు ఆధారంగా కాల్పులు జరిపి మూడు గుర్రాలను కూల్చారు. వొకటి అప్పటికప్పుడే మరణించింది

బహు అరుదుగా మనతో వున్నవారిలో ఎవరో ఒకరుచేసే పొరబాట్ల కారణంగా కూడ కొన్ని దుస్సంఘటనలు జరుగుతుండేవి. ఎప్పటికప్పుడు అలాటివారు తక్షణమే తీవ్ర హెచ్చరికలకు, శిక్షణాచర్యలకు గురిచేయబడుతూ వుండేవారు మేం ఒక్కొక్కళ్ళం యాభై గ్రామాలదాకా పర్యవేక్షిస్తూ వుండేవాళ్ళం.

ఒకసారి మాతోవున్న ఓ కామ్రేడ్ ఓ చిన్న పొరబాటుచేసాడు. ఆ విషయం మా దృష్టికి వచ్చింది. అతను భయపడిపోయాడు. మైదానంలోకి వెళ్ళివస్తానని చెప్పి వారందాకా తిరిగిరాలేదు. మాకు అనుమానం వేసింది. బైటికివెళ్ళిన వ్యక్తి అనుకున్న ప్రకారం తిరిగిరాకపోతే రాగల ప్రమాదం గుర్తించి, ఆతనికి తెలిసివున్న అన్ని స్థావరాలను క్షణాలపై ఖాళీచేయడం, కొత్త స్థావరాలు ఏర్పాటుచేసుకోవడం రక్షణ రీత్యా తప్పనిసరి అవసరంగావుండేది. శత్రుదాడి నుండి తప్పుకోడానికి అది అవసరం.

నేను ఆ స్థావరం ఖాళీచేశాను. మిగతావాళ్ళు యింకా అక్కడేవున్నారు. మేం అనుకొన్నట్లు అనుమానించిన విధంగానే ఆపోయినవ్యక్తి నెక్కొండలో నెత్తిన మూటపెట్టుకొని అటునిటుబిత్తరచూపులుచూస్తూ పోలీసుకుచిక్కిపోయాడు. యీవార్త అందగానే క్షణాలమీద స్థావరం ఖాళీచేయడము జరిగింది. సైక్లోస్టయిల్ మిషన్, బియ్యం, వంటపాత్రలతోసహా అన్నీ అక్కడినుండి తప్పించడం జరిగింది. బియ్యం బుట్టలు, వాలీబాల్‌నెట్లుమాత్రం అక్కడే మిగిలిపోయాయి. భయంవలనో, బాధలకు

తాః లేకనో ఆ పట్టుబడినవ్యక్తి స్థావరంచూపిస్తానని చెప్పి మిలటరీ బలగాలవెంట వేసుక వచ్చాడు. పదిహేనువందలమంది మిలిటరీవాట దాడి ప్రారంభించి ఖాళీచేయబడిన స్థావరందాకా వచ్చి దానిని చుట్టుముట్టేరు. దళాన్ని పట్టకోలేకపోయారు. పట్టీలట్టలు వాలీబాల్ నెట్లుమాత్రమే దొరికాయి. హతాశులైపోయేరు. ఆ పట్టుకొన్న వాణ్ణియింకా బాధించిపుంటారుకాబోలు. యీ దగ్గరేయెక్కడో వుండివుంటారు, చూపిస్తానని చెప్పి వెదకడం మొదలు పెట్టేరు.

మా స్థావరాలు అడవుల్లో వాగుల, వంకల తీరంలో ఏర్పాటు చేసుకునేవాళ్ళం. ఎందుకంటే అడవుల్లో నీటిది ప్రధాన సమస్యగా వుండేది. అందుకని పుష్కలమైన నీటివనరులున్న చోటనే స్థావరాలుండేవి. పులులు మొదలైన క్రూర మృగాలు కూడా యీ నీటికోరకై మా స్థావరాల చుట్టూనే వుండేవి.

యీ పట్టుబడిన వ్యక్తికి నాపేరు తెలియదు. నాకు అప్పటికే తలపూర్తిగా నెరసిపోయింది. బోడ్డుగా వుండేవాణ్ణి.

వెర్రెత్తిపోయిన మిలటరీ క్రూరత్వానికి తట్టుకోలేని అతను అదేపనిగా వెదకి చివరకు, విడదీయబడి దారిచేయబడిన గడ్డిని మంచు కారణంగా ఏర్పడిన గుర్తుల ఆధారంగా గమనించి మిలటరీకి దారి చూపాడు. వాళ్ళుయికముందుకుసాగారు. అయితే సకాలంలో మన సెంట్రీ యిది గమనించి కాల్పుచేసేడు. యీ కాల్పుతో శత్రురాకను గమనించి మనవాళ్ళు అక్కడినుండి తప్పుకొని మావద్దకు వచ్చేరు. అలా అది మనవాళ్ళకు హెచ్చరిక కాగా, శత్రువుకు పిచ్చెత్తిపోయింది. ఒక్కసారి రెండు వందల మంది కాల్పులు ఆరభించేరు. అడవి దద్దరిల్లిపోయింది. కాల్చి కాల్చి వాళ్ళకు సాలివచ్చేదాకా కాల్చారు. ప్రతి చెట్టుపుట్ట గాలించేరు తిరిగి తిరిగి అలసి పోయేరు. హతాశులై వెనుదిరిగి తిరుగుప్రయాణం అయ్యేరు. ఆయుధాలు, వాటికన్న మందుగుండు వనరులు మనకు పరిమితంగా వుండేవి కాబట్టి, ప్రతి గుండు ఫలితం సాధించాలి అనేది వుండేదికాబట్టి దాడి చేయగలవారిని, దాడి చేయవలసిన ప్రాంత అనుపానులు పూర్తిగా నిర్ధారించుకొన్న పిదపనే శత్రువుపై దాడిచేయడం జరిగేది.

ఒక్కొక్కప్పుడు ఆహారం లభించేదికాదు. జంతువుల మాంసమే అప్పటి ఆహారం. అలా ఆయా పరిస్థితులకు అలవాటుపడిపోయాం.

నగరాలలో ట్రేడ్ యూనియన్లలో వుద్యమం నిర్మించి వాటిని పటిష్ట పరచాలనే పిలుపు యిచ్చింది పార్టీ. ఈ సందర్భంలోనే నేను, రామనాథం వరంగల్ పంపబడ్డాం. నాకేమో ఈ నగరం క్రొత్త. రామనాథానికి పరిచయంగల నగరమే. వరంగల్ కార్మిక వర్గాల్లో మా కార్యక్రమాలు ప్రారంభించాం. జైలునుండి తప్పించుకువచ్చిన ఒక కామ్రేడ్‌ని హైదరాబాద్‌నుండి మావద్దకు పంపేరు. ఇతను కాస్తమాటకారి. వ్రాయగల నేర్పరితనంకూడా వుంది. ఆ రోజుల్లో యూజీలో వున్న వాళ్ళన్నా, జైళ్ళనుండి తప్పుకు వచ్చిన వాళ్ళన్నా ఒక ప్రత్యేక గౌరవము వుండేది.

ఈయన వరంగల్‌లో బహిరంగంగా తిరుగుతూ వుండేవాడు. అది కూడదని హెచ్చరించాం. వరంగల్‌లో తననెవరూ గుర్తించలేరనే ధీమాతో వుండేవాడు. అయితే అతనితోబాటు జైలులోవున్న ఇటికాల మధుసూదనరావు అనే ఆయన యీయనను పట్టించాడు. మధుసూదనరావు కాంగ్రెస్. తర్వాత M. P. కూడా అయ్యేడు. అది ఆనాడు కమ్యూనిస్టులను పోలీసులకు పట్టించాలని కాంగ్రెస్‌వాదులు చేపట్టిన కార్యక్రమంలోని భాగమే.

సాధారణంగా అందరం వొకచోట వుండేవాళ్ళం కాదు. ఒకరి నొకరం కలుసుకోవాలను కొన్నపుడు, అందరమూ కూడి చర్చలు జరుపుకోవాలను కొన్నపుడు తప్ప, ఎవరికి వారుగా విడివిడిగానే వుండేవాళ్ళం. ఒకరువుండే తావు మరియొకరికి తెలిసేవిధంగాకూడ వుండేవాళ్ళం కాదు.

ఇతను పట్టుబడిన తర్వాత ఇతనికి తెలిసిన పదమూడుమంది వివరాలు చెప్పాడు. అక్కడే రామనాథం వుంటేవుండవచ్చునని ప్రభుత్వానికి అనుమానం వుండేదిగాని నేను వున్నాననిమాత్రం తెలియదు. ఇతని వలన మా అందరి ఉనికి తెలిసిపోయింది. తీవ్రంగా బాధించారని, భార్యను చిత్రహింసలు పెట్టి చంపివేస్తారంటే బెంబేలుపడిపోయి మానసికస్థయిర్యం కోల్పోయి తట్టుకోలేక చెప్పాననని చెప్పాడు.

ఆ రోజు రాత్రి బాగా ప్రొద్దుపోయింది. నేను వొక కామ్రేడ్‌ను కలిసి తిరిగి వచ్చాను. అది బాగా యిరుకుసందులోవున్న పడిపోవ సిద్ధంగావున్న పాతకాలపు గోనె పెంకుటిల్లు. ఆ ప్రాంతములలో దొంగలరద్దీ అధికంగా వుండేది, అది రెండు చిన్న గదులు,వరండా వున్న యిల్లు. బాగా మబ్బు కూడా పట్టివుంది. అప్పటికే చాలా ప్రొద్దు పోవడంతో నేను చొక్కా విడిచి వంకెకు తగిలించి నులకమంచంలో మేనువాల్చాను. రామనాథం వద్ద వుండే రివాల్వర్ ఆ రోజు నా దగ్గర వుంది. అది కూడ వంకీకే తగిలించాను. పడుకోవడమే ఆలస్యంగా గాఢంగా నిదురపట్టింది. యెప్పుడు చుట్టుముట్టారో యింటిని చుట్టుముట్టారు మిలటరీ వాళ్లు. నేనదిగమనించలేదు. కాలుమడుచుకొనడానికని నెమ్మదిగా గడిదీసి కాల్వపైకి అలా వంగేను అంతే. గభీమని వొకడు యింటి మీద నుండి నా వీపు మీద దూకేడు.తూలి కాల్వలో పడిపోయాను. ఆ పైన నలుగురు పడిపోయారు. అందరూ కలిసి వాటేసుకొని యెత్తుకుపోయి వ్యాన్ వద్ద దింపేరు. యీ అలికిడికి చుట్టుపట్ల జనం లేచేరు. పోలీసు వాళ్లు దొంగలు దొంగలని అరవసాగారు. దానితో జనం సర్దుకొన్నారు. ఎవర్రా నువ్వని అడిగేడు సర్కిల్. రామిరెడ్డినని సమాధానం చెప్పాను. వీడిలా నిజం యెందుకు చెపుతాడురా అంటూ గద్దించేడు డి.ఎస్ పి. యెత్తి వ్యానులో పడవేసేరు.

నా బట్టలు, రివాల్వర్ నావద్దవున్న ఉత్తరప్రత్యుత్తరాలు వగైరా అన్నీ స్వాధీనంచేసుకొన్నారు. వ్యానులో నన్ను హనుమకొండలోవున్న ఎస్.పి. ఆఫీసు ఆవరణలోని పోలీసుక్యాంపుకు తీసుకపోయేరు. రామనాథాన్ని తీసుకవచ్చారు. మిగతా

పదకొండుమందిని తీసుకవచ్చారు. మా ఇద్దరిని వొకచోట వేరువేరుగా వుంచారు. మిగతా పదకొండుమందిని వేరుగా వొకటిగా వుంచారు. హైదరాబాద్‌నుండి వచ్చి ముందుగాపట్టుబడి మా అందరి అరెస్టుకు కారణమైన అతన్ని కూడా పట్టుకవచ్చి వేరుగా బంధించి వుంచేరు. అతనిభార్యనుకూడ పట్టుకవచ్చేరు. ఆమె పెద్దగగ్గోలుపెట్టియేద్చేది.

నేనంటే ప్రభుత్వానికి మహాకక్షగా వుండేది. నేను 1946 నుండి ఇప్పటి దాకా పట్టుబడలేదు. వాళ్ళదృష్టిలో నేనుమహాభయంకర వ్యక్తిని. ప్రమాదకారిని.

రెండవరోజు పగలు నా కాళ్ళకు, చేతులకు బేడీలువేసి ఎస్.పి. వద్దకు తీసుక పోయారు. ఎస్. పి. ముఖపరిచయం వున్నవాడే. ఆయన భార్య మహిళా సంఘాల కార్యక్రమాలలో పాల్గొన్నస్త్రీ. మహిళాసంఘ కార్యక్రమాల సందర్భంలో ఆమె మా ఇళ్ళకు కూడ వచ్చినట్టు నాకు గుర్తు. అప్పటికే నా భార్య, మా అమ్మగారు నిర్బంధిప బడి వున్నారు. నేను దొరకనందున వాళ్ళను నిర్బంధించారు. నేను పట్టుబడిన వెంటనే మా అమ్మగారిని విడుదలచేశారు. తర్వాత నెమ్మదిగా నా భార్యను విడుదలచేశారు

ఎస్. పి. మౌనంగా కూర్చొని చూస్తూ వుండిపోయాడు. డి.ఎస్.పి. మహా కిరాతకుడు. సబ్ యిన్‌స్పెక్టర్లచేత నన్ను చితకబాదించేడు. దెబ్బలకంటె నన్ను అవమానించడం వాడికి అతి ప్రీతి, సంతృప్తి కలిగించిన విషయంగా నాకనిపించింది; అలా అవమానపరచడం ద్వారా మానసికంగా కృంగదీసి లొంగ దీయడం వాళ్ళ లక్ష్యం కాబోలుననిపించింది. అలా బాధించి మానుంచి వాళ్ళు సాధిం చింది యేమీలేక సాలివచ్చికాదోలు మధ్యాహ్నం తిరిగి తీసుకువెళ్ళి పోలీసుస్టేషన్‌లో బంధించేరు. పై అధికార్ల ఆజ్ఞలను కాదనలేక తన రక్షణార్థం అలా బాధించినందుకు సబ్‌ఇనస్పెక్టర్ క్షమాపణ కోరేడు. ఆ తర్వాత మాకు భోజనం తెప్పించాడు. భోజనాలు యిళ్ళవద్దనుండి వచ్చినా ఆ పదకొండు మందికీ ఇవ్వడానికి యిష్టపడ లేదు వాళ్లు. వాళ్ళకు తిండిపెట్టనిదే మేంకూడా తినమని చెప్పి, ఆహారం నిరాక రించాం. మాకు ఎస్. పి. యే ఈ యేర్పాట్లు చేసినట్లు చెప్పేడు. ఏమైనా ముందు ఆ పదకొండు మందికి ఆహారం యివ్వాలని పట్టుపట్టాం. చివరకు అంగీకరించారు. వాళ్ళకు వచ్చిన ఆహారాన్ని తీసుకొని వాళ్ళకు యిచ్చారు. అప్పుడు మేం వాళ్లు తెప్పించిన ఆహారాన్ని తీసుకొనడానికి అంగీకరించి తీసుకున్నాం. మమ్మల్ని యిద్దర్నీ విడివిడిగాను, కలిపి ఒకటిగాను, కొంతసేపు ఎస్. పి. ఆఫీసు ఆవరణ వద్ద, కొంతసేపు దానికి దగ్గిరలోనేవున్న పోలీసు స్టేషనులోను వుంచారు. నాకు రాత్రి పగలు అనే తేడా యేమియు లేకుండా కాళ్ళకు చేతులకు గొలుసులతో బేడీలు వేసియే వుంచుతున్నారు.

నేను అరెస్టు అయినపుడు నంజప్ప ఆ రెండు మూడు రోజులు ఆ ప్రాంతాలలోలేడు. ఆ తర్వాత వచ్చాడు. ఆ రోజుల్లో నల్లగొండ, వరంగల్ జిల్లాల్లో కమ్యూనిస్టుల తిరుగుబాటు అణచడానికి నియమించబడిన పోలీసు, మిలిటరీ బలగాలకు

యితడే సర్వాధికారి. ఆనాడు వాడి మాటే శాసనం. జైళ్ళపైనా, ఆఖరికి జిల్లా కలెక్టర్లపైనకూడా వాడిదే అధికారం. వాడిమాటకు తిరుగులేదు.

కీర్తికొరకు, పారితోషికాల కొరకు, ప్రమోషన్‌ల కొరకు పోలీసువాళ్ళు పోటీలుపడుతూండేవాళ్ళు. ఎవరు ఏమిచేసినా, అది ఘనతగా మలుచుకొని ప్రకటించుకోవాలనే తాపత్రయం, తపన ప్రతివాడిలోనూ వుండేది. ఎవరైనా దొరికితే 'అయ్యో! నాకు దొరక్కపోయెనే'అనే ఆవేదనవుండేది. ఇంకోడు ఆ కీర్తి కొట్టేస్తున్నాడనే ఈర్ష్యకూడ వాళ్ళల్లోవుండేది. లక్ష్మీనర్సయ్యను తనే స్వయంగా బంధించినట్టుగా నంజప్ప ఒకప్రతికా ప్రకటన తాటికాయంత అక్షరాలలో వేయించుకొనగా, పట్టుబడినవాడసలు లక్ష్మీనర్సయ్య కాదని దక్కన్ క్రానికల్‌లో ఇంకో ప్రకటన వెలువడింది. ఈ రెండవ ప్రకటన దక్కన్ క్రానికల్ విలేకరిని పట్టుకుని ఖమ్మం డి.ఎస్.పి. శ్రీనివాసరావు అనే ఆయన వేయించాడని వినికిడి.

నంజప్ప వరంగల్ వచ్చేడు. నాకాళ్ళకు చేతులకు బేడీలువేసి, వంటినిండుగ గిలకలనుండి కుతికలవరకు పెద్దమోకును వరిగడ్డి వెంటిచుట్టినట్లు చుట్టి నంజప్ప వద్దకు తీసుకుపోయారు. ఒకపెద్దహాలులో ఆయన కూర్చొనివున్నాడు. చూసీచూడటంతోటే మండిపోయేడు ఎవ్వరానువ్వు అంటూ రంకెలుపెట్టాడు. తన ఆగ్రహాన్నంతా వెళ్ళగ్రక్కాడు. అవమానించప్రయత్నించాడు. నా జవాబుతో ఉగ్రుడైపోయి తలతిరుగుతుందా అన్నాడు. అది అధికారంలోవున్న నీలాంటివాడికి జరిగేపని అన్నాను. అంతే ఇక నలువైపులనుండి ఇటుపడితేఅటు, అటుపడితేయిటు బూటుకాళ్ళతో నలుగురు ఇన్‌స్పెక్టర్లు తన్నడం మొదలుపెట్టారు. కాళ్ళకుచేతులకుబేడీలు వేయబడి వంటినిండా వరిగడ్డి వెంటిలా మోకు చుట్టబడివుండటాన బోరెంలా క్రిందపడుతున్నాను. లేవదీస్తూ తంతూవున్నారు. క్రైమ్‌బ్రాంచివారు ఇంకొందరు యీ వినోదాన్ని చూస్తూ కూర్చున్నారు. అలిసిపోయారుకాబోలు అక్కడినుండియెత్తుకుపోయి వ్యానులోపడవేసి హనుమకొండ పోలీసుస్టేషన్‌లోదింపేరు. మాకు ఒక శిఖ్‌జమేదార్ కాపలావుండేవాడు. నా గడియారం అవీ ఇతడే తీసుకొన్నాడు. ఆవిశ్వాసంతోకాబోలు కొంత సమాచారం యిస్తుండేవాడు.

నేను లక్ష్మీనర్సయ్యను అవునా కాదాఅనే వాళ్ళఅనుమానం ఇంకా నివృత్తి కాలేదు. నాకు బేడీలువేసి వరంగల్‌జైలుకు తీసుకుపోయారు. జైలులోపలికి నన్ను తీసుకపోవడానికి లోపల నేనువెత్తే గందరగోళం జరగవచ్చుననే భయంతో జైలర్ అంగీకరించలేదు. అందుకని విశాలంగావున్న జైలర్‌హాలులో నన్ను కూర్చోబెట్టారు. జైలరు, సూపరింటెండెంట్, క్రైం బ్రాంచివారు, డి. ఎస్. పి. మొదలైన వారంతా కుర్చీల్లో కూర్చొన్నారు. ఆ జైల్లో నిర్బంధించబడియున్న నా భార్యను అక్కడికి తీసుకువచ్చారు. ఆయన ఎవరు ? అని అడిగారు. ఆమె గుర్తించింది. మా వారే దొరికారు గదా యిక వారిని ఏమీ అనకండి అంది. "నువ్వు బ్రతిమాలే దానివి వాళ్ళు ప్రాణభిక్ష పెట్టేవాళ్ళా పో అవతలకు" అన్నాను.చూడండి చూడండి వాడి యారగన్సె అన్నాడు డి. ఎస్. పి. అలా నా గుర్తింపు పూర్తి అయింది.

ఇలా నా గుర్తింపు ఇంటరాగేషన్ పూర్తికాగానే వరంగల్ జైల్లో సింగిల్ సెల్‌లో వేశారు. సెల్‌లోకూడా కాళ్ళకు, చేతులకుకూడా బేడీలు వేసియేవుంచారు. అది ఎటుచూసినా ఆరడుగుల వైశాల్యం మాత్రమే వుండేది. చాలా పాతది. మండ్ర గబ్బలుతిరుగుతూ వుండేవి. జైలుసూపరింటెండెంట్ నేనంటేకక్షగావుండేవాడు. కారణం తెలియదు. వాడికి అవకాశం లభించినపుడల్లా నన్ను మాటలతో అవమానించచూసేవాడు. నీ ఇల్లు ఇంతకంటే గొప్పదాయని గేలి చేసేడు. అప్పటికి అతను వుండే జైల్లోని క్వార్టర్ సగం పడిపోయే దశలోనే వుంది. నీవు వున్నదానికన్నా నా ఇల్లు వేయిరెట్లు మంచిదని సమాధానం యిచ్చాను. మా ఇల్లు అప్పటికే పోలీసు ఆధీనంలో వుంది. నా ఆస్తులు ధ్వంసం చేయబడ్డాయి.

అప్పటిలో బర్ఫీ అనే ఆంగ్లో-ఇండియన్ జైలర్‌గా వుండేవాడు. జైల్ రూల్స్ ప్రకారం నడిచే మనిషి. కొంత కారుణ్య భావంకూడావున్నవ్యక్తి. ఎవరినైనా బయటకు తీసుకువెళుతున్నా లేక జైలు లోపలకు తీసుకువచ్చినా వాళ్ళవివరాలుపూర్తిగా రికార్డు చేయబడుతుండేవి. లగడపాటి గోపయ్యను జైలునుండి బయటకు పట్టుకువెళ్ళి చంపి వేయడం జరిగింది. ఈ విషయం రహస్యంగా జైలరు మా చెవినవేసేడు. ఒక రోజు నన్ను, రామనాథాన్ని జైలునుండి బయటకు తీసేరు. మమ్మలనుకూడా వధించేందుకే పట్టుకువెళుతున్నారేమోననే అనుమానం ప్రకటితమైంది.

మమ్మలను హనుమకొండ పోలీసు స్టేషన్‌లో వుంచారు. పగలంతా అధికార్లు తర్జన భర్జనలు చేస్తూనే వచ్చారు. కాళ్ళకు చేతులకు బేడీలు అలాగే వున్నాయి. మిలటరీ అధికారి నంజప్పవద్దకు పట్టుక వెళ్ళినట్లే కలక్టర్ పళనియప్ప వద్దకు వంటికి మోకుచుట్టి, కాళ్ళకు చేతులకు బేడీలువుంచితీసుకువెళ్ళారు. వ్యానులోనుండిదింపి తీసుకు వెళ్ళి అతని ముందు నిలబెట్టారు. నేనెంత ప్రమాదకారినో వివరించారు. నేను పట్టుబడినందుకు సంతోషం ప్రకటించాడు.

ఆ రాత్రి అంతా అలా తిప్పుతూనే వున్నారు. ఆఖరికి తెచ్చి పోలీసు స్టేషన్‌లో బంధించేరు. తెల్లవారి మధ్యాహ్నం డిటెన్షన్ ఉత్తర్వుపై వరంగల్ జైలుకు పంపారు. కాళ్ళ బేడీలుతొలగించలేదు. సూపరింటెండెంట్‌కుకక్షపోలేదు. నాకు టైఫాయిడ్ జ్వరంవచ్చింది. ట్రీటుమెంటులేదు. సూపరింటెండెంట్ పట్టించుకొనేవాడు కాదు. ఈ దశలోకూడ కాళ్ళ బేడీలు తీయించిన వాడుకాదు డాక్టర్ అంతకన్న దౌర్భాగ్యుడు. బ్రతుకుతానని యెవరూ అనుకోలేదు. చివర చివరలో రాత్రిళ్ళు ఒక కాలికి ఒక చేతికి బేడీలువేసి వుంచేవాడు. ఖైదీలను చూడటానికి వచ్చినపుడు కనీసం కన్నెత్తిగూడ నేను వాడివైపు చూసేవాణ్ణి కాదు. వీడెంత పొగరుబోతని అనుకొనేవాడు.

ఈ దశలో నా ఆరోగ్యం పూర్తిగా చెడిపోయివున్న సమయంలో ఇంటరాగేషన్‌కుగాను హైదారాబాద్ పంపవలసిందిగా ఉత్తర్వులు వచ్చాయి. నేను కదలగల స్థితిలోలేను. ఆ స్థితిలోనే ఆ బేడీలతోనే నన్ను హైదరాబాద్ తరలించారు. వర్షాకాలం వర్షాలతో రోడ్లుకూడా అధ్వాన్నంగావుండి ప్రయాణం బాగాసాగలేదు. ఎలాగో హైద్రాబాద్ చేరాను. నాతోపాటు రామనాథం కూడా వున్నాడు. హైద్రాబాద్ జైల్లోవేశారు.

ఆరోగ్యం పూర్తిగా క్షీణించిపున్న ఆ దశలోవున్న నన్ను ఇంటరాగేషన్‌కు పంపడానికి జైలు డాక్టర్ అనుమతించలేదు. ఆ విషయం ఇంటరాగేషన్ చేయు అధికార్లకు తెలియజేశాడు. అలా ఇంటరాగేషన్ ఆగిపోయింది. నేను కోలుకునేందుకు మందులు యిక్కడ లభించాయి. క్రమంగా నా ఆరోగ్యం కుదుటపడుతూనేవుంది.

నన్ను, రామనాథాన్ని, తదితరులను పట్టించినవాడిని కూడా ఈ జైలుకు తీసుకువచ్చారు. అతన్ని మేమే పట్టించినట్లును మేమే లొంగిపోయినట్లును వరంగల్ ఏరియా ప్రాంత పార్టీలో ఎలాగో ప్రచారం జరిగిపోయింది. ఈ విషయమై జైలుకు కూడా విచారించి వాస్తవాలు తెలుసుకోవలసిందిగా రహస్యంగా ఉత్తరాలువచ్చాయి. వరంగల్ జైలునుండే సమాధానం కూడ వెళ్ళింది. మాపై కరపత్రాలు కూడ ప్రచురించారు. తిరిగి హైదరాబాద్ జైలుకుకూడ విచారించవలసిందిగా రహస్యంగా ఉత్తరాలు వచ్చాయి. అప్పుడు ఆరుట్ల లక్ష్మీనరసింహారెడ్డిగారు లోపల వ్యవహారాలన్నీ చూస్తుండేవారు. విచారించి బైటకు తెలియజేయడం జరిగింది. ఐనా మరలా అదేవిషయమై బైట నుండి మరొక ఉత్తరం వచ్చింది. ఈ రోజుల్లోనే వరంగల్ జైల్లో జైలర్‌గావున్న ఆంగ్లో-ఇండియన్ బర్చే హైదరాబాద్ జైలుకు జైలర్‌గా రావడం జరిగింది. ఈ కరపత్రాలు, ఉత్తరాలు ప్రభుత్వం చేతిలోపడ్డాయి.

మమ్మొలను పట్టించిన ఇన్‌ఫార్మెంటు ఎవరైతే వున్నారో ఆయన తను చెప్పిన విధంగా మమ్మొలను పట్టించి మాట నిలబెట్టుకున్నా, మమ్మొలను పట్టిస్తే తనను పూర్తిగా వదలివేస్తామని చెప్పి ప్రభుత్వం, పోలీసు తనకు ఇచ్చిన మాట నిలబెట్టుకోకుండా తనను విడుదల చేయకుండా అలాగే నిర్బంధంలో వుంచి మాట తప్పినందుకుగాను ప్రభుత్వాన్ని, పోలీసును నిందిస్తూ తనను వెంటనే అన్నమాట ప్రకారం విడుదల చేయని యెడల తాను ఆమరణ నిరాహార దీక్ష పూనసున్నట్లుగా హెచ్చరిస్తూ ఒక ఉత్తరం పోలీసుకు వ్రాసేడు. ఆ ఉత్తరం జైలర్ చేతుల్లోపడింది. అర్థరాత్రి గార్డులు అందరూ కునుకు తీస్తున్న సమయం కనిపెట్టి ఆ ఆంగ్లో-ఇండియన్ జైలర్ ఆ ఉత్తరం తెచ్చి నాకు చూపేడు. దానిని S. R.కు, A. L.కు చూపవలసిందిగా కోరేను. నన్ను ఉద్యోగం చేయనివ్వదలచుకోలేదా, నేను ఉద్యోగంలో ఉండటం నీకు యిష్టంలేదా అని అడిగాడు. తర్వాత వారికీ చూపేడు. ఎ.ఎల్.కు అప్పటికే వాస్తవం పూర్తిగా తెలిసియేవున్నా ఈ ఉత్తరం వాస్తవాలను మరింతగా ధృవపరచింది. కానీ అవాస్తవికమైన ప్రచారం, కరపత్రాలు మొదలైనవి అప్పటికే వచ్చి జరగవలసిన ప్రచారమంతా జరిగిపోయింది.

ఇంట్రాగేషన్ ఆరంభమైంది. ఈ ఇంట్రాగేషన్ కేవలం నేర పరిశోధక విభాగానికి, యింటిలిజెన్సు విభాగాలకు చెందిన ఆఫీసర్లతోకూడినది. కేవలం మా మానసిక స్థయిర్యాన్ని పరీక్షించడం, దెబ్బదీయడంలాంటి వాటికే వినియోగించబడింది. నాపై వేయబడిన కరపత్రాలు చూపించి పార్టీ నీపై క్రమశిక్షణా చర్యలు తీసుకొంటుంది గదా ; నీవేమి చేయాలనుకొంటున్నావని ప్రశ్నించేడు. అది మీకు సంబం

ధించిన అంశంకాదని చెప్పాను. ఉద్యమాన్ని గూర్చి ప్రశ్నించారు. అది నిర్ణయించ వలసింది పార్టీ అని సమాధానము యిచ్చాను. యిలా సాగి ఇంట్రాగేషన్ పూర్తి అయింది.

జైళ్ళలో కానీయండి, బైటకానీయండి ఈ కాలంలో మనకు సమాచారం చేర వేస్తూ వచ్చినవాళ్ళలో పోలీసులతో సంబంధాలు వున్నవాళ్ళు, అసలు పోలీసువాళ్ళ చేతనే నియమించబడినవాళ్ళు అత్యధికంగా వుండేవాళ్ళు.వీళ్ల బైటనుండి మనకు, మన నుండి బైటికి మన ఉత్తర ప్రత్యుత్తరాలను చేరవేస్తూ మనకు సంపూర్ణమైన నమ్మిక కలిగిస్తూ, మననుండి కీలకమైన సమాచారం గ్రహించి, పోలీసుకు అందించ ప్రయ త్నించేవాళ్లు. అలా చేశారు కూడ. మనవాళ్లు వీళ్ళను నమ్మినవాళ్లుకూడ లేకపోలేదు.

పార్టీలో విభేదాలు, నారాయణరెడ్డిగారు బొంబాయి వెళ్ళడం జరిగింది. ఈ సమాచారం పోలీసు వద్దవుంది. పార్టీ రెండు గ్రూపులుగా చీలిందిగదా నీది ఏ గ్రూపు అని ప్రశ్నించి నా ఆంతర్యం గ్రహించ ప్రయత్నించారు పోలీసు.

ఆరుట్ల, చంద్రగుప్త చౌదరి మొదలైన వారు హైద్రాబాద్ జైల్లో వుండ గానే ఆచార్య వినోబాభావేగారు తన శిష్యగణంతో జైలుకు వచ్చేరు. జైల్లో వొక హాలులో తివాచీ పరచి మీటింగు ఏర్పాటు చేశారు. వినోబాగారు అహింస ప్రబోధం చేశారు. హింసను విడనాడవలసిందిగా బోధించారు. ప్రభుత్వంకూడ దౌర్జన్యం చేస్తుందని తెలిపారు. మానుండి సమాధానం అభిలషించారు. మీరు మా స్టేట్ కమిటీతో మాట్లాడండి. మీకు మా స్టేటు కమిటీమాత్రమే సమాధానం చెప్పవలసింది అని చెప్పాం. డాక్టర్ సలహాపై ఇక్కడ వుండగా నా కాలి బేడీలు తొలగించారు.

నేను మరలా వరంగల్ జైలుకు తీసుకు రాబడ్డాను.మరలా యథాప్రకారం నా కాళ్ళకు చేతులకుబేడీలు వేయబడ్డాయి. సింగిల్ సెల్ లో పెట్టబడ్డాను సూపరింటెండెంట్ కసి ఇంకా తీరినట్లు లేదు. తనను బ్రతిమాలి అడిగితే తీసివేయాలనేది అతని ఆలోచన. ఆ విషయం వార్డర్ల ముందు బైటపెట్టాడు కూడ. వాడిని బ్రతిమిలాడరాదని, కనీసం పలకరించరాదనేది నా పట్టుదల. అంతకాలం వుండటాన బేడీలు అలవాటు అయి పోయాయి. వాటినిగాని, వాణ్నిగాని ఖాతరు చేయడంకూడ మానివేసేను. వాడు వచ్చి నపుడు కనీసం చూడకపోవడం వాడికి మరీ గుబ్బుగా వుండేది.

నాపై ఆరు మర్డర్ కేసులు, ఒక రివాల్వరు కేసు పెట్టబడ్డాయి. రివాల్వర్ కేసు రామనాథంపైకూడా వుండేది. మర్డరు కేసుల్లో నాతోపాటు కిషన్‌రావు, తమ్మా శేషయ్యలుకూడా వున్నారు. గూడూరుపాడు, కైకొండాయగూడెం, వెంకటాయ పాలెం, పిండిప్రోలు, సంకీస మొదలైనవి ఆ కేసులు. ఈ కేసుల విచారణ పేర త్రిప్పసాగేరు. పోలీసులు పెట్టిన ఈ కేసులలో ఏదీ నిలువలేదు. పోలీసులు తెచ్చిన యే సాక్షి ప్రభుత్వానికీ, పోలీసుకు అనుకూలంగా సాక్ష్యం ఇవ్వలేదు. ఇచ్చేవాళ్ళు కాదు. పోలీసులు బలవంతం చేసినా ప్రజలు మనకు వ్యతిరేకంగా సాక్ష్యం చెప్పేవారు కాదు. పోలీసులు ప్రలోభపెట్టినా యేమిచెప్పినా సాక్షులు మనకు వ్యతిరేకంగా సాక్ష్యం చెప్ప సాహించేవారుకూడాకాదు.

ఈ కాలంలో నిర్వహించబడిన స్పెషల్ కోర్టుకు జడ్జిగా వచ్చినవాడు ఆ పదవికేగాదు, ఆ పదానికే అర్హుడుకాడు. మహాక్రూరుడు. తన ముందుకు వచ్చిన కేసు పూర్వాపరాల విచారణకంటే శిక్షించడమే కర్తవ్యంగా, అదే తన ఉద్యోగంగా ఎంచేవాడు. మరణశిక్ష వేయడమే ధర్మంగా భావించేవాడు. మా కేసుల విచారణ నాటికి ఈ కోర్టు అసలు ఎత్తివేయబడింది.

వినోబాభావేగారు వరంగల్ జైలుకు కూడ వచ్చారు. వారివెంట వారి శిష్య గణం కూడ వచ్చింది. కోదాటి, బొమ్మకంటి, రావెళ్ళ శంకరయ్యగారలు కూడ వచ్చారటగాని, వారు జైలుబైటనే వుండిపోయారు. జైలుహాలులో మీటింగ్ పెట్టారు. నేను, వట్టికొండ నాగేశ్వరరావు మొదలైనవారిమి భావేగారి మీటింగ్‌లో పాల్గొన్నాము. భావేగారు యథాశక్తి తన అహింసా ప్రబోధంచేశారు. వెళ్ళారు.

కలెక్టర్ పళనియప్ప జైలుకు వచ్చారు. నా కాళ్ళకూ చేతులకు బేడీలువేసి వున్నాయి. వీడు మోస్ట్ డేంజరస్ ఫెలో అంటూ సూపర్నెంటు కలెక్టర్‌కు నన్ను పరిచయంచేశాడు. కలెక్టర్ రాకనుగాని, సూపర్నెంటునుగాని నేనసలు పట్టించుకోలేదు.

పర్సా సత్యనారాయణగారు కూడ ఈ కాలంలో వరంగల్ జైల్లోనే వుండేవారు. నాకు, కిషన్‌రావుకు, పర్సాకు అప్పటికే తలలు బాగా నెరసివుండేవి. వెనకనుండి దూరంలో వుండి చూస్తే యించుమించు మా నెరసిన తలలన్నీ వొక తరహాగానే వుండేవి. పర్సా యింటికి వ్రాసిన వొక ఉత్తరం నేను వ్రాసినదిగా భ్రాంతిపడిన సూపర్నెంటు నన్ను పట్టుకు రావలసినదిగా జవానులను పంపేడు. ఎవరీ ఉత్తరం వ్రాసింది యని గర్జించాడు. నేను వ్రాయలేదన్నాను. యెవరిదీ ఉత్తరం అంటూ వుగ్రుడైపోయేడు. నాది కాదన్నాను. నాకు తెలియదన్నాను. మండిపోయేడు. చిందులు వేసేడు. నేను మౌనం వహించాను.

ఈ కాలంలోనే కెప్టెన్ రషీద్ అనే ఓ బర్మా మిలటరీకి చెందిన మాజీ అధికారి, మిలటరీలో రిటైర్ అయి స్టేట్ యింటిలిజన్సు అధికారిగా వచ్చేడు. మాటకారి, చురుకైనవాడు, సురద్రూపి, బ్రహ్మచారి, మంచి వక్తృచాతుర్యం గలవాడు. ఒక డి.ఎస్.పి.ని కొట్టిన సందర్భంలో ఈ జైల్లో వేయబడ్డాడు. ఎ క్లాసు యిచ్చారు.

ఆజాద్ హైద్రాబాద్ నినాదం మొట్టమొదట ఇచ్చి ప్రచారం చేసింది ఇతనే అనే ప్రచారంకూడా వుంది. అప్పటికే పోరాటరంగంలో వున్న కమ్యూనిస్టులను కూడ గట్టుకొంటే ఆజాద్ హైద్రాబాద్ నిర్మాణం సులభ సాధ్యం అవుతుందని భావించి వాళ్ళకుకూడ పిలుపు యిచ్చినట్లు తెలిసింది. అప్పటిలో ఈ నినాదం కొందరిని ఆకర్షించకపోలేదు. రాజబహదూర్ గౌడ్‌లాంటి వారు బహిరంగసభల్లో ఈ నినాదాన్ని బలపరిచేరు. కానీ పార్టీ వెంటనే ఈ నినాదాన్ని ఖండించింది.

రామనాథం, కిషన్‌రావులు వరంగల్ జైలునుండి పంపివేయబడ్డారు. తుమ్మా శేషయ్య జైల్లో అన్ని వ్యవహారాలు చూసేవారు. ఆయన మంచి చొరవైన మనిషి, నేర్పరి. జైలు వార్డెన్‌లకు ఆశ చూపించి యేదోవిధంగా కార్యసాధన చేసేవాడు.

జైల్లో సింగల్ సెల్‌నుండి లోయర్ ఖానాకు మార్చబడ్డాను. ఇక్కడ నలుగురిలో కలిసివుండే అవకాశం వుండేది. యిది పాతదే. అయినా విశాలమయినది. ఉదయం అయిదు ఆరుగంటల మధ్య ఇద్దరు, ముగ్గురుగాగాని, అధిక సంఖ్యలోగాని అప్పటి వారికి చిత్తం వచ్చిన రీతిలో స్నానాలకు బైటికి వదిలేవారు. ఇదే మాట్లాడుకోడానికి కొంత అవకాశంగా వుండేది. ఏడుగంటలకు రేషన్ వచ్చేది. మిగతాకాలంలో వార్తలకు సైగలు, చీటీలు సాధనాలు. ఆఖరిరోజుల్లో క్రమక్రమంగా కొన్ని మార్పులు వచ్చేయి. కొందరు విడుదల అయ్యేరు. కొందరు ఇతర జైళ్ళకు మార్చబడినారు.

మేడే వచ్చింది. జండా యెగరేయాలనుకొన్నాం. అన్ని బ్యారక్స్‌లోకి రహస్యంగా బైటినుండి యెర్రజండాలు వచ్చాయి. పెద్ద జండాకూడా వొకటి తెప్పించాం. వొకదాని కొకటి రెండుపోల్సు యెదురువేసి కట్టిన స్థంభానికి జండాకట్టి యెగరేశాం. సూర్యోదయానికి పూర్వమే యెగురవేయబడిన జండా సూర్యకాంతిలో వినువీధిలో రెపరెపలాడుతూ జైలుబైటవున్న పోలీసు క్వార్టర్స్ పైకి తన ధగధగలను వెదజల్లి పోలీసు గుండెలను దడదడ లాడించింది. సూపర్నెంటు గుండెల్లో రైళ్ళుపరుగెత్తాయి. క్షణాలమీద మిలటరీ పోలీసుదళాలు రప్పించబడ్డాయి.

జైలు బురుజులను క్షణాలలో పోలీసులు ఆక్రమించారు. గేటును చుట్టుముట్టారు. ఏడుగంటలు దాటింది. వార్డన్‌లుగాని, ఇంకొకళ్లుగాని లోపలికిరాలేదు. వచ్చే సాహసంకూడ లేకపోయింది. అన్ని బ్యారక్స్‌నుండి నినాదాలు మిన్నంటుతున్నాయి. ఆ నినాదాలతో జైలు ప్రతిధ్వనించిపోతూవుంది. జండాను వాళ్లువచ్చి తీసివేసేధైర్యం చేయలేకపోయారు. ఏం జరుగుతుందోననే భయంలో పడిపోయారు. ఆ బారక్ జైలరు వచ్చాడు. ఈయన మహారాష్ట్రుడు. జైల్లో ఈ అగడం ఏమిటన్నాడు? ఇందులో ఆగడం యేమీలేదు. ఇది ప్రపంచ కార్మికులకు చిరస్మరణీయ దినం అంతే అన్నాం. డిప్యూటీ జైలర్ కూడా వచ్చేడు. సేన్ అని ఈయన బెంగాలీ. ఏమైనాసరే బలవంతంగా గాని, పగలు మేం చూస్తుండగాగాని జెండాను తొలగించేసాహసం చేయలేకపోయారు. మా చేతనే తీయించాలనే మంత్రం అసలే పారలేదు. భోజనాలు వచ్చాయి. ఆరోజంతా ఆందోళనా, గజిబిజితో అధికారులు, వుత్సాహోద్వేగాలతో మేమూ వుండిపోయాం. రాత్రి మేం బ్యారక్స్‌లోకి పోయి నిదురించేక యెపుడో తీసుకపోయారు. ఈ కాలంలోనే జరిగిన ఫిలిప్పైన్ గెరిల్లా పోరుపై అమెరికన్ వ్రాసిన పుస్తకం చూస్తే మన పోరాటాన్ని వర్ణిస్తూ రాశాడేమోననిపిస్తుంది.

ఈ కాలంలో జైల్లో ఖైదీల స్థితిగతుల విచారణకు యే అధికారాలులేని అనామక కమిటీ వొకటి వుండేది. ఈ కమిటీ సభ్యులైన డాక్టర్ అయ్యంగార్, కనకరత్నమ్మలు అప్పుడప్పుడు జైలుకు వచ్చి వెళుతుండేవారు. అలా వొక పర్యాయం డాక్టర్ అయ్యంగార్ వచ్చి వెళుతుండగా చూసి, వారిని పిలిచేను. అయ్యా అయ్యంగార్ మీరెందుకు వస్తున్నారు, ఏమి చూస్తున్నారు, ఏమి తెలుసుకొంటున్నారు? అని

అడిగాను. ఈ మాటల సందర్భంలో నా బేడీల విషయం ప్రస్తావనకు వచ్చింది. ఈ విషయం జైలు సూపరింటెండెంటుతో మాట్లాడటానికి అంగీకరించి వెళ్ళి మాట్లాడేడు. సూపరింటెండెంటు మొదట డాక్టర్ అయ్యంగార్‌గారి మాటలకు ప్రాధాన్యత ఇవ్వక పోయినా ఆ విషయం జైలు కంప్లెయింటు పుస్తకాలలో వ్రాస్తానని, అయ్యంగార్ కాస్త గట్టిగా మాట్లాడిన పిదప బేడీలు తీసివేయడానికి అంగీకరించి తీసివేసేడు.

జనరల్ ఎన్నికలు వచ్చాయి. పార్టీ నన్ను పోటీచేయించాలని అనుకున్నా ఓటరు లిస్టులో నా పేరు లేకుండాపోయింది. ఆ కారణంగా ఎన్నికల్లో పోటీచేయలేదు. ఆ తర్వాత ఖమ్మం ఓటరు లిస్టులో నాపేరు నమోదు చేయించడం జరిగింది. ఇంతలో స్థానికసంస్థల ఎన్నికలు వచ్చాయి. జైల్లోవుండే పోటీచేసి నేను ఖమ్మం మున్సిపల్ కౌన్సిల్‌కు ఎన్నుకోబడినాను. ప్రజా ప్రతినిధులుగా ఎన్నికైనవారిని జైళ్ళనుండి విడుదలచేస్తాం అంటూ జవహర్‌లాల్ ఇచ్చినహామీ ననుసరించి నన్ను విడుదలచేయ వలసిందిగా వి.డి. దేశపాండే, రావి నారాయణరెడ్డి, రాజబహదూర్ గౌడ్, ఎల్లారెడ్డి మొదలైనవారు బూర్గులను కలిసి కోరేరు. వీరందరికీ బూర్గులవారితో బాగా పరిచయాలు కూడా వున్నాయి. మొత్తంమీద యెట్టకేలకు నా విడుదల జరిగింది.

నిజాం నిరంకుశ పాలనపోయింది. శతృవుయొక్క ఎత్తుగడల వలన, బలీయుడైన వాడి భయంకరమైన, క్రూరమైన దాడిలో భీతిల్లిన ప్రజానీకంలో కలిగిన మార్పులు, వాటి ఫలితాలు, ఇటుపార్టీ బేరిజు వేసుకొనగా, కోట్ల రూపాయలు ఖర్చుచేసి వేలాది మిలిటరీని దించి, వూళ్ళకు, వూర్లు పీకించి కాన్‌సంట్రేషన్ క్యాంపులుపెట్టి, ఆశ్విక ధళాలను సైతం రంగంలోకి దించి సాధించింది యేమిటనే విషయం ప్రభుత్వంకూడా పునరాలోచన చేసుకోవడం వలన, అటు నెహ్రూతోను, యిటు రాంకిషన్‌రావుతోనూ జరిగిన సంప్రదింపుల అనంతరం ఆయుధాలు దించడం,పోరాటం విరమించడం జరిగింది. అశోకనగర్‌లాంటి ముద్దుపేర్లు పెట్టబడినవన్నియు ఆనాడు గిరిజనుల వూళ్లకాల్చి యేర్పరచబడిన కాన్‌సంట్రేషన్ క్యాంపులే. ఆ జనం ఆనాడూ ఈనాడూ మనకు అండగానే వున్నారు.





3

# వీర తెలంగాణా సాయుధ పోరాట స్మృతులు

(ఇది కథకాదు. వాస్తవంగా జరిగినదే. అది 1949 ఆరంభం. సరిగ్గా అంతకు ముందే వీర తెలంగాణాలోకి కాంగ్రెస్ సైన్యాలు విప్లవోద్యమాన్ని, ప్రజా శక్తులను మట్టుబెట్టడానికి ప్రవేశించి దండయాత్రలు సాగించుతున్న రోజులవి. మిలిటరీ దండయాత్ర చక్రబంధంనుండి ఛేదించుకొంటూ విప్లవదళాలు రక్షణ స్థావరాలకు తరలి వెళుతున్న సందర్భమది. అలాంటి సమయంలో ఒకానొకచోట ఆనాటి నెహ్రూ మిలిటరీ రైతాంగ విప్లవ గెరిల్లాలను వెన్నంటి తరుముతూ తన చక్రబంధంలో బిగించటానికి యత్నించింది. ఆ సందర్భంలో దానినుండి తప్పించుకోవటానికి జరిగిన ప్రయత్నాన్ని గురించి ఆ పోరాటంలో స్వయంగా పాల్గొన్న రచయిత తెలుపుతున్న విషయాలను పాఠకులకు అందజేస్తున్నాం.) — ఎడిటర్.

ట్రాప్, టాప్, ట, ట, ట, .... .... మోదుగుల్లో అప్పుడప్పుడె ఒంటి ఎని కుదుటబడుతున్న మాపై కాల్పులు!

మిట్టమధ్యాహ్నం ఎండ వేడిమికి చిన్న మోదుగుకొమ్మ చాటున తల్లిఒడిలో ఒదిగియున్న చిన్నారిబాలుని చిరునవ్వును భంగపరుస్తూ వచ్చిన కాల్పులు. చుట్టూ మోదుగులతోనూ, వెనుకతట్టు పర్వతాలతోనూ అల్లుకొని వున్న ఆ చిట్టడవిలో యీ రైఫిల్ కాల్పులు నిప్పుల పిడుగుల్లాగ విరుచుకు పడుతున్నై.

అలవాటుప్రకారం ఆయుధం అందుకొని తోటి మిత్రులతో రెండు గంతులు వెనక్కు వేశాను. కానీ క్షణంలో వెనుదిరిగి చూడగా కనిపించినది పసికందుది- ఒక వింత విషాదకర దృశ్యం. ఆ రణగొణ ధ్వనుల మధ్య ప్రశాంతంగా పరిశీలిస్తున్న పసివాని దృశ్యమది. ఆకాశంవైపు అమాయకంగా చూస్తున్న ఆ పసివాని దృక్కులు నన్ను అడుగు ముందుకు వేయకుండా అరికట్టాయి. క్షణంలో తిరిగి ముందుకు మరో గంతు వేసి తల్లి ఒడిలో నుండి ఆ పసికందును లాక్కొని పర్వతసానువుల్లోకి పరుగు సాగించాం. ఆ సమయంలో అంతా పాతికమందికిపైగా వున్న మేము పర్వతమునెక్కనారంభించాం. అప్పటికే ఆ చిట్టడవి బయటిభాగంలో వున్న ఇద్దరు శత్రువు చేతికి చిక్కారు. ఇటు కాల్పుల ఉధృతం మరింత తీవ్రతరమౌతుంది. శత్రువు మమ్మల్ని సమీపించుటకు ప్రయత్నించుతున్నాడు. మూడువైపుల నుండి ముట్టడి బిగించుతున్నాడు.

అట్టి సమయంలో స్త్రీలు, పిల్లలు తక్కిన పెద్దలను ముందు తప్పుకొనుటకు అవకాశమిచ్చి ఇద్దరమూ ఎదురు కాల్పులు ఆరంభించాం. ఒక చేతిలో ఖంగుతిని కల వరపాటు చెందుతున్న పసివాడు, మరొకచేతిలో మరతుపాకితో కాల్పులు....ప్రతి ఘటనావేశంతో ప్రాణాలకు తెగించి నిలిచి ఎదురుదాడిగా మా కాల్పులు సాగుతున్నాయ్. అదునుగా ఎంచి ఆశపడి ముందడుగువేసిన శత్రువు అక్కడే నిలువక తప్పిందికాదు. ఆ క్షణంలో దొరికిన రెప్పపాటు వ్యవధిని వినియోగించుకొని తక్కిన మిత్రులు ఆ పర్వత సానువుల్లోకిదూరి మరొక వైపుకు తప్పుకొంటున్నారు. రాయి, రాయిని, రక్షణతీసుకొని ఉధృతంగా సాగిస్తున్న మా కాల్పులకు శత్రువు చక్రబంధం బిగింపు సడలక తప్పింది కాదు. పర్వతం మరొకవైపుకు దిగి చక్రబంధంనుండి తప్పుకొనే ప్రయత్నంలో వున్న మేము రాళ్ళచాటులో నుండే పర్వత పైభాగానికి చేరాం.

కాని ఎడతెగని ఈ కాల్పులతో రానురాను ఒక రెక్కపై పసివానిదేమించిన బరువుగా తయారైంది. ఆ క్షణంలో అనుకోకుండానే ఒక చేయి తుపాకీ ట్రిగ్గర్ మీద ఆడుతుండగా, మరొక చేతిలో వున్న పసిప్రాణి అమాంతంగా క్రిందికి దొర్లాడు. ఆత్మీయుడుగా దిగువ శిఖరంపైనున్న తోటి మిత్రుడొకరు ఆ ప్రాణినందుకొని పర్వతానికి ఆనుకొని వున్న పచ్చటి పొలాలలోకి దుమికాడు. నిజానికి ఆ మిత్రుడు పడిపోయే వజ్రపుటద్దాన్ని మధ్యలోనే అందుకొని పగులకుండా కాపాడిన దృశ్యమది. అట్టి సమర రంగంలో సహయోధుడుగా నిలిచి అందుకొన్న ఆ మిత్రుడు నాటికీ నేటికీ జీవితంలోనే విప్లవ సహచరుడు. పరస్పరం బావగార్లుగా పిలుచుకొనే యీ ప్రాణమిత్రుడు

మరెవరోకాదు. స్వయంగా మన వెంకటాచార్యులే. [ప్రస్తుతం హైదరాబాదునగరంలో ప్రజాశక్తి బుక్ హౌస్ నడుపుతున్న మిత్రుడు].

ఆ తరువాత పొలాల్లోకి దిగిన మేము శత్రువు చక్రబంధంలో నుండి బయట పడ్డాం. ముందు తప్పుకొన్నవాళ్లుపోగా మిగిలినది ఇద్దరం. చెరొక చేతిలో ఆయుధం. కానీ మిగిలిన మందుగుండు తూటాలు చెరి నాలుగు, అయిదు మాత్రమే. అయినా పర్వతానికి ఆనుకొని వున్న పచ్చటి పొలాలు, ఎటుచూసినా ఎకరాల కొలదీ పరచుకొని ఉన్న ఆ పచ్చటి వనం నిజానికి శత్రువు చక్రబంధాన్ని ఛేదించు రక్షణలుగా మాకెంతో ధైర్యాన్నిచ్చాయి. పొలాల చివరకు చేరుకొన్న మేము మోదుగుల్లో శత్రువు ప్రవేశించటం గమనించాం. కొంచెం వ్యవధి తరువాత తిరిగివస్తున్న మా కాల్పులకు పొదల్లో స్త్రీలు, పిల్లలకోసం గాలిస్తున్న శత్రువు కంగారుపడ్డాడు. ఆ కంగారుతో గాలింపులో పైపైన చూస్తూపోయాడు. కానీ తరువాత ఏమి జరిగిందో చూడలేక పోయాం. దగ్గరవున్న మందుగుండు పూర్తిగా కోల్పోయిన మేము తప్పుకొనే మార్గంలో పడమటి దిశకు నడిచాం.

ముందుపోతున్నమిత్రుడు చంకలోనున్న చంటిబాలునితో పరుగెత్తుచుండగా, వెనుక మేమిద్దరము ఆయుధములతోసహా నైరుతి దిశకు నడుస్తున్నాం. అంతక్రితం వెళ్ళిన ముఖ్యమైన కామ్రేడ్స్‌తోసహా పాతికమంది మాకు కనబడకుండా వెళ్ళిపోయారు. వీరు ఖచ్చితంగా ఎటు వెళ్ళిందీ మాకు తెలియదు. మేము సాయం సమయానికి ఒక లంబాడీ తండకు చేరుకున్నాం. శత్రువు గుంపు మమ్మల్ని వెంటాడుతున్నదని మా అనుమానం. మరొక చోటికి తప్పుకొనే ప్రయత్నంలో వున్నాం. ఈ స్థితిలో చంటివాడి చప్పుడు శత్రువుకు అలికిడినందించవచ్చు. ఆ పసిపాపను ఆ తండాలో ఒక తల్లికి అప్పగించి తిరిగి మరునాడు అందుకోగలమని ఆమెకు మనవి చేశాం. అపరిచితురాలైన ఆ లంబాడీ తల్లిచేతుల్లోకి దొర్లిన ఆ పసి హృదయం కన్నతల్లిని కరుచుకున్నట్లే కరుచుకొన్న ఆ దృశ్యం నేటికీ నా కళ్ళల్లో మెదులుతున్నది. ఆ పసివానిని ఆ పళంగా వదిలి వెనక్కు తిరిగి చూడకుండా నైరుతిదిశకు కనపడుతున్న పర్వతశ్రేణులవైపుకు నడిచివెళ్ళాం. మా కన్నా ముందు నడిచిన మిత్రులు ఆ దిశకే నడిచినట్లు తెలిసింది. వాళ్ళనందుకోగలమన్న ఆశతో నడుస్తున్న మాకు అరమైలు దూరంలోనున్న తాటి వనం 'ట', 'ట' అని స్టెన్‌గన్ కాల్పుల చప్పుడుతో ప్రతిధ్వనించింది. దిగ్భ్రాంతి చెందిన మేము మరొక మూలకు తప్పుకొన్నాం. ఎక్కడివీ కాల్పులు ? శత్రువు వెంటాడుతున్నాడా? లేక ముందు వున్న మన వాళ్ళపై కాలుస్తున్నాడా ? అనే అయోమయ స్థితి, ముందువెళ్ళిన మన జట్టు ఎటు వెళ్ళిందీ? వెనుక మోదుగుల్లో చిక్కుకున్న సరోజిని, కొరియరు, కామ్రేడ్స్ ఏమయ్యారు. వాళ్ళ గురించి ఇంకా ఆశించ అంతుపట్టని ఆవేదన! హృదయభారంతో పదడుగులు ప్రక్కకు వున్నమదుగు పొద) లోకి మేము చేరాం. అప్పటికి బాగా అలిసిపోయిన మేము ఆయుధాలు ప్రక్కకు పెట్టుకొని వాటిపైనే ఒరిగాం.

మరునాడు మబ్బులోనే మేల్కొని దిగ్గునలేచి కూర్చొన్న మా కండ్లలో క్రితం రోజు తండాలో వదిలివేసిన పసివాడు మెదిలాడు. ఎంతకూ వాణ్ణివదిలి అడుగు ముందుకు వేయలేకపోయాం. అనుకోకుండానే ఆ తండావైపు మా నడకసాగింది. ప్రొద్దు పొడుస్తుండగనే ఆ తండకు చేరాం. పసివాడికోసం ఆ లంబాడీ తల్లిని తిరిగి అర్థించాం. ఆ తల్లి మేనుపై ఒరిగివున్న ఆ పసివాని పచ్చని శరీరం లేత కిరణాల కాంతిలో వింతగా మెరుస్తున్నది. వానిని అందించుటకు ఆ తల్లి సుతరామూ అంగీకరించకున్నది. "రాముడూ ! .... నా రాముడూ !" అనే పిలుపుతో కంట తడిపెడుతూ ఆ లంబాడీ తల్లి మా బాబును బలవంతంగానే మా చేతి కందించింది. ఆ పసివాణ్ణి హృదయానికి హత్తుకొని తిరిగి దారి నడిచాం.

కొంతదూరం పోగా అక్కడ మనుషుల అలికిడి. అదొక బావి. అడుగు ముందుకు వేశాం. చూడగా మరికొంత అలికిడి. ఇంకొక అడుగు ముందుకేసి చూడగా మనవాళ్ళు ! ! మాకు ముందు నడిచిన మిత్రబృందం. వెంటనే వాళ్ళ నందుకున్నాం. చెదిరిన రెండుజట్లు కలుసుకొన్న ఆ సంతోష సంరంభంలోనే ఒక విషాద దృశ్యం. మన ముఖ్య నాయకుడు ఒకరు రక్తసిక్తమై వున్నాడు. ఇది శత్రువు కొట్టగలిగిన గాయం కాదు. పొరబాటున మన తుపాకీయే పేలి ఏర్పడిన గాయం. అంతకు క్రితం నాటి సాయంత్రం కాల్పుల ధ్వని విన్నాం. కాల్పుల ఫలితమే ఆ గాయం.

అనుకోకుండా కలుసుకొన్న ఆ సందర్భంలో పరస్పరంగా మాలో జరిగిన సంభాషణలనేకం. ఇంతలోనే బావిగట్టుపై నున్న చెట్టుమీద కూర్చొని పలుదిక్కులు పరీక్షిస్తున్న రైతు మమ్మల్ని, "ఇది సురక్షిత ప్రాంతంకాదని, మరో చోటికి తరలి వెళ్ళాలనీ" హెచ్చరించాడు. ఇంతకూ మేము ఎక్కడికి చేరుకొన్నాం. గూడూరు. (మానుకోట తాలూకా) గ్రామ శివారులలో వున్నామని ఆ రైతు తెలిపాడు. ఆ వెంటనే రైతు హెచ్చరిక ననుసరించి నైరుతీ ముఖంగా పర్వత సానువుల్లోకి నడిచాం. ఆ పర్వత పరిసరాల్లో చేరిన మాకు మరొక దిక్కునుండి మరొకదళం నడుస్తున్నట్లు కనిపించింది. ఒక చిన్న దళం నలుగురితో నడుస్తూ వస్తున్నది. సమీపిస్తున్న ఆ దళంలోనుండి ఎర్రజెండా ఎగిరి మెరిసింది. ప్రతిగా మా జెండా ఎగిరింది. అంతులేని సంభ్రమాశ్చర్యాలు ! రెండంగల్లో మమ్మల్నందుకొన్నది ఆ దళం, ఆ దళ నాయకులెవరో కాదు ! స్వయంగా మన మల్లు వెంకట నర్సింహారెడ్డి (వి. యన్) గారే ! !

నిజానికి అంతక్రితం భయంకర శతృ వలయాన్ని ఛేదించుకొని బయటపడ్డ మాకు మరో వైపునుండి అందిన ఈ దళం ఆపద సమయంలో ఆదుకొన్న ఫైర్ బ్రిగేడ్‌లా కనిపించింది. అంతక్రితం జరిగిన శతృదాడి వార్త విని మమ్మల్ని అందుకొనే మహత్తర బాధ్యతతో కదలిన సైన్యమిది. నిజానికి అదొక ప్రత్యేక చారిత్రక దృశ్యం. ప్రమాద సమయంలో రెండువైపులనుండి అనుకోకుండా తమ బలాలు ఒకచోట కలుసుకొని నూతన స్థావరాన్ని చేరుటకు సన్నద్ధమైన దృశ్యం. ఆ తరువాత మరో సురక్షిత ప్రాంతానికి గాయపడిన మిత్రులతో సహా మమ్మల్ని కామ్రేడ్ వి.ఎన్.

చేర్చాడు. మేము బోనులోనుండి బయటపడిన వాళ్లగా ఎంతో ఆత్మ విశ్వాసం పొందాం. స్వయంగా ఆ ప్రాంత ప్రజలలో నీళ్ళలో చేపలవలె మెదులుతూ చెట్టూ చెట్టూ, రాయీ రాయీ పరిచయం కలిగిన సారధ్య సైనిక దళం మాకు రక్షణగా నిలబడింది. అందువల్ల మాలో నూతన విశ్వాసం, గాయపడిన మిత్రుని విషాద పరిస్థితిని మరపించిన నూతన ఉత్సాహం.

ఇప్పటికి మేము చేరుకున్న ఈ చోటు ఏ గ్రామ శివారులోనిది? ఖచ్చితంగా ఈ చోటు ఏ గ్రామానికీ సమీపంలో లేదు. రెండు పర్వత సానువుల మధ్య అదొక మడుగు. ఆ మడుగులో చిన్నబావి వద్ద ఒక కొట్టం. ఆ కొట్టం(పశువులదొడ్డి) పైన నిలబడి నలువైపులా చూస్తున్న ఆ రైతు కళ్ళలో మెరుస్తున్న మెలుకువ అద్భుతం. ఒక దేశ సరిహద్దును కాపలా కాస్తున్న సాయుధ సైనికుని దీక్షను మించిన దీక్ష ఆ రైతు ముఖంలో కొట్టొచ్చినట్టు కనిపిస్తోంది. ఇంతకీ ఈ ప్రదేశం గూడూరు–జంగిలికొండ(మానుకోటతాలూకా) మధ్య స్థలంలో వున్నట్టిది. తమ స్వస్థలానికి చేరుకొన్న సైనికులవలె అనుభూతి పొందుతూ ఊపిరి పీల్చుకొన్నాం. రెండు పూటలుగా ఆహారం అందని మాకు ఆ రైతు కుటుంబీకులు ఇద్దరూ హడావుడిగా యేర్పాట్లు చేస్తున్నారు. అలిసి సేద తీర్చుకుంటున్న మాలో అనుకోకుండానే ఒక తీరని వ్యధ ఎదలో రాజుకొంటుంది. సరోజిని మదిలో మెదిలినపుడు మనకిక ఆమె అందే ఆశ కనపడదు. జీవితంలో సహచరిణిని కోల్పోయిన ఒక కొత్త మలుపు, అంతుచిక్కని అగాధంలోకి దిగుతున్న మలుపు, చేతిలో వున్న పసిగుడ్డుకు వర్తమానమూ, భవిష్యత్తూ రెండూ కనబడవు. వాని ఏడ్పులు, ఆ ఏడ్పుల మధ్య అప్పుడప్పుడూ కనిపించే వాని బోసినోటి చిరునవ్వుకు అర్థమూ కనబడదు. అంతు చిక్కని సుడిగుండంలో కొట్టుమిట్టాడుతున్న మా ఆలోచనలకు ఇంతలోనే ఒక అంతరాయం? ఒక ఆశ్చర్యం! గాఢాంధకారంలో మెరిసిన మెరుపులాగా ఒక వార్త, "అదుగో ఎవరో ఒక ఆడమనిషి, వెనకాల మరొక అబ్బాయి వస్తున్నారని" సెంట్రీ నుంచి కబురు. అరే ఆడమనిషా! నా సరూ కాదుగదా! తీరా సమీపించేసరికి సంభ్రమాశ్చర్యాలు! నిజంగా నా సరోజినే! తప్పిపోయిన మరొక మిత్రుడు, శత్రువు చేతిలో సాక్షాత్తుగా చిక్కిపోయిన వీరు తిరిగి మన ముందు యెలా ప్రత్యక్షమయ్యారు? ఇది ఏమి కలకాదు కదా? మాయా, మోసంకాదుగదా? ఇంతలోనే చంటివాణ్ణి అందుకొని హృదయానికి హత్తుకొంటున్న ఆమె స్థితి అయోమయం. అదొక "తెగిన శరీరాల అతుకు". ఇంతకూ ఈ విచిత్ర దృశ్యం ఎలాసంభవమయింది. అదొక విచిత్ర వినూత్న గాథ! నలువైపులా పరికించిన మేము వారిని తర్కించి అడుగగా బోనులో నుండి బయటపడ్డ తమ గాథను ఆమె చెప్పనారంభించింది.

"క్రితం రోజు జరిగిన కాల్పుల నిప్పురవ్వల మధ్య ఒక పొదలో దాగిన తమకు బ్రతుకు మీద ఆశలేదు. కాల్పులు సద్దుమణిగిన ఆ కొద్ది క్షణంలో బూట్ల చప్పుడుతో, పొదల్లో తుపాకులతో పొడుస్తూ, కొడుతూ, గాలించిన భయంకర నృత్యమది. ఇంతలో రెండో దిశన బయటి నుండి పొదల్లోకి ఉధృతంగా వచ్చిన కాల్పులతో గాలిస్తున్న తోడేళ్ళు త్వరత్వరగా తిరుగుముఖంపట్టాయి. కుక్కినపేనువలె రాత్రి

వరకు పొదల్లో పడిపోయిన మేము చీకటిపడిన తరువాత సద్దుమణగగానే లేచిచూశాము. సమీప పొదల్లో వున్న మేము (సరోజిని మరొక కొరియరు) ఒకరినొకరు గుర్తించుకోగలిగాము. నెమ్మదిగా వాయువ్య దిశగా దారిపట్టాము. ఇప్పటికీ శత్రువలయం నుండి బయటపడ్డామనే విశ్వాసం మాకులేదు. పోగా అదొక గొర్ల పొది. కావలా కుక్కలు అరుపులు, వాటిని అనుసరించిన గొర్లకాపరులు – అనుమానిస్తూ అడుగు ముందుకువేశాం. ఇంతలో సమీపించిన మమ్మల్ని ఎవరక్కడ అని బెదురుతూ ప్రశ్నించాడు గొర్లకాపరి. క్షణంసేపులో మా వృత్తాంతం ప్రారంభించగానే అర్థంచేసుకొన్న ఆ కాపరి మాకు ఆశ్రయమిచ్చాడు. అయినా శత్రువు వెన్నాడుతున్న భీతి మమ్మల్ని వదల్లేదు. అతన్ని అనుసరించి ఒక గ్రామంలోకి వెళ్ళాం. ఆయన మరొక సహచరునివద్దకు తీసుకెళ్ళగా ఆకలి దప్పిగొనియున్న మాకు అక్కడ అల్పాహారంగా ఇంత అంబలి అందింది అక్కడ నుండి ఆ ఘడియలోనే బయలుదేరిన మేము మరొక ప్రదేశం ఆ రాత్రియే చేరుకొని అలసిసొలసి వున్న మేము గంటసేపు నిద్రించాం. తిరిగి తెలతెల వారుతుండగానే మెలకువతో వున్న ఆ గ్రామ ప్రజలు, మిత్రులు మమ్మల్ని లేపుకొని మీ అందరికోసం గాలిస్తూ దోవలో కలిసిన ఒక రైతు ద్వారా ఆరా తెలుసుకొని ఈ చోటికి చివరకు మమ్మల్ని చేర్చాడు. నిజానికి "మమ్మల్ని పట్టుకొనుటకు గాలించిన శత్రువు పట్టుదలకన్నా, ఆశ్రయమిచ్చి రక్షించి తెగిన శరీరాలను అతికించిన ఆ రైతు కూలీల దీక్ష అనేక రెట్లు హెచ్చు". అదొక అద్భుతమైన అభయహస్తం! అది కష్టకాలంలో వెన్నాడుతున్న శత్రువు నీడలోనే జరిగిపోయిన మహోజ్వల ఘట్టం !!

ఇంతకూ ఆకస్మికంగా శత్రువలయంలో చిక్కుకున్న ఈ దుర్ఘటనకు ఆరంభం ఎక్కడ ? రక్షణ స్థావరమనుకొన్న ఆ ప్రదేశం ప్రాణాంతకంగా పరిణమించిన ఈ దుష్పరిణామానికి మూలమెక్కడ ? మిత్రునిగా నటించిన ఒకానొక శత్రువు అందించిన అచూకీయే దీనికంతటికీ ఆరంభం. అలాంటి దుష్టపాత్రకు ఒడిగట్టిన దుర్మార్గుడు ఒకానొక పెత్తందారు. ఆ పెత్తందారు గ్రామం ఎల్లంపేట. మానుకోట తాలూకా, వరంగల్ జిల్లాలోని గ్రామమది. కొంతకాలంగా మిత్రునిగా నటించిన ఈ శకుని మన దళాలకు ఆహారం, నీళ్ళు మొదలగు వాటితో ఆతిథ్యాన్ని అందించాడు. ఇటు అన్న పానాదులు ఒకచేత అందిస్తూ, రెండోచేత శత్రుమిలిటరీ క్యాంపుకు కబురు అందించాడు. ఆ కబురందుకొని వెంటనే బయలుదేరి శత్రువు మాపై ప్రమాదకరమైన దాడికి తలపడ్డాడు. శత్రువు మమ్మల్ని చావుదెబ్బకొట్ట పూనుకొన్నాడు. కానీ గెరిల్లా వీరుల విప్లవదీక్ష ముందు, మెట్టుమెట్టుకూ అందిన ప్రజల ఉద్ధృతమైన అండదండలముందు శత్రువు ప్లాను పటాపంచలైంది. ప్రజల రక్షణలో విప్లవవీరులు అజేయంగా నిలిచి సమరరంగంలో ముందుకు సాగిపోయారు. ఇది చరిత్ర రుజువు చేసిన గొప్పసత్యం. అట్టి సత్యానికి సాక్ష్యంగా దేశం ముందు, ప్రజల ముందు నేటికీ తోటి సహచరులతో నిలిచివున్న మేము ఎంతైనా ధన్యులం. అదే దీక్షతో కమ్యూనిస్టు ఉద్యమంలో తోటి సహచరులతో దిగ్విజయంగా ఇంకనూ ముందుకు సాగిపోగలం.

!! విప్లవం వర్ధిల్లాలి !!!

–భీమిరెడ్డి నరసింహారెడ్డి



# వీరవనిత అయిలమ్మ

[వీర తెలంగాణా రైతాంగ పోరాటం శ్రీమతి అయిలమ్మ వీరోచిత ప్రతిఘటనతో ఆరంభమైంది. సాయుధ పోరాటంలో ప్రముఖ పాత్ర నిర్వహించిన కామ్రేడ్ భీమిరెడ్డి నరసింహారెడ్డి "ప్రజాశక్తి" 1971 జనవరి 1వ తేదీ సంచికలో రాసిన జ్ఞాపకాలను తిరిగి ప్రచురించుతున్నాం —ఎడిటర్.]

ఆమధ్య నేను కామ్రేడ్ యాదగిరితో కలసి జనగామ తాలూకాలో పర్యటించేందుకు వెళ్లాను. ఆ సందర్భంగా 1970 డిశంబర్ 31వ తేదీన పాలకుర్తి గ్రామం చేరుకున్నాం. ఆ వూరికి 3 కిలోమీటర్ల ముందు విసునూరు చేరడంతోనే మోటార్ సైకిల్ వెనుక సీట్లో కూర్చునివున్న కామ్రేడ్ యాదగిరిరావు తన చేతి వేలెత్తి చూపుతూ "అదిగో! అదే మనల్ని చిత్రహింసలు పెట్టిన బందిఖానా" అన్నాడు.

నేను తలెత్తి అటు చూశాను. నిజమే, అది చిత్రహింసల గుహ. ఇరవై అయిదు ఏళ్ళనాటి తెలంగాణా విప్లవ పోరాటంలోని అనేక ఘటనలు నా స్మృతి పథంలో అలలు అలలుగా మెదలనారంభించాయి.

నన్నూ, యాదగిరిరావు, మరో ముగ్గురు కామ్రేడ్స్‌ని బంధించింది ఆ గుహ లోనే. అందులో మమ్మల్ని విపరీతంగా కొట్టారు. మాలో ప్రతి ఒక్కరి ఒళ్ళంతా హూనమైపోయింది. స్పృహతప్పి పడిపోయాం. కొంతసేపటికి తేరుకోగానే కళ్ళు తెరవడం అసాధ్యంగా వుంది. కళ్ళలోను, శరీరంలో తగిలిన గాయాలలోను కారం చల్లుతూ నానా హింసలు పెట్టారు.

మా తలవైపున, కాళ్ళవైపున కూర్చున్న కసాయి పోలీస్‌లు కర్రలతో మళ్ళీ మళ్ళీ బాదారు. అంతకు ముందు పోలీస్‌స్టేషనునుండి మమ్మల్ని ఈ గదిలోకి ఒక్కొక్కరిని విడివిడిగా లాక్కొచ్చేటప్పుడు మా చేతులకు బేడీలువేశారు. బేడీలతో ముడివేయ బడివున్న చేతులతోనే ప్రతిఘటిస్తూ నేను, మిత్రుడు యాదగిరిరావు, గంటల తరబడి దుండగులకు అలవి కానివ్వలేదు. అప్పుడు మా ఒక్కొక్కరిపై ఐదుగురు విరుచుకుపడి రూళ్ళ కర్రలతో కాళ్ళమీదబాది కింద పడగొట్టి గొడ్లను ఈడ్చి నట్లు ఈడ్చి గదిలో పడవేశారు.

ఇదంతా నరరూప రాక్షసుడు దేశముఖ్ విసునూరు రామచంద్రారెడ్డి ఆదేశం ప్రకారం సాగించిన హింసాకాండ.

ఆ బందిఖానా గదిని చూడటంతో మనసుకు తట్టిన ఈ ఘటన నెమరు వేసు కొంటూ మరో రెండు ఫర్లాంగులు ముందుకు వెళ్ళాం. దారికి ఎడమ వైపునవున్న మోదుగచెట్లు గుబుర్లను చూపుతూ—

"ఇదుగో; వందమంది దుండగులు మారణాయుధాలతో దొంగచాటుగా మనపై దాడి చేసింది యిక్కడే"నని మిత్రుడు యాదగిరిరావు గుర్తుచేశాడు.

మోడులైవున్న ఆ మోదుగులు నాటి దుండగుల బందిపోటు దాడిని గుర్తు చేయుటకై నేటికీ నిల్చి వున్నయా అన్నట్లు అవి చలనంలేకుండా పడివున్నాయి.

ఆ రోజులలో ఒకనాటి ఉదయం పదిమందిమి కలిసి పాలకుర్తినుండి విసు నూరు వస్తున్నాం. దేశ్‌ముఖ్ దుండగులు వందమంది మారణాయుధాలతో హఠాత్తుగా మాపైబడి చితకబాదారు. చనిపోయామని భావించి మమ్మల్ని విడిచి వెళ్ళారు.

అప్పటి ఘటనలన్నీ ఒకటొకటిగా మా మెదడులో దొర్లిపోతుండగా ఇంతలో పాలకుర్తి చేరాం.

డెబ్బయిఏళ్ళ ముదివగ్గు అయిన శ్రీమతి అయిలమ్మ ఇంటికి వెళ్ళాం. ఆమె నన్ను వెంటనే గుర్తుపట్టలేదు. మిత్రుడు యాదగిరిరావు నా గురించి ఆమెకు గుర్తు చేశాడు. నన్ను పరికించి చూస్తున్న ఆమె పెద్దకళ్లు ఆనంద బాష్పాలతో అలరారినాయి. ఆనాటి విప్లవ చరిత్రంతా మూర్తీభవించిన విగ్రహంగా నేటికీ చెక్కు చెదరని ఆరని

జ్యోతిగా నా కళ్ళకు కనిపించింది. ఆమెను చూడ్డంతోనే ఆనాటి పోరాట ఘట్టమంతా జ్ఞప్తికొచ్చింది. ఈ వీర నారీమణి అయిలమ్మ నాయకత్వాన సాగిన పోరాటం నా మదిలో చక్రంవలె తిరుగుతూ కనబడింది.

నిరుపేద చాకలి కుటుంబీకురాలయిన అయిలమ్మ, ఆమెతోపాటు మరో ఇద్దరు పేద రైతులు రెండు ఎకరాలు సేద్యం చేసుకుంటున్న రోజులవి. ఆ భూమిని వారు తరతరాలుగా సాగుచేసుకొంటున్నారు. ఈ పొలంలో పంటను అమాంతంగా దాడిచేసి కోసుకెళ్ళడానికి దేశ్‌ముఖ్ విసునూరు రామచంద్రారెడ్డి, దుండగుల మూక పొలంమీద వాలింది. దీని ముక్తాదారు పల్లంపల్లి దేశ్‌ముఖ్ అనే మరొకడు వుండగా కావాలని వీళ్ళను సాధించేందుకు అతనివద్ద అధికారం పొంది ఈ భూమి మీదకు దాడికి వెళ్లాడు విసునూరు దేశ్‌ముఖ్.

అయినా, యీ దురంతానికి అయిలమ్మ లొంగలేదు. తన ఇంటిపై ఎర్రజండా ఎగురవేసి ఇంటిని కమ్యూనిస్టుపార్టీ కార్యాలయంగాచేసి దేశముఖ్ కిరాతకాన్ని ఎదురొడ్డి నిలవదల్చుకొన్నది. ఈ భీకర పోరాటంలో అయిలమ్మకు తన భర్త, పెద్దకుమారుడు వెంటలేరు. వాళ్ళను అంతక్రితమే దేశ్‌ముఖ్ దుండగులతో ఘర్షణ పడ్డారన్న మిషతో జైల్లో పెట్టారు. ఆమె దీక్షతో గ్రామ ప్రజలు ఉత్తేజితులై నిలచారు. ఈ వార్త ఆ పరిసర ప్రాంతాలకు దూరప్రాంతాలకు కూడా అందింది. అందిందే తడవుగా వందలాది ప్రజలు పాలకుర్తి వచ్చి అయిలమ్మకు అండగా నిలిచారు. చుట్టుపట్ల గ్రామాల నుంచి వచ్చిన కమ్యూనిస్టుపార్టీ వలంటీర్లు దుండగులను తరిమికొట్టారు. వరికోసి, కొట్టి ధాన్యం మూటలుకట్టి వీపులమీద మోస్తూ అయిలమ్మ ఇంటికి చేరుస్తుండగా దారిమధ్యలోనే మరొక కిరాతకదాడి ఎదురైంది. దుండగులచే నెరవేరని తన దుర్మార్గం సాయుధ పోలీసులచే సాధించాలని దేశ్‌ముఖ్ తలచాడు. అందుకే సాయుధ పోలీసు మూకను ఎగదోలాడు. వీపులమీద ధాన్యం మూటలు మోస్తున్న వారిలో నేనూ వున్నాను. నా కళ్ళకు సబ్‌ఇన్‌స్పెక్టర్ టార్చిలైటువేస్తూ "పకడో, పకడో" అని బిగ్గరగా కేకలు వేశాడు. ఒక వైపు అందినవారిని అందినట్లు అరెస్టుచేస్తున్నా, మరొకవైపు ప్రజలు బహునేర్పుగా ధాన్యాన్ని ఎక్కడికక్కడ తప్పించి అయిలమ్మ ఇంటికి చేర్చారు. ఇందుకు ప్రతిచర్యగానే ఒక దొమ్మీ కేసు మాపై బనాయించి పైన పేర్కొన్న విధంగా చిత్రహింసలు పెట్టారు.

అయిలమ్మ తన ఇంటిపై ఎర్రజెండా ఎగురవేసి కమ్యూనిస్టులకు ఆశ్రయమిచ్చిందన్న కక్షతో ఆమెపై ఈ దురంతం సాగించారు. అయినా ఆమెలోదీక్ష చెక్కుచెదరలేదు. దేశముఖ్ వెట్టిచాకిరికి, నిరంకుశ పాలనకు గురౌతూ నిత్యం పీడించబడుతోన్నకుటుంబాలలో ఆమె కుటుంబం ఒకటి. ఈ కుటుంబాలలో పురుషులు తమకు కలిగిన కలో, గంజో త్రాగి భార్యాపిల్లలతో కలిసివుండే అవకాశం వాళ్ళకు వుండేది కాదు. దేశ్‌ముఖుల స్వాధీనంలో బానిసలుగా బ్రతుకుతూండేవారు. ఆరోజు ఈరోజు

అనకుండా ఎల్లప్పుడు వాళ్ళు ఏదో ఒక ఊరు పంపబడుతూండేవాళ్ళు. వారి స్త్రీలు దేశ్‌ముఖ్‌ల ఇళ్ళలో బానిసలుగా 24 గంటలూ చాకిరీ చేయాల్సివుండేది. ఇలాంటి దుర్భర చాకిరీజీవితం నుంచి బయటపడేందుకు దేశ్‌ముఖ్‌ల క్రూరత్వానికి వ్యతిరేకంగా ప్రజలను సమీకరించి నాయకత్వం వహించిన ఎర్రజెండాను తన ఇంటిపై ఎగురవేసిన వీరవనిత అయిలమ్మ.

దేశ్‌ముఖ్ గూండాలను ప్రతిఘటించిన నేరానికి ఆమె భర్తను, ఇద్దరు కొడుకులను జైల్లో పెట్టారు. వాళ్ళు జైల్లో మగ్గుతున్న కాలంలోనే ఈ పోరాటమంతా సాగింది.

ఆమె తనఇంట్లోనే కమ్యూనిస్టుపార్టీ కార్యాలయం పెట్టి, కబళం అడుక్కొచ్చి మాకందరికీ పెట్టేది. పోలీస్‌ల, దేశముఖ్ దుండగుల బీభత్సకాండతో ప్రజలు భీతి జెందివున్న రోజులలో కణకణ మండే నిప్పుకణికవలె నిల్చిందామె.

గత పోరాట చరిత్ర అంతటికీ నిండు నిదర్శనంగా నిల్చిన అయిలమ్మను పాతిక సంవత్సరాల తర్వాత మళ్ళీచూడగలిగినందుకు నేను నిజంగా ధన్యుణ్ణి.

— భీమిరెడ్డి నర్సింహారెడ్డి.



# 5

## కాచుకో ఊరదరబాంబు దెబ్బ!

(అది నల్లగొండ జిల్లా సూర్యాపేట తాలూకాకు చెందిన కోటపాడు గ్రామములో 1947 సంవత్సరం వేసవిలో నిజాము రజాకారు మిలటరీ మూకపై కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన జరిగిన సాయుధ గెరిల్లా దాడి. అది తెలంగాణాలోని నాటి సాయుధ నిజాము రజాకారు మిలిటరీ మూకలపై జరిగిన తొలి దాడులలో ముఖ్యమైనది. హత్యలు, లూటీలు, గృహ దహనాలు యథేచ్ఛగా సాగించుతోన్న రజాకారు మూకలపై తమ ప్రతీకార దీక్షకు పరిష్కారము దొరకక నిరాయుధ జనం మసలిపోతున్న రోజులవి. ఈ ప్రతీకార దీక్షలోనుండే అగ్నిబాంబులు ఎగిరి శత్రుమూకపై విరుచుకపడ నారంభించాయి. అందులో ఈ కోటపాడు గెరిల్లా దాడి తొలి మచ్చుతునక యని చెప్పవచ్చును.) — ఎడిటర్.

"చూస్తారెందుకు ఊదరబెట్టి చంపక దుర్మార్గులను" అనే మాటలకు అప్పటికి ఎటూ తోచని స్థితిలో తలపట్టుకుని వున్న నేను హఠాత్తుగా ఉలిక్కిపడ్డాను. ఒక పండు ముదుసలి నోటినుండి వెలువడిన ఈ మాటలు కారుచీకటిలో కాంతిరేఖను మెరిపించి కర్తవ్యం గుర్తుచేసాయి.

అప్పటికి మధ్యాహ్నం 2 గంటల నుండి 5 గంటలుగా నిజాం రజాకార్ మిలిటరీతో సాగుతున్న పోరది. వాస్తవానికి గెరిల్లా దళంగా సాయుధ మిలిటరీతో తలపడటం మాకు చరిత్రలో ఇదే మొదటిసారి. ఇది ప్రతిష్ఠంభనలో పడి యెటూ తేలని స్థితి ఏర్పడింది. శతృమూక మూడు అంతస్తుల మేడలో రక్షణ తీసుకొని ఆధునిక ఆయుధాలు కలిగిన మిలిటరీ పనికిరాని నాటు ఆయుధాలు గల ( బర్మార్ తుపాకులు) మమ్ములను దరికిరాకుండా తరుముతున్నారు.

నలుమూలల ముట్టడివేసివున్న మేము ఒక అడుగుకూడా ముందుకు వేయలేకపోతున్నాం. మార్గముతోచక తలపట్టుకొని చతికిలపడి తరుణోపాయం కొరకు అన్వేషిస్తున్న నాకు వజ్రాయుధమొకటి ఈ దెబ్బతో అందనే అందినది. "అవును అవసరమైతే ఈ భవనాన్నే తగులబెట్టి ఇందులోవున్న దుండగులను దునుమాడితీరాలి" అనే నినాదం ప్రతిధ్వనిస్తుండగా అప్పటికే కర్తవ్యం కొరకు కాచుకొనివున్న వందలమంది జనం విజృంభించి గడ్డివాములు అందుకొన్నారు. చూస్తుండగా భవనం నలువైపుల పేరుకొనియున్న గడ్డిమోపులు అగ్ని బాంబులుగా మారి మంటలతో భవనాన్ని నలువైపులా ముట్టడించాయి. ఇంతవరకు భవనం అడుగు భా గం లో రక్షణలోయున్న శత్రుమూక ఈ ఊదర దాడికి ఉడికి ఉడికి పోనారంభించింది. నలువైపులా ఈ అగ్ని బాంబులు (మండుతున్న గడ్డిమోపులు) ఒక్కటిగా గోడపైనుండి లోపలికి దొర్లుతూ వెదజల్లుతున్న అగడకు (వేడి) శత్రుమూక తాళలేకపోతున్నది. అడుగుభాగం వేడెక్కడంతో పైఅంతస్తుకెక్కిన కిరాతకులు అక్కడినుండి తిరుగుదాడి ఆరంభించారు.

ప్రజల అండతో విజృంభించిన గెరిల్లాలు భవనంలో ప్రవేశించి మొదట రక్షణశ్రేణిని ఛేదించారు. మొదటి అంతస్తుపైనుండి తిరుగు దాడిని ఆరంభించిన శత్రుమూకలకు అగ్నిబాంబులు ఎదుర్కోవడం ఎలా అనే సరికొత్తసమస్య ఎదురైంది.

పెద్ద పెద్ద గడ్డి మోపుల స్థానాన్ని అగ్నిజ్వాలలో మండుతున్న చొప్పకట్టలు మంటలు క్రక్కుతున్న రామబాణాలుగా అతివేగంగా దూసుకొని పై అంతస్తులోనికి ప్రవేశిస్తున్నాయి. ప్రతీకార దీక్షతో వెనుకనుండి ప్రజలు కడు చాకచాక్యంతో గెరిల్లాలకు అండగా వెనుకనుండి సాగిస్తున్న సరికొత్తదాడి అది. రివ్వున అగ్నిబాణాలు అప్పటికే అందులో వున్న మిరపకాయ, చింతపండు అంకెములు అంటుకొనగా అవి రణగొణధ్వనిచేస్తూ శత్రువుకు ఊపిరిసల్పని స్థితి కల్పించి ఉక్కిరి బిక్కిరి చేయనారంభించాయి. దీనివల్ల శత్రువు తిరుగుదాడి విచ్ఛిన్నం కాగా ప్రాణాలు రక్షించుకొనుటయే ప్రధానమని తలచి ఆ దుండగులు ఆఖరిఅంతస్థుకు చేరుకున్నారు. అయినా ఆ వెనువెంటనే అగ్నిజ్వాలలు ప్రజల ప్రతీకార దీక్షగా అదేపనిగా వెంటాడుతూ శిఖ

లాన్ని సహితము అంటుకొన్నాయి. మరోవైపు గెరిల్లాలు కాల్పులను తప్పుకుంటూ గోడనంటిపెట్టుకొని బుసలుకొడుతున్న త్రాచులవలె పైకిపాకుతూ శిఖరాన్ని అందుకొంటున్నారు. భవనంలోపలి భాగంలోనుండి మంటలమధ్య చోటుచేసుకొని జనంపైకి త్రోసుకువస్తున్నారు. అటు తమ చేరువలోకి సమీపిస్తున్న గెరిల్లాల దాడికి, ఇటు నాలుకలు కొరుకుతూ తమనందుకో ప్రయత్నిస్తున్న అగ్నిజ్వాలల అగడుకు ఆగలేక శత్రుమూకలోనుండి కొందరు తమ రైఫిళ్ళను భవనంమీదనుండి క్రింద పడవేసి "నాయకులారా శరణు" అంటూ ముగింపు వేడికోలు ప్రారంభించారు. కానీ అప్పటికి అందుబాటులోకి వచ్చిన జనం ఈ వేడికోలును మన్నించుటకు సిద్ధంగా లేరు. ఈ దుండగుల అత్యాచారాలకు, అమాయిత్యాలకు నిత్యం గురియైన జనం పగ సాధించే పట్టుదలతో ఆ మంటల్లోనుండే త్రోసుకువచ్చి ఆవేశంతో చిందులు త్రొక్కుతున్నారు. అప్పటికే శత్రువులపై ఆఖరి దెబ్బ తీయుటకై గెరిల్లాల దళంతో తారాడుతున్న మేము ఈ జన ప్రవాహాన్ని నిలుపుజేశాము. ముగింపు దశలోనున్న శత్రువు దేనికైనా తెగించవచ్చు. కనుక దీనిపై మరో అంతస్తుగావున్న పిట్టగోడ చాటుగా రక్షణ తీసుకొని వున్న శత్రువును కనిపెట్టుకొని కొందరు గోడ కానుకొని సిద్ధంగావుండగా మాలోనుండి ఒకరు హఠాత్తుగా పిట్టగోడ ఎక్కి దుమికి "లొంగిపొండి" అనేకేకతో రెండు రౌండ్లు ప్రేల్చాడు. మొదటి దెబ్బకే ఇద్దరు కూలిపోగా తక్కినవాళ్లు శరణు అంటూ మా మధ్యలో పిట్టగోడమీదనుండి దూకారు. ప్రతీకార ఆవేశంతో బుసలు కొడుతున్న జనం దొరికిన వాణ్ణి దొరికినట్లే చితకబాదుతున్నారు. వాళ్ళ కమాండర్ మాత్రం తప్పించుకొని శరణుశరణు అంటూ నన్ను సమీపిస్తున్నాడు. అలా సమీపిస్తూనే అమాంతంగా నాపైబడి నా చేతిలోవున్న "స్టెన్‌గన్" మడిమ పట్టుకొని ఆ గొట్టం నాపై త్రిప్పబూనుకొన్నాడు.

ఆకస్మికంగా పైబడిన ఈ దొంగ దెబ్బకు కొంచెం ఆలస్యంగా తేరుకొన్న నేను ఆ గొట్టాన్ని వానిపైకి త్రిప్ప చూచినాను. ఆజానుబాహుడుగావున్న ఆ కమాండరు అందుకు అలవి కానివ్వడంలేదు. ఈ పెనుగులాటలో ఇద్దరం క్రిందపడి ఒకరిపై ఒకరం దొర్లుతున్నాము. ఇరువురి మధ్యలో తుపాకి మెసలుతున్నది. దొరికిన కిరాతకులను తమ కసికొద్ది బాదుతున్న జనంలోనుండి కొందరు మా పెనుగులాటను ఆలస్యంగా గమనించారు. ఆ క్షణమే ఆ రజాకారు కమాండరును దెబ్బతీయుటకు అలవిగాక పెనుగులాటలోవున్న మమ్ములను ఆవేదన, ఆవేశంతో పొగలు గ్రక్కుతూ చూస్తున్నారు. చివరకు పదిచేతులు ఆ దుండగీడును అందుకొని దెబ్బ తీయబోగా, ఆ రక్కసుడు అమాంతంగా పిట్టగోడమీది కెగిరి, భవనం ప్రక్కనేవున్న ఇంటిపై నుమికాడు. ఈ దొంగ దెబ్బతో శివమెత్తివున్న నేను ఆ వెంటనే రేచువలె వేటాడి అదే పిట్టగోడమీదినుండి దెబ్బ వెంట దెబ్బ కాల్చడం జరిగింది. తక్షణమే పడిపోయాడు ప్రమాదకారుడైన ఆ కిరాతకుడు.

అయిపోయింది నిజానికి ఒక యుద్ధమే ముగిసింది. 8 గంటలుగా ఎడతెగకుండా నిప్పుల మంటలుచెరుగుతూ మహాఅద్భుతంగాసాగిన గెరిల్లాయుద్ధం ముగిసింది.

అప్పటికి రాత్రి సమయం కావచ్చింది. భవన శిఖరాగ్రంలోవున్న మేము శత్రుకోటనే గెలుచుకున్నంతటి విజయధ్వనితో 'విజిల్'వుదుతూ విజయభేరి మ్రోగించుతుండగా "కమ్యూనిస్టుపార్టీ జిందాబాద్!, నైజాం ప్రభుత్వం నశించాలి" "ఆంధ్ర మహాసభ జిందాబాద్!" అన్న నినాదాలతో భూన భువనాంతరాలు దద్దరిల్లగా డప్పులు, కొమ్ములు విజయ దుందుభితో మారు మ్రోగగా అప్పటివరకూ తమ తమ స్థానాలలో నిలిచి పోరాడిన గెరిల్లావీరులు శత్రువునుండి స్వాధీనం చేసుకున్న నూతన ఆయుధాలను ధరించి విజయ గీతికతో కదం త్రొక్కుతూ-పదం పాడుతూ ముందుకు నడిచారు. ఆ వెంటనే జనప్రవాహం ముందుకుసాగింది. ఈ మహాప్రవాహం అప్పటికే చుట్టు ప్రక్కల గ్రామాలనుండి కెరటాలుగా ముందుకువస్తున్న మానవ మహాసముద్రంలో కలసిపోయింది. తమ విజయవీరులైన గెరిల్లాలను ఒక బోరుగడ్డపైన నిలబెట్టిచుట్టూ పాటలు పాడుతూ నాట్యమాడుతూ గంతులువేశారు. విజయచిహ్నంగా గెరిల్లాలు తమ నూతనాయుధాలను ప్రేల్చుతూ యుద్ధనాట్యం చేశారు.

చివరకు ఈ వీరోచిత విజయఘట్టం ఒక నిరుపేద స్త్రీచే మంగళహారతులతో గెరిల్లాకు అందించిన నీరాజనాలతో శుభంగా ముగిసింది. ఈ మహాజనం మధ్య నుండి ముందుకు త్రోసుకువచ్చిన మధ్యవయస్కురాలైన ఈ తల్లి చేతుల్లోని హారతిదీపాల వెలుగులో కళ కళ లాడుతున్న ఆమె కళ్ళలో నుంచి ఆనందబాష్పాలు ఒక్కొక్కటిగా రాలిపడుతున్నాయి. తీరా విషయం విచారించగా చారిత్రాత్మకమైన ఈ ఘట్టానికి ఈమెయే మూలకందమని వెల్లడయింది.

ప్రక్కనే రాగిపాడు గ్రామస్తురాలైన ఈ తల్లిని ఆరోజు మధ్యాహ్న సమయంలో రజాకార్ రక్కసులు బలాత్కరించే యత్నంలో వుండగా గెరిల్లాల మొదటి బర్మార్ దెబ్బ ప్రేలింది. వెంటనే నలువైపులా మ్రోగిన తుపాకి దెబ్బల మ్రోతలకు కంగారుపడిన ఆ మృగాలు ఈ తల్లిని వదలి పరుగెత్తి ప్రక్క గ్రామాలయిన కోటపాడులో రక్షణ తీసుకొని ఎదురుదాడి ప్రారంభించారు. కానీ ఆ భవనమే ఆ రక్కసులను పూడ్చిపెట్టిన సమాధిగా మారింది.

— భీమిరెడ్డి నర్సింహారెడ్డి.





# కదనరంగంలో జంట హృదయాలు

[1950 ప్రారంభంలో కారడవిలో కోయప్రజల అండదండలతో సాయుధ మిలటరీ మూకల దాడులను ప్రతిఘటిస్తూ ప్రజా విముక్తి దళాలు పోరాడుతున్న రోజుల్లో జరిగిన ఒకానొక వాస్తవ గాథ ఇది.] — ఎడిటర్.

"చేయివదులు లంజాకొడకా! ఎవడవురా! నీవు నన్ను ముట్టుకుంటావురా!" అని వెంకటమ్మ పెనుగులాడుతోంది- సాయుధుడుగాఉన్న సైనికుడి నుండి వదిలించుకొనుటకు!

"ఏమిటి వెదవముండా! ఏమీ చేయలేవు, ఇటురా" అంటూ, ఇనుపహస్తాలతో వెంకటమ్మను ఆ గుడిసెలో ఒక ప్రక్కకులాగుతున్నాడు సైనికుడు.

"అరి ! పందీ ! ఎవడవురా నీవు నన్ను గుంజడానికి ! బుద్ధిలేదు ! పోరా ఎలుగ్గొడ్డూ" అంటూ వెంకటమ్మ తన రెండు చేతులు బలంగా లాగుకొని వాణ్ణి ఒక్క వూపున వెనక్కు నెట్టింది. ఆ వూపుతో వెనక్కు ఒక అడుగు మొగ్గినా ఆ రిజర్వు సాయుధుని నల్లటి పెంజేరులావున్న ముఖంలో కళ్ళు చింతనిప్పుల్లా కోపంతో ఉరిమాయి, ప్రక్కవున్న ఆయుధం వైపు చూపుతూ.

"ఆ లంజ! నఖరాలుచేస్తే కాల్చిపారేస్తాము" అని అమాంతంగా వెంకటమ్మ మీదికి ఆకలిగొన్న మృగంలా లంఘించాడు.

ఇంతలోనే. "టాప్, టాప్, టాప్, టాప్"

"ధన్, ధన్, ధన్,"

అని రైఫిల్ గుళ్ళు ఆ గుడిసెలోనించి దూసుకుపోయిన ధ్వని.

మెరుపు దెబ్బ తిన్న మృగంలా చెదరిన సైనికుడు కంగారులో ఆయుధం అందుకొని నేలపై పొర్లుతూ వచ్చిన దారివైపు ప్రాకుతూ వున్న తన జట్టులో చేరిపోయాడు.

కాల్పులు ఇరువైపులా ఉధృతమయ్యాయి.ఆకస్మిక ముట్టడికి లోనయ్యామనే కంగారులో ఆ సాయుధ పోలీసు జట్టు అయిదు నిమిషాలలో పరుగు లంఘించుకొంది. దాదాపు నిస్పృహ స్థితిలోవున్న వెంకటమ్మ సొమ్మసిల్లి మూలన గుడిశలో కూలబడి కళ్లు మూసుకొని నెమ్మదిగా శ్వాస పీల్చుతుంది. ఇంతలో క్రమంగా తిరిగి గుడిశలో అలికిడి. నెమ్మదిగా కళ్ళు తెరచి చూచింది. మరొక సాయుధుడు ప్రత్యక్షం. అయితే ఇతడు పోలీసు వేషంలో లేడు. ఖాకీ బనియను, నిక్కరు–ఒంటిపై మరేమీ లేవు.

అలసిసొలసి పడివున్న వెంకటమ్మ అదిరిపాటుతో లేచి నిలబడి బెదురు కళ్ళతో చూస్తూ ఒక మూలకు నెమ్మదిగా జరుగుతోంది.

"భయపడకు, మేము పోలీసులం కాము, మీ వాళ్ళమే."

"మావాళ్లా?" ఇది చిత్రం. హతేరా చేతబూనిన ఈ పెద్ద మనుషులు మన వాళ్ళెలా కాగలరు? అని తలుస్తూ, వణుకుతూ వున్న వెంకటమ్మ కళ్ళలోంచి కన్నీటి బిందువులు జలజలా రాలనారంభించాయి.

"అయ్యో! ఏడుస్తున్నావా అమ్మా: నమ్మ, మేము కమ్యూనిస్టులం, మీ రక్షణకు వచ్చాము."

"కమ్యూనిస్టు" ఈ మాట అదురుపాటుతోవిన్న వెంకటమ్మ మెదడులో మెరుపులా మెరిసింది. ఇంతకుక్రితమే ఆ పోలీసు మృగాలు–

"కమ్యూనిస్టులు వచ్చారా? వున్నారా?"అని పలుసార్లు ప్రశ్నిస్తూ వేధించారు "ఆ కమ్యూనిస్టులెవళ్లా" అనే ఆలోచనాతో నెమ్మదిగా స్థిమితంలోకి వస్తున్న వెంకటమ్మకు బయట అలికిడి వినిపించింది.

"అమ్మా! వెంకటీ ఏమయిపోయినావే!" అనుకుంటూ తన ముసలితాత వచ్చి అమాంతంగా కౌగలించుకుని బావురుమంటూ ఏడుస్తోన్నాడు.

"ఏమిలేదు తాతా, లంజకొడుకులు పారిపోయింౘ్రు"అంటూ తన తాత గడ్డం పట్టుకొని కళ్ళనీళ్ళు తుడిచింది.

"వీళ్ళు మనవాళ్ళే, కొత్తచుట్టాలు" అని జగన్నాధంవైపు చూపుతూ పరిచయం చేసేవానిలాగా ముసలితాత గాంభీర్యాన్ని దాల్చాడు. ఇంతలో ఈ "వింత

చుట్టాలు" పదిమంది రెండు దళాలుగా వేరు వేరు దిక్కుల నుండి ఆ చిన్న గుడిసె ముందుకు చేరారు, ఎక్కువమంది సభ్యులకు ఒంటిపై చొక్కాలు లేవు. వున్నవాళ్ళకు కాకీబనియన్‌లు మాత్రమే. అందరూ ఆయుధాలు చేతబూనివున్నారు.జగన్నాధం ఆదేశించగానే ఎవరిస్థానంలో వారు రెండుదళాలుగా గుడిసెకు రెండు దిక్కులుగా కూర్చున్నారు. ఇద్దరు కాపలాగా కొద్దిదూరం దారులవైపు నిలబడి ఆయుధాలతో సన్నద్ధులుగా నలువైపులా చూస్తున్నారు. ఇదేసమయంలో నలువైపులా పొదల్లోనుండి స్త్రీలు-పురుషులు నెమ్మదిగా వెలువడి గుడిసెల వద్దకు చేరుతున్నారు.

అవి, మహా సముద్రంలోనున్న చిన్నదీవివలె ఆ మహారణ్యంలో పడివున్న పూరి గుడిసెలు. అందులో తరాలుగా కాపురంవుంటున్నవి పది కోయకుటుంబాలు. ఈ రెండింటికిగల ఋణానుబంధం ఏమిటో వీరిని అనాదిగా ముట్టడించివున్న ఆ మహారణ్యానికే తెలియాలి.

"ఏం మామా! జ్ఞాపకం వుందా! తాగి కడుపు చల్లచేసుకో"అని ముసలి తాత జగన్నాధంవైపు చూచాడు.

"ఎవరీ మామలు! ఎక్కడిదీ వింత చుట్టరికం, బయటి దేశంనుండి వచ్చిన ఈ మనుష్యులకు తమపై ఎందుకు మమత?" అని పరిపరివిధాలా ఆలోచిస్తోంది వెంకటమ్మ.

"అమ్మా! వెంకటీ! ఆ బుర్రజావ అందుకొని మామలకు పంచుతల్లీ" అని జగన్నాధం జవాబును అందుకోకుండానే ఆదేశించాడు. అప్పటికి ఒక సొరకాయ బుర్రను అందుకొని సిద్ధంగాయున్న వెంకటమ్మ గుడిశలో ఒకప్రక్కకు పెట్టి బాణంలో ఉన్న తైరుజావ అందులో నింపుకొని జగన్నాధంకు, తక్కిన దళ సభ్యులకు వరుసగా వడ్డించింది. వాళ్లు ఒకేచోటికి కదలిరాకుండా ఎవరి స్థానంలో వాళ్లు సన్నద్ధులుగావుండి జావ సేవించడం వింతగా తోచింది వెంకటమ్మకు.

"మంచిదిమామా! కడుపు చల్లబడింది." అని బ్రేవ్‌మంటూ ఆరంభించాడు జగన్నాధం.

"ఇక శెలవు. దగ్గరలోనే వుంటాము. పిలవండి ఎప్పుడంటే అప్పుడు. నమ్మండి మమ్మల్ని. మేము మీ పిల్లలవంటి వాళ్ళం. ఈ ఆయుధాలు చేతబూనింది మీవంటి జనం కోసమే" అన్నాడు జగన్నాధం.

"ఎక్కడికి కెళ్తారుమామా? ఏ దేశమో! యెందుకొచ్చింద్రో! ధర్మరాజులు నిజంగా" అంటూ ప్రక్కకు తిరిగి "ఓరి బొర్రోడా వీరికి పులివాగు దిక్కు చూపిరా పోరా" అని ప్రక్కన నిలబడి కడుపు అంటుకుపోయి ఎముకలగూడువలెనున్న మరొక మధ్య వయస్కుడైన కోయమామను ఆదేశించాడు.

ఈయన "బొర్ర" గల వాడెలా అయ్యాడో జగన్నాధంకు అర్థంకాలేదు. బహుశా ఇదీ ఒక పేరు.

"రాం రాం" అని ఇంతలో అంతా తాత నాయకత్వాన ధ్వనిస్తూ యిచ్చిన వేడికోలు శిక్షణగా తోచింది జగన్నాథంకు. ఇది తన దళాన్ని మించిన శిక్షణగావుంది.

ఒక విధంగా దానికి ఈ 80 ఏండ్ల ఈ పండు ముదుసలి ఇప్పటికీ ఈ గూడెమునకు నాయకుడు కాబోలు! పాపం తల్లడిల్లిపోయాడు తన మనుమరాలు వెంకటమ్మ గురించి.

ఏమిటా వెంకటమ్మ సాహసం! చిత్రంగా వుందే! యెక్కడిదీ పోరాటపరీక్ష. నిల్చిపోరాడి తన మానాన్ని రక్షించుకొన్న నీతిమంతురాలు బయటగ్రామాల్లో సహితం అరుదు ఇలాంటి ఉదాహరణలు అంటూ దారిలో తలపోస్తూ జగన్నాథం దళంతో యుక్తంగా ఒక వాగు ఒడ్డుకు చేరారు. దారిచూపుతూ వున్న కోయమామ ఆ సమీపంలో ఎదటి పొదలవైపు వేలెత్తి చూపుతూ "ఆ పొదల నడుమ ఉండిరి- ఈ వాగులో నీళ్ళు" అని తిరుగుముఖం పడుతూ ఒక క్షణం ఆగాడు. సెలవుకు అనుమతికోరుతున్న భావం వెల్లడిస్తూ.

"మంచిది మామా! జాగ్రత్త! ఎక్కడా మనజాడ పొక్కకూడదు సుమా!".

అలా ఎన్నటికీ జరగదన్నట్లుగా నిబ్బరంగా తలవూపుతూ వెళ్ళిపోయాడు ఆ కోయ బొర్రదొర.

* * * *

భయంకరమైన పిడుగులతుపానునుండి బయటపడినట్లుగావుంది వెంకటమ్మకు. నిజానికి తన యిన్ని సంవత్సరాల జీవితంలోతనచేయి ముట్టిన దుష్టుడు ఎవడూలేడు. తను స్త్రీయైనా పురుషునివలె స్వేచ్ఛగా తిరిగింది. తనకు వివాహం ఎప్పుడు జరిగింది? ఎలా జరిగింది? ఒక వింతకథగానే వుండిపోయింది. ఆ కథను తన తాత అడపాదడపా వినిపించుతూ వుంటాడు.

"యెర్రోడు పట్నంబోయి జాడలేడు. వున్నాడో, ఏ మరబండికన్నా గుద్దుకొని చచ్చిండో" అని తనవైపు చూస్తూ కళ్ళనీళ్లు తుడుచుకుంటూ తనను చేసుకున్న వాని గురించి ఒకసారి తాత అనగా వెంకటమ్మ విన్నది.

"మొండిచెట్టువలె ఎందుకుంటావే వెంకట! మరొకన్ని మనువు చూచుకోరాదూ" అని తరచుగా తనను ఎత్తిపొడుస్తూవుంటుంది తన చిన్నవ్వ చుక్కమ్మ.

ఇవ్వన్నీ తనకు పట్టని వింతముచ్చట్లుగా వుంటున్నాయి. ఐతే తాను ఒకనికి ముడిపడి వుందన్నమాట! వాడు రాకపోతాడాఅనే తన మది హెచ్చరిస్తోంది. కాని తన ఇరుగు పొరుగులు- చివరకు తన తాత సహితం ఏనాడో యిట్టి ఆశవదులుకున్నాడు. నిజానికి తన చిన్నయ్య బొర్రమామ కూతురు గతియింతే జరిగింది కదా!

"గాడ్డి కొడుకులు, ఆకు,అలం తిని వుండలేక ఇల్లు, సంసారం వదలి పారిపోతారు" అనే గూడెం పెద్దలనోటినుండి తరచుగా వెలువడే విసురు వెంకటమ్మ మదిలో మెదిలింది. ఇంతకూ తన చిన్నవ్వ కూతురు నాగివలె తానూ మనువు యెందుకు పోకూడదు? అనే ఆలోచన ఒకటి, రెండుసార్లు మెరుపువలె తలలో మెరిసింది. కానీ ఎందుకో తన మనస్సు అందుకు ఇచ్చగించటం లేదు. తన స్వేచ్ఛకు ఏమి లోటు వచ్చిందని? ఉన్న తైర జావ త్రాగుతూ గడ్డబొద్ది ఆకుకోసం అడవిని గాలించి

కేటాయించడంలో తాను తనతోటి అమ్మలక్కలకు, ఆ మాటకొస్తే ఏ మగానికీ తీసిపోదు. ఈ మహారణ్యంలో జీవితంలో పలుసార్లు ఒంటరిగా గడ్డలకోసం గంటల తరబడి గాలించుతుండగా గాండ్రించుతూ సమీపించిన మృగాలు సహితం తన భీకర చూపులకు కదలి ప్రక్కకు తప్పుకున్నాయి. తునికి చెట్టుపైన ఆకలితొద్దీ తనతోపాటు పండ్లు మెక్కుతున్న తన బావ ఒంటరిగా వున్న తనపై సాహసించి దురాశ వెల్లడించాడు. ఒకనాడు "అరేకొండముచ్చు! గూడెలో బెట్టి మెదగొట్టిస్త ఏమనుకున్నావో? ఛీ!" అని తన నోటిలో వున్న తునికి పండు అతని మొగాన అదేపళంగా కొట్టి ఆ క్షణమే క్రిందకు దుమికింది. నిజానికి ఇట్టి మహారణ్య కీకారణ్యంలో తన తనువుని మింగ సాహసించిన మృగాలు లేవు. తన మాన మపహరించ సాహసించిన మగాడు లేడు. కానీ తనకు బొత్తిగా తెలియని ప్రళయము తాను జీవితములో ఊహించని భీభత్సము పరుగులిడి తన గూడెంపై విరుచుకుపడింది. అంతేకాదు. తన గుడిసెలో ప్రవేశించి తనను చెరచడానికి తలపెట్టిన ఈ దుర్మార్గులు తలపుకు రాగానే తన గుండెలు అదురుతున్నాయి. నిజానికి అట్టి ఆపదనుండి తమ్ము కాపాడిన ఆ దేవుడు ఎవరో? ఎందుకు వచ్చినట్లు తన గూడానికి? వాళ్ళు బయటదేశం మనుషులే కదా? తనపై వాళ్ళకు యింత మమత యేమిటి?

"ఈ బయట మనుషులను నమ్మకూడదు" అని తన గూడెం జనవాక్యం. ఎవరు వచ్చినా రెండుమూడు తెల్లపైసలు, జానెడు, మూరెడు గుడ్డా మొఖాన పారవేసి తేనె, పండ్లు, కర్ర,కాయ అపహరించుకు పోతారు. గాలిలో కలసిపోయే నాలుగు తియ్యటి మాటలు చెప్పి బెల్లాన్ని మించిన తేనె కొల్లకొట్టేసి నిత్యమూ నాలుకను తీపి చేసుకొంటారు. కానీ ఈ దళం మనుషులో చిత్రంగా వున్నారు. గుడిసెలోకి దూరిన వారి నాయకుడు పారిపోయిన పోలీసుకు మించిన భయంకరాకారుడుగా వున్నాడు. కాని ఆయనది వింత మనస్సు! పోలీసు మృగాన్ని తరిమివేసి తనను కాపాడిన ఆ దేముడికి ఎలాంటి దుర్బుద్ధీ లేదు. ఆ దేముడే ఆదుకోకుంటే మగాళ్ళను మించిన మొనగాడిగా తిరిగిన తన వరస ఏమయ్యేది? "వీళ్ళు మనోళ్ళే వెంకటీ!" అని తనకు వీళ్ళను పరిచయం చేశాడు తన తాత. "చూద్దాము! ఈ కొత్తమామల చిత్రం" భావించుతూ వెంకటమ్మ ఒక దీర్ఘ నిట్టూర్పు విడిచింది.

• • •

ఎటుచూచినా, మహారణ్యం సూర్యరశ్మి దూరదు. దయతో చల్లనినీడను యిస్తున్న ఆ మహావృక్షాలు చూడ భయంకరంగావున్నాయి. ఆ మహావనంలో ఏ చెట్టు పేరేమిటో తెలిసిన మానవుడున్నాడా అని! మానవ సంచారము కనబడదు. అడపా దడపా పిట్టధ్వనులు, సన్నని వింతకేకలు, చెట్టు చెట్టు రాచుకున్న కిర్రుధ్వనులు, గంభీరమైన పులిమహారాజు చరాయింపులు అప్పుడప్పుడునిశబ్దంలో నిద్రిస్తున్నాయి. అడవిని అల్లకల్లోలం చేస్తున్నాయి.

అది రెండు మహాపర్వతాల మధ్య ఒకలోయ. ఆ పర్వతాలకు ఆరంభమేదో ఆసాంతమేదో గుర్తు దొరకదు. సన్నని సెలయేరు. దాని పుట్టుక ఎక్కడి నుండియో! పైనుండి చరచరాదిగివచ్చి ఒక చదునుప్రదేశంలో ఒకఘడియ విశ్రాంతి కోసమా అన్నట్లు నిల్చి నిటారుగా కొద్దిదూరం ముందుకుసాగుతోంది. అక్కడ నుండి తిరిగి లోతైనసారంగంలోకి మధురసంగీత ధ్వనులతో సాగిపోతున్న ఆసెలయేరుప్రక్కనే వున్న ఆ చదునుప్రదేశంలో కూర్చొని రెప్పవాల్చకుండా గమనిస్తూ ఏదో దీర్ఘాలోచనలో సాగిపోతున్నాడు జగన్నాధం.

నిజానికి ఏమిటా మహారణ్యం! మైదానాల్లో అడుగడుగునా తమను చక్ర బంధంలో ఇరికించిన ఆ కాంగ్రెసు మిలటరీ బందిపోటు సైన్యం ఇక్కడ కనీసం తమ ఆచూకైనా అరాతియ్యగలదా? ఒకవేళ కనుగొన్నా తమను ఆకస్మికంగా ముట్టడించడం ఈ లోయలో ఆ పరమ దుర్మార్గులకు సాధ్యమా? అక్కడ అడుగు భూమిని వదలకుండా అదుపులో పెట్టుకున్న ఆ వేల సైన్యానికి ఇక్కడ దీని అంచుకు చేరడము కూడా శక్తిని మించిన పనికాదా! అందుకే కాబోలు, వేల సైన్యంతమపై విరుచుకుబడి తమ నాయకులను వేటాడుతుండగా యెల్లండి నాల్గు రోజులు ఎక్కడైనా అడవిలో తలదాచుకోండి' అని ఆ మహాజనం అడుగడుగునా తమ హృదయవేదన వెల్లడించారు. ఇట్టి భీకరమైన సహజ దుర్గమారణ్యములు తమను కనిపెంచిన మహాజనానికి ఏనాడో చిరపరిచయమన్నమాట కాని ఆ జనం మహోన్నత ఆశయాలకు వాటి సాధనలో సమరవాదులైన తమకు ఈ మహారణ్యాలు ఆశ్రయాలుగా మారగలవనేది ఇప్పటికీ తమ ఊహకే అందని సత్యంగా వుండిపోయింది.

"చిత్రమైన మనుషులు ఆ కోయోళ్ళు! ఆకు అలం మీదనే వాళ్ళబతుకైనా - అంతులేని మర్యాదున్న మనుష్యులు వాళ్ళు" అని తన తాత తనతో కాలక్షేపానికి కథలు చెప్పుచుండేవాడు.

నాడు ఎల్లెడల మేత కరువై అంబా అని అరుస్తూఉన్న పశువుల మందలను ఈ కారడవికి తరలించుకొనివచ్చాడు తన తాత. నేడో! భూమి, భుక్తి కావాలన్న ఆ మహాజనం ముందునిల్చిన తాము అడవి మనుషులని పిలువబడే ఈ అమాయక జనం అండజేరాల్సివచ్చింది. నిజానికి వీళ్ళు అమాయక జనమేనేమో! ఏ తెల్ల గుడ్డలవాడు వచ్చినా వాళ్ళను నిలువునా దోచుకుంటాడు. వాడు చెప్పిందల్లా నమ్మి ఆరు గాలం కష్టించి అరగజం పాతగుడ్డతో తృప్తిచెందుతారు. వేలు,లక్షలు సృష్టించే కర్రను అమాంతంగా అడవిలోంచి పెకలించి నాగరిక ప్రపంచానికి అందించే ఆ మహాజనం ఆశపడేది అణాబేడల కోసమే. అణాబేడల వడ్డీలతో నాములతో సాగే నిలువు దోపిడీని మనదేశంలో చవి చూచాడు జగన్నాధం. నిజానికి అట్టి దోపిడీని సహించ లేకనే ఆయుధాలు అందుకున్నారు మహాజనం. కాని అంతుచిక్కని యీ నిలువు దోపిడీని ఈ అమాయకజనం ఎలా సహించుతున్నారో! ఇంత విచిత్ర సరుకుకు వేయి రెట్లు మించిన విలువను చేకూర్చే ఈ జనం ఆకు, అలం, గడ్డలసారం పీల్చి దినాలు

వెళ్ళిపోతున్నారు. బయటిదేశం జోలి లేకుండా తన మానాన తాముపోయే ఈ జనంపై సహితం అధికార ముష్కరుల నిత్య దాడి తప్పడంలేదు. తల దాచుకొనుటకు, చలి భరించలేక నెగడు పెట్టుకొనుటకు పడిపోయిన నాలుగు పనికిరాని కర్రమొద్దులు వాడుకున్నందుకు కొమ్మలు రెమ్మలు విరిచి అడవి చట్టాన్ని ఉల్లంఘించారని అధికార్లు, ఆకలికి తాళలేక దొరికిన పండ్లు, ఆకులు, అలం అందుకున్నందుకు తమ లాభసాటి వ్యాపారాన్ని దెబ్బగొట్టారని చౌకీదార్లు, కంట్రాక్టరు వాళ్ళ పాలక ముష్కరులుగా గొంతుపై త్రిష్టవేసి ఊపిరి ఆడనివ్వరు. నిజానికి అడవిలో అనాదిగా కాపురం వుంటున్న మృగాలు తమతో ఈ ఆటవిక మిత్రులతో శాంతియుత సహజీవనంనెరుపుతున్నాయి. నేడు నిజజీవితంలో నిత్యదోపిడి హింసలతో ఈ ఆదివాసుని రక్తం పీల్చుతున్నది ఈ నాగరిక మానవులుగా వస్తున్న మృగాలేనేమో !

"బ్రతుకుతెరువుకోసం" అశేష జనం అఘోరించటం స్వీయానుభవంలో చూశాడు జగన్నాథం. కానీ ఈ అడవి మనుషుల హరిఘోష." బ్రతుకుతెరువు కోసంకాదు. నాలుగు రోజులు ప్రాణాలతో బ్రతకడంకోసం మాత్రమే. కేవలం ప్రాణం నిలుపుకొనుటకు ఈ పాడుపొట్టలో ఆకులలం, గడ్డిగాదం వేయాలి. అందుకోసం మైళ్ళకొలది మహారణ్యాలు గలవు. త్రవ్వగా త్రవ్వగా అందని లోతున దొరికే గడ్డ అయిదుసార్లు ఉడికితేనేకాని ఆహారంగా మారదు. ఆకలికొలది అందుకొని భుజించే ఈ ఆహారం పుణ్యమే కాబోలు నల్లగా రొమ్ము ఎండుకపోయి, ఎముకల గూడులా వున్నారు. లోతుకు నెట్టుకుపోయివున్న వారికళ్లు కనిపెట్టని మరుగులేదు ఈ మహారణ్యంలో అంటూ తన కళ్ళముందు విధి విరామం లేకుండా సాగిపోతున్న సెలయేరు ధారకు జోడుధారగా నడచిపోతున్నాయి ఈ ఆలోచనలు జగన్నాథం మెదడులో.

"కామ్రేడ్స్! భోజనం సిద్ధం" అనే పిలుపుతో దిగ్గున మేల్కొన్నవాడిలా వెనక్కుతిరిగి చూచిన జగన్నాథం తన దళాన్ని ఒకసారి కలియజూచుకున్నాడు. పదిమందిగా వున్న తన దళంలోని సభ్యులు తలొకపనిలో నిమగ్నమైయున్నారు. ఒకరుచదువుకొంటున్నారు.మరొకరు ఏదోరాసుకొంటున్నారు. ఇంకొకరు పలకా బలపం తీసుకొని ఓనమాలు దిద్దుకుంటున్నారు. ఇద్దరు వంటపని పూర్తిచేసి టేకు ఆకుల్లో అన్నం వడ్డించుచున్నారు. మరో ఇద్దరు కొంతదూరంలో సెంట్రీ డ్యూటీలో ఉన్నారు· పిలుపురాగానే ఎవరి ఆకుతో వారు భోజనానికి సెలయేరు సమీపంలోకి వచ్చారు.

"ఉడుకబెట్టిన యెండుతునకలు బలేరుచిగా వున్నాయే" అంటూ వూరిస్తూ చప్పరిస్తూ ఒక సభ్యుడు అన్నాడు. యెండుతునకలు భక్షిస్తూ"ఎక్కడవి ఈ తునకలు నాగన్న" జగన్నాథం ప్రశ్నించాడు.

"మొన్న ఈ లోయక్రింద ఉన్న మిడాల సెంటరులో. కోయమామలు ఒక బస్తా తునకలు యిచ్చిండ్రు జగ్గులు. మనకు బియ్యం తక్కువ ఉన్నప్పుడు ఇవి అవసరంగదా !" ఏమి ఆకు ఇది. మన వద్ద వండరేయిటువంటి ఆకును !"

"బొద్ది ఆకు, కోయమామలు వాడేది వగరువగరుగా పచ్చిఆకుల్ని తిన్నట్లుగా రుచికొడుతున్న ఆకుకూరతో ఆ యెండుతునకలు ఒక్కొక్క ముద్ద అన్నంతో భోజనం పూర్తిచేసేసి జగన్నాధం కాపలా డ్యూటికివెళ్ళగా సెలయేరు ధారపై ఆ నల్లటి తలలన్నీ ముసురుకున్నాయి. వారంతా సంతృప్తిగా నీరు త్రాగి త్రేవ్ మంటుండగా ఆనందంతో నవ్వుతున్న గృహస్తునివలె కిలకిలారావడంతో సాగిపోతుందా సెలయేరు.

* * * *

"ఒరే ముసలగొడ్డూ ! గుడారాన్ని లేపుకొని క్యాంపుకు రమ్మంటే రాలేదెందుకు" అంటూ కొరడాతో అడ్డదిడ్డంగా బాదుతున్నాడు. కసాయివాడు వెంకటమ్మ తాతను. రక్తం ముద్దగా ఉన్న ఆ బొమికల గూడు భూమిపై మూలుగుతూదొర్లుతుంది.

"అయ్యో, రామా! నా బిడ్డను చంపేస్తున్నారు రక్కసులు" అంటూ ప్రక్కనే ఉన్న వెదురుకర్రను రెండుచేతులాలేపి గుడిసెకు ఒక మూలన నిండుచూలాలైన తన బిడ్డపై చేయిచేసుకొంటున్న మరొక క్రూరుని తలపై కోయ బులుకమ్మ చేయికొలది బాదింది. కీచుమంటూ ఆ క్రూరుడు వెనక్కుబడగా ఆ నిండుచూలాలు కొనవూపిరితో మూల్గుతుండగా నోటిలో నుంచి చివరి రక్తం బుడగలు వెలువడుతున్నాయి. క్షణంలోనే డొక్కలో గుచ్చుకొన్న బాయిపెట్ పోటుతో ఆ రెండు ముదుసలులన్ బులుకమ్మ అడ్డంబడి గిలగిలా తన్నుకుంటూ కూతురువైపు చివరి చూపులు చూసింది .... "మృ....గాలు" అని ప్రతిజ్ఞాసూచకంగా పళ్ళుబిగించి ఏదో గొణుగుతూ పిడికిలిబిగించి కన్నుమూసింది ఆ ప్రాణము.

"అరే ముసలిగొడ్డు ఏమంటావ్"!పిల్లామేకను సర్దుకొని క్యాంపుకుచేరుతారా లేదా? ఇది మా దొర ఆజ్ఞ" అని అరుస్తూ దాదాపు నిస్సహాయస్థితిలో ఆ బొమికలగూడును బంతివలె యిద్దరు సైనికులు అటూఇటూ తన్నుతూ దొర్లిస్తున్నారు. పోతున్నారు. కాని చివరి మూలుగలు తప్ప వాళ్ళకి దొరికే సమాధానం ఏమీ లేదు. "నిప్పుపెట్టండిరా కొంపకు! దొంగనాకొడుకులు అనుభవిస్తారు." అని ఉరిమాడు ఆ సాయుధ జట్టు కమాండరు. క్షణంలో లేచిన మంటలు వికటాట్టహాసం చేస్తూ దూరంలో కొండశిఖరంపై వుండి చూస్తున్న వెంకటమ్మ చూపులును అందుకొన్నాయి. నాలుకలు గోరుతున్న అక్రూర జ్వాలట

"ఆగుముండా కాల్చివేస్తాం" అంటూ అతివేగంగా తరుముకొస్తున్నారు కసాయి ఉక్కుటోపీ సాయుధులిద్దరు. వెంకటమ్మ, మరో నలుగురు శక్తికొలది అందకుండా పరుగెత్తుతున్నారు. ఆగమని వెనుకనుండి వస్తున్న హెచ్చరికను వాళ్లు ఖాతరు చేయడం లేదు. ప్రాణం పోయినా ఈ కసాయిమూకల చేతుల్లో పడకూడదని ఏనాడో నిశ్చయించుకున్న దీక్షాపరులు వాళ్లు. దారివెంట పరుగిడుతున్న 5 గురిలో ఒకరు "బుర్గమ్మ లకెయ్య, మల్లండర్రా కొండముచ్చులు! ఒగిరిచ్చి ఒగిరిచ్చి ఎనకకు మల్లుదురు" అని కేకవేయగా ఆ క్షణమే అయిదుగురి జట్టు అమాంతంగా ఎడమవైపు

పొదల్లోకి గంతువేసి మాయమయ్యారు. సాయుధులయిన ఈ వీర సైనికులు చెత్త చెత్తగా కాల్చారుగాని అందులోకి అడుగిడ సాహసించలేకపోయారు. చివరకు హతాశులై వాగరించుతూ వెనక్కి మళ్ళి కోయగూడెం చేరి కసికొలదీ అప్పటికి అక్కడ చిక్కిన ముదుసలులపై, స్త్రీలపై సాగిపోతున్న సాయుధ హింసాకాండలో దుమికి విజృంభించారు.

"మీ తాత యికలేడు" అనే చావుకబురు కొత్త వ్యక్తం చేస్తూ ఉన్నాయి, ప్రక్కనున్న తన చిన్నయ్య బొర్రదొరపైబడిపోయిన వెంకటమ్మ బోరున ఏడ్వ సాగింది.

ఓదార్చయత్నించిన బొర్రదొర పొంగిపొర్లుతున్న దుఃఖంతో చిన్నపిల్ల వానివలె వెంకటమ్మను పట్టుకొని బిగ్గరగా ఏడ్వసాగాడు. ఇంతటితో ఇటు కొంపా గోడూ అటు ఆవులను గూడా కోల్పోయిన ఆ నిరాశ్రయుల దుఃఖారావం ఆ కొండశిఖరం ప్రతిధ్వనిలో లీనమై గాలిలో కలిసిపోయింది.

*　　　*　　　*　　　*

కారడవిలో పెనుతుఫాను, జోరువర్షం రెండూ కలిసివచ్చినప్పుడు జాయ్ మని తెరలు తెరలుగా పెకిలివచ్చే శబ్దంవంటి శబ్దంతో అడవి అటూ ఇటూ కదలి పోతుంది కాని వాస్తవానికది వర్షమూకాదు, తుఫానుకాదు కంగారుగా నలువైపుల తమ మిషన్‌గన్ ఆయుధాలతో అంతులేకుండా ఆయుధ మిలట్రీ బందిపోటులు కురి పిస్తున్న గుళ్ళవర్షమది. అదొకవాగు. దానికిరువైపుల కొండశిఖరాలు. వాటిపై కుచ్చుల వలె దట్టమైన పొదలు, తూర్పు వెదురు పాము మెలికలుగా వంకర పోకడలతో సాగి పోయే ఈ వాగులోనీరు అతిస్వల్పం. ఐతే దీని అడుగుతట్టు అన్నివాగుల్లోవలె ఇసుక తిన్నెలతో కప్పివేయబడలేదు. ఎర్రటి చారికల రంగులలోనున్న రాతిచిప్పలు ఆ వాగు అంతటా పరుపువలె పరుండివున్నాయి. ఇలా అడవిలో దూరదూరమునుండి తేరాలుగా ఎత్తయిన శిఖరాలనుండి వర్షధారలకు ఊడిపడుతూ కొట్టుకువచ్చిన రాతిచిప్పల వాలకం చూడ రక్తంత్రాగే రాళ్లగా ఇవి కనబడుతున్నాయి జానెడు,బెత్తెడుమించని వెడల్పుతో పలుక ముక్కలవలెనున్న ఈ రాళ్ళపై రక్షణదొరక్క ఆగమాగ ముగ పొర్లుతున్నారు సాయుధ సైనికులు, ఈ బందిపోటులు ఆ సమీపంలోనేవున్న ఒక కోయగూడెమును తగులబెట్టి దొరికిన కోయజనాన్ని లాగుకొని క్యాంపులోకి వెళ్లుతూ ఈ వాగులో చిక్కిపోయారు. దక్షిణదిశ నుండి ఉత్తర దిశకు కనిపిస్తూ తీరా వాగులోకి ప్రవే శించగానే ఇరువైపుల నుండి అప్పటికి మాటుతో జగన్నాధం నాయకత్వాన కాచుకొని యున్న గెరిల్లాల మెరుపుదాడి ఆరంభమైంది. మొదటి దెబ్బలకే ఇద్దరుగాయపడటంతో కంగారుతో సాయుధ మిలట్రీ జట్టు చెదరగా అప్పటికే సమయంకోసం ఖైదీలుగా కాచుకొనియున్న కోయజనం క్షణంలో గంతువేసి వాగు ఒడ్డున గల ఒక ఇరుకు తోవ గుండా అడవిలో దూరి మాయమయ్యారు. తమ ప్రాణాల రక్షణలోనే సతమతమవు

తున్న ఆ బందిపోటులు పారిపోయే కోయజనంవైపున చూడను కూడా చూడలేక పోయారు.

కటికె రాళ్ళ పరుపుపై రక్షణ దొరక్క సైనికులు ఆశకొలదీ ఉత్తరదిశ ఒడ్డుకు చేరే యత్నంలో ముందుకు అతికష్టంగా ప్రాకుతున్నారు. కాని ఇది సరిగ్గా కనిపెడుతున్న జగన్నాథం కొండపై నుండి వాని మూతిముందే రైఫిల్‌గుండ్ల ధార కురిపిస్తున్నారు. చివరకు ఆ సైనికులకు ఆ వాగులో పడుకొని పొర్లాడుతున్న సన్నటి సొందలు మినహా మరో రక్షణలేదు అదను వదలితె అమాంతం శాల్తీ ఎగరవలసిందే ఆ విధంగా మూడువైపుల నుండి జగన్నాథం దళం దాడి చేస్తూ గంటల తరబడి ఆ సాయుధమిల్ట్రీని చక్రబంధంలో నిలవేసింది ఇంతలో అనుకోకుండా ఆ బందిపోట్లకు అదనపు సాయుధబలం ఒక వ్యాన్‌నిండా ఆ దారిలో రానేవచ్చింది.వచ్చే రాకలోమధ్య వాగులోకివచ్చి ఆగింది. దారికి నలువైపులాగల కవచాన్నిఆసరాచేసుకొని అందులోంచి నలువైపుల గుండ్లవర్షంకురిపించుతూ గెరిల్లాలపొదల్లోకిరైఫిల్, గ్రెనేడ్‌లుపేల్చుతూ వుండగా వాగులో అంతకుక్రితమే పొర్లుతూవున్న సైనికులు ఎలాగో వ్యాన్‌లోకి బ్రతుకు జీవుడా అంటు ఆదరాబాదరాగా ప్రాకారు .ఆ సమయంలో కనిపెట్టి పేలుస్తున్న దళం దెబ్బలకు ఇద్దరు చనిపోయి పడిపోడం, మరికొందరు గాయపడగా శవాలను వారి ఆయుధాలతో కూడ వదిలి అందిన వారిని యెక్కించుకొని లబోదిబో అని పరుగు లంచుకుంది ఆ వ్యాన్. వాగులోపడి వజ్రాలవలె మెరుస్తున్న ఆ ఆయుధాల నందుకుని దళంతో యుక్తంగా తన కేంద్రానికి జగన్నాథం విజయానందంతో చేరుకోగా అక్కడ విస్మయదృశ్యం ఎదురైంది. వెంకటమ్మతో సహా అక్కడికేతెంచిన పాతికమందికోయ జనం తమ భుజాలపై సామానుతో యుక్తంగా ప్రత్యక్షం అయ్యారు. మౌనముద్ర వారి ముఖాల్లో తాండవిస్తోంది.

"ఏం వెంకటక్కా ! ఏం జరిగింది ?"అని ప్రక్కనవున్న సభ్యుడు అడగగా వెంటనే ఆ దృశ్యంవైపు సైగచేసింది. కనబడుతూనే వుందిగా అన్నట్లుగా వెంకటమ్మ మౌనంగా ముఖంలో అదురు పాటుగాని, నిరాశా నిస్పృహలుగాని కనిపించడంలేదు. పైగా ఏదో దృఢ నిశ్చయానికి వచ్చియున్న గంభీరభావం ఆమె ముఖంలో ద్యోతక మౌతుంది. జగన్నాథం దళసభ్యులు ఆప్తులకు ఆశ్రయం యిస్తున్న గృహస్థుల్లా ఆ కోయజనం భుజాలపైవున్న వారి యావత్తు సంసారభారాన్ని దింపుతున్నారు.

"కని పెంచిన ఈ అడవి తల్లిని వదిలి పులినోట్లోకి ఎట్లబోతముమామ"తమ భుజం కావడి దింపుతూ కథను ఆరంభించాడు.

"మొత్తం కోయగూడెం వున్నపళాన లేచి క్యాంపుల వద్దనే స్థిరనివాసం చెయ్యాలని మిల్ట్రీ అధికారి ఆజ్ఞ. ఇందుకు వున్నకొంపలను అందులో చిక్కిన తన కూతురుతోసహా వదిలేసి తగులబెట్టిన తర్వాత తమకు మార్గమిదేననుకున్నారు ఆ కోయ జనం. వెంకటమ్మ బొర్ర దొరతో సహా మిగిలిన పదికుటుంబాలు పిల్లాజెల్లతోయుక్తంగా, మొత్తం గూడెమే వారి భుజాలపై ప్రత్యక్షమైంది. తరాలుగా పాదుకొనియున్న

కొండలను అమాంతంగా లేప్పుకొని రావడం ఇలా అవలీలగా యీ అడవి జనం చేయ గల్గిన పనియని జగన్నాథం ఊహించలేకపోయాడు.

'మీతోపాటుమేము' అంటూ బొర్ర జగన్నాథంవైపు చూసి అక్కడ అవరించియున్న విషాదభావాన్ని తేలగొడుతూ వింతనవ్వు నవ్వాడు. అవును ఇది నిజమని భావిస్తున్న జగన్నాథం మదిలో పూర్వ సందేశమొకటి మెరిసింది. యావత్తు ప్రజలు గెరిల్లా జీవితం అలవర్చుకోవాలనే సందేశం తాను పూర్వం బయటదేశంలో తరచుగా విన్నాడు. దాని నిజ స్వరూపం ఇక్కడ సాక్షాత్తుగా జగన్నాథం కళ్ళముందు నిల్చింది.

◆ ◆ ◆ ◆

మహాయాత్ర సాగిపోతుంది. ఎక్కడా అంతుకనపడదు ఈ యాత్ర నడుస్తున్నకొలది ఆకాశాన్ని అందుకొనుటకా? అన్నట్లు దారిపై పైకి వెళుతుంది అయితే అది నిల్వెత్తుగా నున్న కొండ ఎక్కినట్లుగా లేదు. పోతున్నకొలది ఆకాశాభిముఖంగా మట్టిదిబ్బపై సాగిపోతున్న యాత్రగా నున్నది. ఆట్టి మట్టిదిబ్బపై ఎటుజూచినా బ్రహ్మాండమైన కీకారణ్యం. రెండు భుజాలపై రెండు పెద్దమూటల బియ్యం వేసుకొని ముందు నడుస్తోన్న వెంకటమ్మ అవలీలగా అంగలు వేసుకొంటూ ముందుకు సాగిపోతుంది. చివరకు సూర్యుడు శిఖరంచాటుకు మటుమాయమవుతుండగా అట్టి ఒకానొక శిఖరంపైగల కోనేరువద్దకు చేరుకున్నారు. "ఇక్కడ నాల్గురోజులుండవచ్చు. రావే ఇక్కడికి" అంటూ ఆ సరస్సుకు ఒక ప్రక్కకు గల చదును ప్రదేశంపై పొదల మధ్య బరువులు దింపింది వెంకటమ్మ. జగన్నాథంతో సహా ఈ మహాయాత్రలో ఈమెను అనుసరిస్తూ వచ్చిన గెరిల్లా దళసభ్యులంతా ఒక్కొక్కరిగా చేరి తమ బరువులు దింపారు. అంతా సొమ్మసిల్లి కూలబడిపోయారు. ఇంతవరకు పురుషునివలె నెత్తికి రుమాలు చుట్టియున్న వెంకటమ్మ బరువుదింపి కూలబడకుండా అలాగేనిల్చి రుమాలు తీసి చిక్కుపడి ముడిపడియున్న వెంట్రుకలను దులుపుతూ సాగుతున్న మెడ నరాలను విదిలించడానికి అన్నట్లు తల రెండుతడవలు అటుయిటుగ విసిరి యెర్రగా కందియున్నతన భుజాలను చూసుకుంటూవుంది – సభ్యులంతా అక్కడి పొదల్లో యెటు ఒదిగేవారు అటు వొరిగి అలసట తీసుకుంటూ వుండగా ప్రదేశాన్ని వెతికించుటకు సమీపించుతున్న జగన్నాథంతో "ఇదంతా నే నెరిగిన దేశమే మామా. ఇది మనకు మంచి రక్షణ స్థలంగదా" అని నిటారుగా నిలుచున్న వెంకటమ్మ పలికింది. ప్రదేశాన్ని పరిచయంచేస్తూ ఆ ప్రదేశ పరిశీలనకు మరింత కుతూహలాన్ని వెల్లడిస్తోన్న జగన్నాథంను పది అడుగులు సరస్సునుండి ఎడమ వైపుకు తీసుకువెళ్ళి చూపింది. అక్కడ జోడుగా రెండు పర్వతాలు కొంతదూరం సాగిపోయాయి మధ్య యిరుకైన లోయ. యిటురెండోవైపు తాము విడిదిచేసిన ప్రదేశం నుండి ఆపర్వతాలపైకి నడవడానికి రెండువైపులా దారులున్నాయి.

"బ్రహ్మతరం కాదు మనల్ని చేరుకోవడం" అని మురిశాడు ఇవి అన్నీ గమనిస్తున్న జగన్నాధం.

ఇంతలో ఆయుధాలతో సన్నద్ధమవుతూ అయోమయ చూపులతో బెదిరి రెండడుగులు వెనక్కి వేసిన జగన్నాధంవైపు చూచి పక పక నవ్వుతూ 'అయ్యో మామ, పులిగాదు ఎనుము మీ దేశంలో చూడలేదా' అని వెంకటమ్మ అనగా బిడియ పడిన జగన్నాధం 'ఎనుప దున్నా! ఏనుగును మించిందే!! అంటూ సర్దుకున్నాడు.

ఆ తర్వాత ఇద్దరు మొదటి ప్రదేశానికి చేరి వంటలు చేసుకొని నడచి వచ్చి అలసిసొలసియున్న ప్రాణాలు కాబట్టి భోజనాలు అయినదే తడవుగా కొంచరు పడు కొన్నారు. వెంకటమ్మ కాపలా డ్యూటీనందుకొని అక్కడే ఎత్తుపై ఆ సరస్సుకు అభి ముఖంగా వున్న రాతిపై కూర్చున్నది. చుట్టూ నిలువుగోడలవలెనున్న ఆ మహారణ్యం మధ్య నీలిరంగుతో మెరుస్తున్న ఆ సరస్సు నీటిని తదేక దీక్షతో పరిశీలిస్తుంది వెంకటమ్మ. అప్పుడప్పుడు అందులో మెదిలే మొసళ్ళ అలజడికి కదిలే నీటి తడులకు ప్రతిబింబముగా వెంకటమ్మ మదిలో అనేక ఆలోచనలు మెదలుతున్నాయి.

ఇంతకూ ఒక అడవిమనిషి జాతి తనది తన తాత ముత్తాతలంతా అడవిజాతి రకం బయలుదేశం మనుషుల సావాసం తన జాతికెన్నడూ లేదు అడవిలోలంటకుండా ముట్టకుండా దొరల జాతిగా ఆకు, అలము తిని గడుపుతున్న జాతికి ఎందుక వచ్చినట్లు పోరాటం?

కమ్యూనిస్టు దళాలు వస్తే తను ఆచారంప్రకారం వారికి అతిథిమర్యాదచేస్తే పాపమా? అన్నట్లు ఆ మిలటరీ ఈ దుర్మార్గ దాడిని ఆరంభించింది

అవును ఎందుక ఆరంభించదు? నిత్యము తమను పీల్చుకుతినే చౌకీదార్ల యజమానుల పేటుకు ముప్పు వచ్చింది. కనుక వారంతా సమ్మక్కైయి వస్తున్నారు. ఇంతటితో ఆగక తాము తరాలుగా తల దాచుకుంటున్న కొంపల్లో తమను వుండనివ్వ రట! అమాంతంగా లేచి వారి క్యాంపుల్లో వుండాలట! పులినోట్లో యెవరు కాపురం జేస్తారురా?" అనేది తన గూడెం జనవాక్యం గనుక తాము జగన్నాధం అడుగు జాడల్లోనే.

ఎవరీ జగన్నాధం? జీవితంలో తన మానానికే ప్రమాదం సంభవించిననాడు సమయానికి ఆదుకొన్న ఈ జగన్నాధం తన జీవితాన్నే మార్చివేస్తున్నాడు. లేకుంటే చూడగానే నఖశిఖ పర్యంతం అనుమానింపబడే ఈ నాగరిక రాజ్యం మనుష్యులతో తమకింత సావాసం ఏమిటి? ఏదో ప్రజారాజ్యమట! నేటి దొంగలు, దోపిడీదార్లూ పోవాలి! ఈ అడవులు, భూములు కాయకష్టంచేసే పామరులవట అంటూ అనేకంగా వినిపించబడిన వీరి బోధలను తొలుత వినిపించుకోని తన తాత తిరిగి వాటినినమ్మమని తన గూడాన్ని ఆదేశించాడు. ఇంకేముంది? చిన్ననాటి నుండి తన తాత చెప్పిన ఏ పురాణగాథల్లో కూడా వినని కనని తను అనుకోని దృశ్యాలు అన్నీ కళ్ళముందు సాగి పోతున్నాయి. తన గూడెంలో తన చిన్నయ్య కొడుకు నేడు దళ నాయకుడు. తన చిన్నయ్య ఒక కొరియరు. తన గూడెంలాంటి అనేకం ఇదేవరుసలో చివరకు అడవిలో ఆడదైనా తాను జగన్నాధం దళంలో సభ్యురాలు కాబోతుంది. ఇప్పుడీ కొరియరుకు

నిత్యము సాగే దళ శిక్షణలో ఆడపాడడపా తాను పాల్గొంటూనే వుంది యీ జీవితమే నిత్యనూతనం కాగా జగన్నాథంతో సాహసం మరింత వింతగా వుంది. ఇంతలో గంభీరమైన చరాయింపులలో నిద్రిస్తున్న ఆ నీలిరంగు సరస్సు దిగ్గున అదిరి పడిలేచిందా అన్నట్లుగా ప్రతిధ్వనించింది. అటువైపు నుండి కరెంటుబుడ్లవలె మెరుస్తున్న రెండుకళ్లు. ఆవలిపొద్దును కనిపెట్టిన వెంకటమ్మ వెంటనే తమాయించుకొని కూర్చొని చూస్తుండగా దిగ్గునలేచిన జగన్నాథం ఆయుధ సన్నద్ధుడుకాగా వెంకటమ్మ వెనుకనుండి ఆమె తలకు కుడిపార్శ్వంగా ఆమె భుజంపైనుండి ఆయుధం ఎక్కుపెటుతున్న అలికిడి జరిగినవైపును నిశితంగా పరిశీలించుచున్నాడు. ఏమిటి? ఎక్కడ? అన్నట్లుగా ప్రశ్నించుచున్న జగన్నాథం కళ్లు వెంకటమ్మ కళ్ళను మరింత సమీపించి ప్రశ్నించాయి. చివరకు ఇద్దరి శ్వాస నిశ్వాసలు సహితం సంఘర్షణపడడంతో క్షణంపాటుచెదరని ఆ ఉభయుల చూపులు పరస్పరం కలవరపాటుతోనే కల్సుకొని ఒకచిన్న చిరునవ్వు నవ్వాయి—"ఏమీలేదు మామ! పులిరాజు వచ్చింది, నీళ్లు త్రాగిపోతుంది" అన్నది వెంకటమ్మ తనకుతాను సర్దుకుంటూ "ఇక నువ్వు పడుకో. నేను వుంటాను కావలా" అంటూ జగన్నాథం ప్రక్కకు తిరిగి కూర్చున్నాడు. ఆ ప్రక్కనే చెట్లక్రింద పరుపువలె పర్చబడివున్న ఆకులపై వొరిగింది వెంకటమ్మ. కలవరంతో ఆమె రెండుచూపులు కలుసుకొన్నక్రితం ఆ దృశ్యం వెంకటమ్మ హృదయంలో మెదులుతోంది. ఐనా కలవరపడటం యెందుకు?

"బందిపోటు దొంగలు కనుపించినా ఆడది కనుమరుగైతే రక్షణివ్వరు!" అనేమాటలు ఈ బయలురాజ్యం మనుషుల గురించి అనేకసార్లు తన గూడెం పెద్దలు అనుకోగావిన్నది. కానీ ఈ జగన్నాథం పాత్ర అందుకు భిన్నంగావున్నది. నిజానికి అడుగడుగునా తన పరీక్షకు గురౌతున్న జగన్నాథం తనజాతి అనుమానాలనే తుత్తునియలుచేస్తూ దళముతోసహా తమజాతిలోనే లీనమైపోతున్నాడు అంతేకాదు; ఊరూ, పేరు తెలియని ఈ పోరాటరంగంలో తనజాతినే దింపాడు తన చిన్నవ్వకొడుకు ఒక దళం కమాండరయ్యాడు. తన వననాగమ్మ కొరియరట. ఏ గూడెంలో చూచినా దళ సభ్యులెవరో? కానిదెవరో తెలియకుండావుంది. తాను నిత్యమూ దళశిక్షణలో పాల్గొంటుంది. ఏదో కొరియరు కొరియరట!

కొరియరు వెనకే యెందుకు వీరి మతమయ్యి వుండాలి తాను? తనకు అటు వొక విద్య ఇటు గెరిల్లా విద్య నేర్పుచున్నాడు జగన్నాథం. తాను తల్చుకొంటే ఈ దళంలో గెరిల్లా సభ్యురాలు ఎందుకు కాకూడదు? ఆ మాటకొస్తే ఒక దళాన్నే తాను తన గూడెంలో నిర్మించకూడదూ! యెంత మార్పు తనలో! యింతకూ దీనంతకూ మూలకారకుడు జగన్నాథం. ఆ రోజు కారోజు తనకు మరింత సన్నిహితుడౌతున్నాడు. వూరూ, పేరూ, జాతీ తెలవని, కలవని ఈ జగన్నాథానికి తనకు ఏమిటీ సహవాసం? అని ఆలోచిస్తూ వెల్లకిల పరుండి ఆకుల్లో నుండి ఆకాశాన్ని చూస్తున్న వెంకటమ్మ కళ్ళలో ఆకుల మధ్య నుండి రెండు జంట తారలు తళతళమెరుస్తూ చిరునవ్వునవ్వాయి. ఈ చిరునవ్వు వెంకటమ్మ హృదయంలో ఏదో వింత అనుభూతిని వెలుగిస్తోండగా అప్పటికే నిద్రాభిముఖురాలై యున్న వెంకటమ్మకు కునుకుపట్టింది.

* * * *

పెద్ద ప్రేలుడు శబ్దం. జోడుగా ఉన్న ఆ రెండు మహాపర్వతాలు రంజిల్లుతూ కదలిపోయాయి. విపరీతమైన ధ్వని, ప్రతిధ్వనులు నిశ్శబ్దముగా నిలచిఉన్న ఆ మహారణ్యం అంతటా విస్తరించాయి.

దాదాపు ఉయిదు గజాలు అందుబాటులోకి సమీపించిన నల్లటి ఘాతాలతో నిండిఉన్న ట్రక్కులోకి గ్రెనేడు విసిరిన వెంకటమ్మ ఆ రాతిగుండెమీద నుండి అలాగే వెనుకవైపు విసురుగా పొర్లి ఆ ఎత్తు మామూలు పర్వతంపై బోర్లపడి స్పృహతప్పిన దానిలా పర్వత సానువుపైగల మట్టిని కర్చుకొని పడిపోయింది. ట్రక్కులో కుయ్యో మొర్రోమని ఏడుపులు. ఏమి జరిగిందీ అర్థంకాని డ్రైవరు హఠాత్తుగా క్రిందికిదుమికి ప్రక్కన ఉన్న చెట్ల మొదటలో నక్కాడు. ఆయుధాలతో చెల్లాచెదురుగా దుముకు టున్న వారిపై రెండవవైపునుండి తుపాకీ గుండ్లవర్షం. ఆ వెంటనే ముగ్గురు సైనికుల చివరి మూల్గులు. తక్కిన వాళ్ళు చదునుగావున్న ఆ రాళ్ళ ప్రదేశంపై పెంజర్లవలె పొర్లుచూ కంగారుపడుతూ కాల్చనారంభించారు.

ఇది రెండు మట్టిదిబ్బలవలె మామూలు మెత్తులోనున్న రెండుపర్వతాలమధ్య నుండి నడిచేదారిలో మంచి మూలమలుపున జరిగిన మెరుపుదాడి. ఆ మూలమలుపు ప్రదేశంలో అడుగడుగునా రక్షణ దొరకని ఆ సైనికులు పొర్లుతూ పొర్లుతూ తిరిగి ట్రక్కుకడకే చేరుకున్నారు. ఇంతలో డ్రయివరు తిరిగి ట్రక్కులోకిదూకి ట్రక్కును స్టార్టుచేసి కదిలించగానే బ్రతికామురా బాబు అనే కుశాలుతో ఆ సైనికులంతా దబదబా దుముకుగా గుండ్లవర్షం మధ్యలోనుంచి ఆర్రి బ్రతుకుజీవుడా అని పారిపోయింది. ఈ రణగొణధ్వని నేలనుకర్చుకుని ఏదో కలగంటున్న వెంకటమ్మను ఏమీ కదలించలేక పోయింది. శత్రువుపై తొలిదెబ్బతీసి తనజీవితంలోనే నూతనఘట్టంలో ప్రవేశించామని తనివితీరా తృప్తిచెందుతున్న వెంకటమ్మ అందుకు అవకాశమిచ్చిన ఆ గడ్డ మట్టిని పెదాలతోతాకి ముద్దుపెట్టుకున్నది.

"వెంకటమ్మ ఎక్కడ?" అనే జగన్నాథం పిలుపు ఎక్కడో బావి లోతుల్లో నుంచి వచ్చిన ధ్వనివలె రాగా దిగ్గున చలించి లేచినది. జగన్నాథం మూడు సైనిక శవాల మధ్య ఆయుధాల కట్టతో వీరునిలా మెరుస్తున్నాడు. ఆ వెంటనే తాను నిలబడియున్న ఆ మెత్తుమట్టి దిబ్బ అంచునుండి వెంకటమ్మ ఆవశంగానే దుమకగా కంగారుపడిన జగన్నాథం ఆమె పడిపోకుండా రెక్కలు అందుకుని నిలబెట్టాడు. కదనరంగంలో చెరొకవైపునుండి కలుసుకున్న విజేతలుగా వారు ఒకరినొకరు వీరావేశంతో అభినందించుకొంటూ కౌగిలించుకొన్నారు. సమరరంగంలో సన్నిహితులైన ఆ రెండు హృదయాలు జీవితరంగంలో మరింత పెనవేసుకపోయి మూడు పువ్వులు, ఆరు కాయలుగా వర్థిల్లాయి. చరిత్రలో విప్లవ ఘట్టానికే విశిష్ట చిహ్నంగా వెంకటమ్మ, జగన్నాథం కుటుంబం నేటికీ నిలిచి ఉంది.

- భీమిరెడ్డి నరసింహారెడ్డి.



# కొమరయ్య వీరమరణం

(1946 నుండి 1951 వరకూ తెలంగాణా వీరోచిత విప్లవపోరాటం సాగింది. ఆ మహత్తర పోరాటంలో మొదట ఆహుతైన అమరవీరుడు దొడ్డి కొమరయ్య. 1946 జూలై 4 వ తేదీన జనగాం తాలూకా కడవెండి గ్రామంలో ఆఘటన జరిగింది. జగత్ ప్రసిద్ధికెక్కిన రైతాంగ సాయుధ పోరాటం తెలంగాణా గడ్డపై ప్రజ్వరిల్లడానికి అదే ఆరంభం.)

దొడ్డి కొమరయ్య వీరమరణం ప్రళయమైన తిరుగుబాటుకోసం రంజిల్లిన ఒక సింహగర్జన. అది జానిసత్వాన్ని ధిక్కరించి చెలరేగిన ప్రజావిప్లవ జ్వాల.

నాటి జానిసత్వం తరాలనాటి ఒక పాతకాలపు నిరంకుశ చట్టం. కుటుంబాలకు కుటుంబాలుగా ఈ చట్టంలో బలై, నుసై, మసైన ఘటనలు కోకొల్లలు. యావత్ గ్రామాలు ఈ నిరంకుశత్వం క్రింద నలుగుతున్న రోజులవి. దీనియొక్క ఒకానొక క్రూర స్వరూపమే, వెట్టిచాకిరి. చాకలి, మంగలి, కుమ్మరి, కమ్మరి, హరిజన కుటుంబాలు ఈ చాకిరీ చట్టంలో పదేండ్ల పసిబాలురతో సహా ఇరుక్కొని బలిఅవుతున్న రోజులవి.

జమీందార్ల ప్రయాణాలకు, వీరి మేనా, పల్లకీల బరువుల మోతలకు, వారి ధూప, దీపాల అలంకరణలకు, ప్రక్కలువేసి పాదధూళి నెత్తిన వేసుకొని పరిచర్యలు చేయుటకు అన్నిటినిమించి వివాహ, తదితర పండగాపబ్బాలకు, కార్యాలకు ఈ కుటుంబాలకు కుటుంబాలు నాశనమైన రోజులవి. ఎదురు తిరిగితే చివరకు శవం కూడా నవాబుల గడీల లోపలి శవాల గోతుల్లో మటుమాయమయ్యే రోజులవి. ఇదానాటి విసునూరి రామచంద్రారెడ్డి కడారు సోదరుల, జన్నారెడ్డి, ప్రతాపరెడ్డి, సూకలదేశ ముఖుల రాజ్యంలో సాగిన వెట్టిచాకిరి బానిస వ్యవస్థ. ఇది తరాలుగా నడుస్తూవచ్చిన పాతకాలపు వ్యవస్థ. ఇట్టి వ్యవస్థ అడుగున అణగారిన శ్రమజీవుల ఆగ్రహం, ఆవేశంలోనుండి అప్పుడప్పుడే తిరుగుబాటు అగ్నికణాలు చెదురుమదురుగా ఎగిరిపడు తున్న రోజులవి.

సూర్యాపేట తాలూకా తుంగతుర్తి పోలీసు స్టేషన్‌లో ఒకానొక వింత ఘటన ! పోలీసులకు నిత్యము వంటచెరకు మోస్తున్న ఒకానొకహరిజన అమాయకుడు కట్టెల మోపును అమాంతంగా క్రింద పడవేస్తూ ఒక చీటీ ఆ స్టేషను హెడ్ కాని స్టేబుల్‌కు చూపెట్టాడు. "ఇంతటితో ఈ చాకిరికి స్వస్తి" అనే మాటలు అతని హృదయంనుండి అగ్నికణాల్లా దూసుకు వచ్చాయి. దిగాలుపడి ఆ హెడ్ కానిస్టేబుల్ ఆ చీటి చూడగా "వెట్టి చాకిరీ నశించాలి, బానిసత్వాన్ని ధిక్కరించండి" అనే ఆంధ్ర మహాసభ, కమ్యూనిస్టు పార్టీల పిలుపు అందులో చూశాడు. "నేటినుండి నేనూ ఒక మనిషిని" అనే గంభీర వదనంతో ఆ శ్రమజీవి తిరిగి వెళ్ళిపోతుండగా దిగాలుపడిన హెడ్ కానిస్టేబుల్ అలాగే చూస్తూ వుండిపోయాడు.

ఇక్కడొక వీరవనిత ఈ బానిసత్వాన్ని ఎదిరించి నిలచింది ! ఆమెయే నాటి అలగా జనంలోంచి అమాంతంగా పైకివచ్చిన చాకలి అయిలమ్మ. ఆమెది జనగామ తాలూకా పాలకుర్తి గ్రామం. ప్రక్కనే రెండుమైళ్ళ దూరంలోవున్న కర్కోటకుడు విసునూరి రామచంద్రారెడ్డి రాజ్యాన్ని ఎదిరించి యావత్ గ్రామానికి నాయకురాలుగా నిలచిన వీర నారీమణి. వెట్టి చాకిరీని ఈ కర్కోటకుల ముందే అడుగు త్రొక్కి ప్రతి ఘటనకు ముందు నడుస్తున్న ఒక విముక్తి వాహినికి సేనాని ఈమె. కాశి బిగగట్టి, కర్రందుకొని అర్ధరాత్రి అణగారిన జనాన్ని మేల్కొలిపి తిరుగుబాటుకు పురిగొల్పిన మరొక వీరవనిత చాకలి పీరమ్మ. వెట్టిచాకిరి తరాలుగా తమ వృత్తిగానే మారిపోగా అట్టి బానిస వృత్తిని చీల్చి చెండాడి కోటి జనాన్ని మేల్కొల్పుటకు అహోరాత్రులు కృషిచేస్తున్న ఒక ప్రజా నాయకురాలు. ఇది కరకు భూస్వాములకు వ్యతిరేకంగా జనగాం తాలూకా రామారంలో తలెత్తిన మరొక తిరుగుబాటు జ్వాల.

దావాలనం లాగా వ్యాపించిన ఈ విప్లవజ్వాల 60 ఏండ్ల కొరివిదెయ్యం అనబడే జానకమ్మ దొరసాని ఎస్టేటులంకను సహితం అంటుకున్నది. ఆమె ఎవరో కాదు. స్వయంగా అతి క్రూరుడుగా, పాతకాలపు నిరంకుశుడుగాపేరుమోసిన విసునూరి రామచంద్రారెడ్డి తల్లియే సుమా! జనగాం తాలూకా కడవెండి గ్రామములో

ఈ లంకిణికి ఓ లంకంత ఎస్టేటు కొడుకుచే కేటాయించబడింది. కొడుకు పేరుమీద తల్లి సాగుబాట్లు పట్టపగ్గాలు లేకుండా సాగుతుండగా పొగమంటలు అంటుకొని ఆ పగ్గాలు కాస్త తునాకునకలుగా తెగ నారంభించాయి. అప్పటికే కడవెండి గ్రామంలో శ్రమజీవులు ఈ చాకిరీని బహిష్కరించారు. యావత్తు గ్రామం ఉడికిపోతోంది. అనుకున్నట్టు ఓ మంగలి కుటుంబం తల్లీపిల్లలతో సహా ఆ రోజు దొరసాని దీపాలంకరణకు, పక్కలు, పాదధూళి, పరిచర్యలకు అందలేదు. నిలువెల్ల అమ్మ తల్లితో కొన ఊపిరిలో మూల్గుతున్న పసిపిల్లలను అరచేతుల్లో పెట్టుకున్న తల్లిది ఒక ఘోషకాగా, బ్రతుకు తెరువుకోసం పోయిన భర్త ఇంట్లో లేని ఆ సమయంలో అభాగ్యజీవి ఇంటిపై. ఒంటిపై జానకమ్మ గూండాలు విరుచుకు పడ్డారు. కాని కాలం మారింది. మారుతున్నది. అదే ఆ లంకిణి దొరసాని (జానకమ్మ దొరసాని) అర్థం చేసుకోజాలని విషయం.

ప్రజలు పదిమందీ గుంపు కూడనేకూడారు. ఆ పరమరాక్షసులను నిలవేయనే వేశారు. అందుకు చిందులు తొక్కిన ఆ గూండాలు జనంపైకూడా విరుచుకుపడి చేయి చేసుకోనారంభించారు. ఇంతలో ఆంధ్ర మహాసభ-కమ్యూనిస్టు పార్టీ వలంటీరు దళం అందనే అందింది. గూండాలపై ఎదురుదెబ్బ తీయగా బ్రతుకుజీవుడా అని పారిపోయి దొరసాని గడిలో దూరారు. ఉద్రిక్తులైన ప్రజానీకం వీరుడు దొడ్డి కొమరయ్య అగ్రభాగంలో వుండగా బ్రహ్మాండమైన ప్రదర్శనగా ముందుకు కదిలింది. కాని ఇటువైపు అవమానం భరించజాలని 60 ఏండ్ల కొరివిదయ్యం తన సేనాధిపతులకు సరికొత్త ఆజ్ఞలు జారీ చేసింది. జనానికి ఎదురువచ్చే సాహసం చాలని ఈ బందిపోటు గూండా మూకలు దొరసాని గడీలోనుంచే సాయుధ దాడికి సన్నద్ధమయ్యారు. ఊరేగింపు కోట గడీమూలరాగానే అగ్రగామిభాగంలోఅడుగులేస్తూఅత్యంతఉత్సాహంతోనినాదాలిస్తున్న వీరుడుకొమరయ్య డొక్కలోంచి తుపాకి గుళ్లు దూసుకుపోయాయి. ఆమూలమడతలో నున్నకిటికీలోంచిబందిపోటు దొంగకిరాతకుడుమైనమిస్కీనతి తన షాట్‌గన్‌తోదొంగ చాటుగా కాల్చగా తగిలిన దెబ్బయిది. ఇంకేముంది? వీరుడు దొడ్డి కొమరయ్య నేల కొరిగాడు. అమరవీరుని రక్తంతో అక్కడి నేలంతా తడిసి అరుణారుణమైంది. ఈ సంఘటనతో ప్రజల క్రోధాగ్ని భగ్గుమండింది. ప్రజలు ఆగ్రహావేశాలతో కుత కుత లాడిపోతున్నారు. అలాంటి స్థితిలోనున్న ప్రజలు కోటగడీని చుట్టుముట్టారు. కొరివి దెయ్యంతోసహా హంతకులను, కిరాయి దొంగలను దిగ్బంధంచేశారు.

అదేరాత్రి వార్త నందుకున్న కర్కోటకుడు విసునూరి రామచంద్రారెడ్డి నలువైపులనున్న చోటా మోటాదొరలకు, వారి బలగాలకు కబురంపి, తనకుమించిన క్రూరుడైన తన కుమారశేఖరుడైన బాబుదొర నాయకత్వాన అదనపుబలగాలను హుటాహుటిగా తరిమాడు. వీరికన్నాముందే రామన్నపేట తాలూకాలోని ముడిపడిగ, సీర్నాలతోసహా అనేక గ్రామాలనుండి ఒడిసెలు, కర్రలతో యుక్తంగా ప్రజాప్రవాహము కదంత్రొక్కుతూ, పదంపాడుతూ విజృంభించి కడవెండిగ్రామాన్ని కమ్మివేసింది. దాడికి వెడలివస్తున్న దొరల బలగాలను గ్రామానికి మైలుదూరాన్నే నిలవేశారు.

ఉత్తర దిశనుండి దొరల బలగాలు తరలివస్తుండగా దక్షిణ దిశనుండి ప్రజాప్రవాహం కదలివస్తున్నది దొరల బలగానికి అయిదురెట్లు అమాంతంగా పెరిగి వేల

జనం తెల్లవారి మధ్యాహ్నం వరకు మూడువైపుల నుండి శత్రుబలగాలను చుట్టివేయనే పేలాడు షాట్‌గన్ దెబ్బలతో దాడి ప్రారంభించిన పాతకాలపు మూకలను వడిసెల రాళ్ళ వర్షంతో ప్రజాబలం ఎదుర్కొన్నది. ఎటు చూచినా వడిసెల రాళ్ళు రంయ్ మనే శబ్దంతో తుపాకీ గుళ్ళవలె అతి వేగంతో దూసుకుపోతున్నాయి. ఈ ప్రళయ మైన ప్రజా ప్రవాహం ధాటికి తట్టుకోలేని ఈ కిరాయి బందిపోటు మూకలు తమ యజ మానులతో సహా వచ్చిన వారు పలాయనం ప్రారంభించారు బ్రతుకుజీవుడా యంటూ పరుగెత్తడం వారి విధిమైంది అతిరథులు, మహారథులుగావున్న దొరలు, దొరవార్లు, జమీందార్లు తమ కచ్చడాలను (చిన్నబండ్లు) అఘమేఘాలమీద తరుముకుపోతున్నారు. కాని క్రోధాగ్నిచే బుసలుకొడుతూతరుముకువస్తున్న ఆ ప్రజావాహిని ఈ నేరస్తులను, హంతకులను వదిలిపెట్టలేదు. కొద్దిరోజుల క్రితమే తమ నాయకులను దారికాచి ప్రాణాం తకంగా కొట్టించడమేగాక పోలీసుల ద్వారా అతి నీచమైన చిత్రహింసలపాలు చేయిం చిన ప్రముఖమైన మండగులకచ్చడీ యొకటి నేలపైఆనీఆనకుండాపరిగెత్తుచున్నదానిని అందుకోవడానికి ప్రజలు రేచుల్లా వెంబడించారు. అందుబాటులోకి వచ్చిన ఈ దళాన్ని చూచిన ఈ హంతకులు అమాంతంగా బెదరి ఆయుధాలతో చిత్తుబొత్తుగాకాల్చనారంభిం చారు. అప్పుడదియుద్ధరంగంలోని ఒకానొక ఉద్రిక్తఘట్టం. కచ్చడాన్నిఅమాంతంగానేల పైకిలాగిగంతులు వేయించుతూనాల్గుకాళ్ళసవారీసాగిస్తున్నఆమైసూరుఎడ్లజతఅశ్వాలను తలదన్ని అఘమేఘాలమీద లేచిపోతున్నది. ఆ వడిలో పైకీ, కిందకీ అతివేగంగా ఊగుతూలేచిపోతున్న కచ్చడంలో నుంచి తుపాకిగుళ్లఅగ్నిగోళాల్లాఎదురువస్తుండగా కచ్చడం ఊపులకు అనుగుణ్యంగా ఫీల్డుచేస్తూ అమాంతంగా అగ్రగామి దళం కచ్చడంలోకి దుమికి అతి ముఖ్యమైన గూండాలను, గుమాస్తాలను పట్టుకొని తుపాకు లనుఎదుపెత్తిప్పారు. ఆ క్షణం మరొక దళం ఎడ్ల మెడలమీదనుంచి కచ్చడం కాడి తప్పించివేశారు. ఇదిలా వుండగా ఎటుచూసినా మైళ్ళ వెడల్పున తరుముకు వస్తున్న ప్రజావాహినికి ఎందరెందరోపరమశత్రువులైన పెత్తందార్లు, వారితొత్తులు లందారు.

ఈ ప్రవాహం విసునూరు పొలిమేరల దాకసాగింది. ప్రజల చేతుల్లో చిక్కకుండా బయటపడిన దొంగలూ, దొరయూ బ్రతుకుజీవుడాయంటూ పారిపోయి విసునూరు దొరగడిలో దూరి వెనుతిరిగి చూశారు. ఇక దొరికినవారిలో ముఖ్యులు, నీచాతి నీచులు అనుమల రాంరెడ్డి, ఒలమిది జాగీర్దారు ఖాన్‌మియా మొదలగు కిరాత కులను ఒక్కొక్కటిగా పేరుపేరునా సంజాయిషీ అడుగుతూ దేనికదే శిక్ష విధించి, వారిపై అమలుజరిపారు. ఇదీ అమరవీరుడు దొడ్డి కొమరయ్య రక్తపు మడుగులోంచి విజృంభించిన ప్రళయం. నిజానికి నాటి బానిసత్వాన్నే ధిక్కరించి విజృంభించిన మొదటి తిరుగుబాటు. మాటకుముందు "అయ్యా ! నీ కాల్మొ మొక్కుత! నీ బాంచను!" (నీ బానిసను) అంటూ అణగి మణగిన జనం వీరులుగా విజృంభించి క్రూరులైన జమీందార్లపై ఎదురుదెబ్బతీసిన ఒక భీకరఘట్టం యిది అన్నింటినీమించి చారిత్రాత్మక మైన వీరతెలంగాణా విప్లవంలో నూతనపోరాటఘట్టానికి పిలుపుయిచ్చిన శంఖారావం యిది. అదే సాయుధ పోరాట ఘట్టం.

— భీమిరెడ్డి నరసింహారెడ్డి.



# 8

# మహా వీరులను సృష్టించిన ఆనాటి తెలంగాణా విద్యార్థి ఉద్యమం

తేదీలు, నెలలు సరిగా జ్ఞాపకంలేకపోయినా అది 1946 సంవత్సరకాలం. ఆనాటికే విసునూరు దేశ్‌ముఖ్ గూండానాయకుడు మిష్కినలీ తుపాకిగుండుకు అమరజీవి దొడ్డి కొమరయ్య దారుణంగా ఆహుతిచేయబడ్డాడు.

నైజాం నిరంకుశ ప్రభుత్వానికి, ఫ్యూడల్ వ్యవస్థకు వ్యతిరేకంగా గ్రామసీమలలో భగభగమండే విప్లవ మహాగ్నిజ్వాలను ఆరంభంలోనే ఆర్పివేయటానికి నైజాం రిజర్వుపోలీసు ముష్కరమూక నట్టనడిరేయి చారిత్రాత్మక పాత సూర్యాపేట, బాలెంల గ్రామాలను చుట్టుముట్టి ఆంధ్రమహాసభ కార్యకర్తలను —అమరవీరులు

అనంతరెడ్డి, పట్టారెడ్డి గారల నిండు ప్రాణాలను తుపాకి గుండ్లకు బలియిటం ఆనాటికే జరిగిపోయింది.

ప్రభుత్వ నిర్బంధ విధానం అప్పటికే తీవ్రస్థాయినందుకున్నది. నాయకత్వం లోని ప్రధానభాగం ఆనాటికే అరెస్టు చేయబడటమో, రహస్యంగా వుండవలసి రావటమో సంభవించింది.

ఒకవైపున ప్రభుత్వ నిర్బంధ విధానం తీవ్రంగా సాగుతూనే ఉన్నప్పటికీ ప్రజా ఉద్యమాలు తమ తమ స్థావరాలలో మోహరిస్తూనే వున్నది.

కరీంనగర్ విద్యార్థులు తమ సమస్యలపై సాగించిన పోరాటాలు ఉన్నత స్థాయినందుకున్నవి. సమ్మె పోరాటాలు సాగినవి. విద్యార్థులలో పెల్లుబికిన వెల్లువ కట్టలు త్రెంచుకున్నవి. పురోగమిస్తున్న ఈ ఉద్యమాన్ని కర్కశంగా అణచివేయ డానికి ప్రభుత్వం అనేక నిర్బంధ విధానాలను ఉపయోగించటంతో పాటు యిద్దరు విద్యార్థి నాయకులను స్కూలు నుండి వెళ్ళగొట్టింది. ప్రభుత్వ ఈ చర్య అగ్నిలో ఆజ్యం పోసినట్టయింది.అగ్నిజ్వాల దావాలనమైంది. తెలంగాణాలోని అన్ని పట్టణాలకు వ్యాపించింది. కరీంనగర్ విద్యార్థులకు సానుభూతిగా విద్యార్థులపై ప్రభుత్వం తీసు కున్న కఠిన చర్యలను వెంటనే విరమించాలని హైద్రాబాదు, ఖమ్మం, నల్లగొండ, సూర్యాపేటలలో విద్యార్థులు ఊరేగింపులు, సమ్మెలు ప్రారంభించారు.

కరీంనగర్ విద్యార్థులకు సానుభూతిగా సూర్యాపేటలో జరిగిన ఊరే గింపులో, సమ్మెలో నూటికి నూరుపాళ్ళు విద్యార్థులు పాల్గొన్నారు. విద్యార్థు లలో పెరుగుచున్న ఈ సంచలనాన్ని దెబ్బతీయుటకు ప్రభుత్వం కొత్త ప్లాను లతో సిద్ధమైంది. సూర్యాపేటలో 8 మంది విద్యార్థి నాయకులను ఉన్నతో పాధ్యాయుడు స్కూలు నుండి తొలగించాడు. విద్యార్థి నాయకులపై ప్రభుత్వం వారంట్లు జారీచేసింది. కొందరిని అరెస్టు గావించింది. ఎంత కఠినంగానైనా వ్యవహ రించి విద్యార్థి ఉద్యమాన్ని అణచాలన్న ధోరణిలోనే ప్రభుత్వవైఖరి కొనసాగింది. ప్రభుత్వ ఈ నిర్బంధ చర్యలు విద్యార్థులను తమ కాళ్ళ ముందర మోకరిల్లేటట్లు చేయ లేకపోయినవి. పైగా విద్యార్థులలో గంభీరత పెరిగింది. తమకు జరిగిన అక్రమాలను పోరాడి రద్దు చేయించుకోవాలన్న పోరాటదీక్ష ఉన్నతస్థాయి చేరుకున్నది. ఇకముందు కార్యక్రమాన్ని నిర్ణయించుకోవటానికి జరిగిన విద్యార్థుల సమావేశంలో విద్యార్థి నాయకులు విడుదలయ్యే వరకు, వారంట్లు, డిబార్లు రద్దు గావించబడే వరకూ సమ్మె పోరాటాలు సాగించాలని, ఉన్నతోపాధ్యాయుడు హైస్కూలులో ప్రవేశించకుండా పికెటింగ్ పోరాటం సాగించాలని నిశ్చయమైంది.

తెల్లవారి 9 గంటలకల్లా విద్యార్థులు వచ్చి స్కూలు గేటులో కూర్చున్నారు. వందలాది విద్యార్థులు చుట్టూమూగి వున్నారు. జై జై ధ్వానాలు దిక్కులుపిక్కటిల్లు చున్నవి. ముస్లిం విద్యార్థులను చీలదీసి విద్యార్థులలో మతకలహాలు సృష్టించడానికి అధికార వర్గాలు అనేక ప్రయత్నాలు చేశాయి. కాని ఆ కుయుక్తులు సాగలేదు.

'హిందూ ముస్లిం భాయి, భాయి తుల్పాయెబరాదరీ జిందాబాద్' అన్న ప్రజాతంత్ర భావాలను వెదజల్లే నినాదాలు అధికారుల కుయుక్తుల నాటకాలను సాగనివ్వలేదు. పికెటింగ్ ఉద్యమం నూటికినూరుపాళ్లు విజయవంతమైనది.

రెండవరోజు పికెటింగ్ కార్యక్రమం ప్రారంభమైంది. విద్యార్థులు గేటులు ఆక్రమించివున్నారు పికెటింగ్‌చేస్తున్న విద్యార్థులకు వత్తాసును, ఉత్సాహన్ని యిస్తూ వందలాది విద్యార్థులు సమీకృతమైవున్నారు. పాఠశాల ఆవరణంతా విద్యార్థులతో కిక్కిరిసివున్నది.పికెటింగ్‌ను అతిక్రమించడానికి ఉపాధ్యాయులుకూడా సిద్ధపడేట్టులేట. కాని ప్రధానోపాధ్యాయుడు గేటుకు అడ్డంగాపడుకున్న విద్యార్థులను త్రొక్కుకుంటూ పోవడానికి కర్కశంగా ప్రయత్నించాడు.

"ఉన్నతోపాధ్యాయుని విచ్ఛిన్నచర్యల
ప్రతిఘటించవేగమే కదలిరమ్మ సోదరా!"

అన్న పాట వినిపించింది. వెంటనే ఆపాట వందలాది గొంతులలో ప్రతిధ్వనించింది. విద్యార్థిసమూహం ఉత్తేజం పొందింది. విద్యార్థులంతా ప్రతిఘటనకు సిద్ధమయ్యారు. విద్యార్థులకు అండగా మిల్లు కార్మికులు, గుమాస్తాలు, ఊరేగింపులతో ప్రజాసమూహాలు కదనరంగానికి సమీకృతమయినాయి. పట్టణమంతా అక్కడే ప్రత్యక్షమైనట్లుగా వుంది. ఎటుచూసినా విద్యార్థుల న్యాయమైన కోర్కెలను ప్రభుత్వం ఆమోదించాలన్న నినాదాలే, ప్రవాహంలాగా కదిలివస్తున్న ప్రజావాహినిని చెదరగొట్టడానికి రిజర్వ్ పోలీసుల దళాలు సమాయత్తమైనాయి. లాఠీలతో ప్రజలపై, విద్యార్థులపై పోలీసులు విరుచుకుపడ్డారు. అమానుషంగా లాఠీఛార్జి ప్రారంభమైంది. అనేకమంది లాఠీల దెబ్బలు విపరీతంగా తగిలాయి. పన్నెండు ఏండ్ల వాలుడు, విద్యార్థి తలపగిలి శరీరమంతా రక్తసిక్తమై స్పృహతప్పి పడిపోయాడు. ఈ సంఘటనతో రెచ్చిపోయిన ప్రజలు, విద్యార్థులు ప్రతీకారానికే పూనుకొన్నారు. అందిన రాయినల్లా ప్రయోగించి ప్రతిఘటించారు. ఒక గంటసేపు విద్యార్థులకు, పోలీసులకు భీకర పోరాటం కొనసాగింది. ఆ కారణంతో హుంకరిస్తూ విద్యార్థుల మీదకి పోలీసులను తరుముతున్న పోలీసు అధికారి గురిపెట్టి ఒక విద్యార్థి రాయితో కొట్టాడు. ఆదెబ్బకు అమిన్‌సాహెబ్ గారి టోపీ అమాంతంగా ఎగిరి క్రిందపడిపోయింది. అహంకారపు అధికారికిఅంతులేని అవమానం జరిగింది. ఆ తర్వాత విద్యార్థులు అమీన్‌ను కొట్టారు, కాబట్టి లాఠీఛార్జి చేయవలసి వచ్చిందని ఒక కుంటిసాకును అధికారివర్గాలు ప్రచారంలో పెట్టాయి.

నైజాం సంస్థానంలో తీరని విద్యా సమస్యలు తీవ్రంగా కలవరపరుస్తుండేవి తెలంగాణా ప్రాంతమంతా తెలుగు మాతృభాషగా గల విద్యార్థులకు ఉర్దూభాషలో విద్యాబోధన జరుగుతుండేది. బోధించబడే ఆ విద్య కూడా ప్రభుత్వం తన పాలక నిరంకుశ యంత్రాంగాన్ని సృష్టించుకోవడానికి మాత్రమే ఉద్దేశించబడింది. చదువుకున్న వారిలో కూడా ఎవరో కొందరు నవాబులకు, దేశముఖ్‌లకుతప్ప ఇతరులకు

ఉద్యోగం గ్యారంటీ వుండేదికాదు. స్కూలులో ప్రవేశం సంపాదించడానికి విపరీతంగా డొనేషన్లు కావలసివచ్చేది. ఉపాధ్యాయులవద్ద ట్యూషన్లు చదివితేనే లేక వారిఇండ్లలో వెట్టిచాకిరి చేస్తేనే ఉత్తీర్ణులు కావటానికి అవకాశాలుండేవి. ఇంత అధ్వాన్నస్థితివుండటమేకాదు. అసలు విద్యాలయాలే శూన్యం. జిల్లాకు ఒక్క హైస్కూలు, ఒక మిడిల్ స్కూల్ మాత్రమే వుండేవి. పైగా గ్రామీణ రైతుకూలీలు క్రూరమైన ఫ్యూడల్ దోపిడీకి గురికావటం వల్ల వారి వారి బిడ్డలను చదివించటానికి వారి ఆర్థిక స్థోమత ఏ విధంగా కూడా సరితూగేదికాదు అందువల్ల విద్య సాధారణ ప్రజలకుఅసలే అందుబాటులో లేదు.

విద్యాలయాల్లో నైజాంరాజును దైవాంశసంభూతుడుగాపేర్కొని ప్రార్థనలు విద్యార్థులచే చేయించేవాడు. ఫ్యూడల్ వ్యవస్థ మారడానికి వీలులేదన్నభావాన్ని ప్రబోధించేవాడు. ఇలాంటిస్థితిలో విద్యార్థులు విద్యార్థి సంఘాలు స్థాపించుకొని నల్గొండ, సూర్యాపేటలలో అనేక పోరాటాలు చేయటం జరిగింది. సూర్యాపేటలో హైస్కూలు నెలకొల్పాలని నిరంతరం పోరాడి దానిని సాధించుకోగలిగారు. నల్గొండ, సూర్యాపేటలలో విద్యార్థి వసతిగృహాలేర్పరచి విద్యార్థులకు సౌకర్యాలు కల్గించటమేగాకుండా ఈ వసతి గృహాలు విద్యార్థులలో సంఘచైతన్యం,ప్రజాతంత్రభావాలు పెంపొందడానికి నిలయాలుగా ఉపయోగపడినవి. లైబ్రరీలు, ఆటపాటలపోటీలు మొదలగు సాంస్కృతిక కార్యక్రమాలద్వారా విద్యార్థుల విజ్ఞాన వికాసాలకు, ఔన్నత్యానికి కృషిగావించబడింది. తద్వారా విద్యార్థిసంఘాలు విద్యార్థుల నిత్యజీవితంలో భాగమయ్యాయి.

నాటి సాధారణ ప్రజాతంత్ర ఉద్యమం విద్యార్థుల మనోభావాలపైనా, వారి ఆచరణపైనా ప్రభావాన్ని కలుగజేసింది. బ్రిటీషు సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా భారతదేశమంతటా వీస్తున్న విప్లవ పెనుతుపానులు, గదర్ వీరుల గాథలు, భగత్ సింగ్, చంద్రశేఖర్ ఆజాద్, సీతారామరాజుల వీరోచిత త్యాగాలు విద్యార్థుల ఉడుకు రక్తాన్ని ఇంకా వేడెక్కించాయి.

రెండవ ప్రపంచ సంగ్రామంలో కామ్రేడ్ స్టాలిన్ నాయకత్వాన ఎర్ర సైన్యమూ, సోవియట్ ప్రజలు సాగించిన అజరామర త్యాగాలు, వీరయువకులు జోయా, టాడ్మిల్లాలు ప్రదర్శించిన అపూర్వ ధైర్యసాహసాలు, దానికి నాజీలపతనం అనేక సోషలిస్టుదేశాల అవతరణ విద్యార్థులకు ఎంతో ఉత్తేజాన్ని కలిగించినాయి.

విజయవాడలో జరిగిన అఖిలభారత రైతు మహాసభ, మునగాల రైతు పోరాటాలు, ముఖ్యంగా తెలంగాణాలో విసునూరు, జన్నారెడ్డి దేశ్‌ముఖ్‌లకు వ్యతిరేకంగా వెట్టిచాకిరీ రద్దుకోసం రైతుకూలీలు సాగించిన పోరాటాలు,ఆ పోరాటాలలో కడవెండిలో దొడ్డి కొమరయ్య ప్రాణబలిదానం, అయిలమ్మ భూమి పోరాట విజయం, పాతసూర్యాపేట, బాలెంల, మల్లారెడ్డిగూడెంలలో నైజాం ముష్కరులు సాగించిన అమానుష హత్యాకాండ విద్యార్థిలోకాన్ని ఉద్రేకపరిచినవి.

ఆంధ్ర మహాసభలు ప్రధానంగా భువనగిరి, ఖమ్మం మహాసభలు విద్యార్థుల మనోఫలకాలపై ప్రత్యేకమైన ముద్రను వేశాయి. మాతృభాషలో విద్యాబోధన కావాలన్న వాంఛను ప్రేరేపించాయి.

ఆ రోజులలోనే "విశాలాంధ్రలో ప్రజారాజ్యం" అన్న కామ్రేడ్ సుందరయ్యగారి పుస్తకం ప్రచారంలోకి వచ్చింది. ఈ నినాదం ఆనాటి వరకు ఆంధ్ర మహాసభలో వున్న చాలామందికి సాధారణ అవగాహనను నిర్దుష్టపరచి హైదరాబాదు సంస్థానం విచ్ఛిత్తి చేయబడి వేరువేరు భాషా ప్రాంతాలు తమ మాతృభాషగా గల ఇతర ప్రాంతాలలో సంలీనమై భాషా ప్రయుక్త రాష్ట్రాలుగా ఏర్పడాలని, ఆ విధంగా ఏర్పడిన విశాలాంధ్రలో ప్రజాతంత్ర ప్రభుత్వం ఏర్పడాలన్న ప్రజాతంత్ర కార్యక్రమాన్ని ప్రతిపాదించటం జరిగింది. ఈ కార్యక్రమానికి గూడా ఒక స్పష్టమైన అవగాహనను కలిగించింది.

దేశమంతటా పెల్లుబుకుతున్న విప్లవవెల్లువ ప్రజాతంత్ర ఉద్యమాలతో ప్రభావితమై విద్యార్థులు మొత్తం ప్రజాతంత్ర ఉద్యమానికి అండగా నిలబడటంలో కూడా తమవంతు కర్తవ్యాన్ని ఎంతో విజయవంతంగా నిర్వర్తించటంలో కృతకృత్యులయ్యారు.

ఆనాడు జాతీయ, అంతర్జాతీయ సమస్యలపై వెలువడిన పుస్తకాలు, కరపత్రాలు, పత్రికలు పంచటంలో, ప్రచారం సాగించటంలో విద్యార్థులు చాలా కృషి గావించారు.

భారత ప్రజలందరినీ ఆందోళన పరచిన బెంగాల్ కరువు విషాదవార్తలు విస్తృతంగా ప్రచారంగావించి విరివిగా విరాళాలు వసూలుచేసే కర్తవ్యాన్ని జయప్రదంగా నిర్వహించారు.

ఘోరమైన వెట్టిచాకిరీ విధానాన్ని నిరసిస్తూ "నూరుబించెల సానిపోయన్నా-విసనూరు దొరవారింటి ముందు మారుపలకక చల్లవలెనన్నా" వెట్టికి బరువులు మోయించుకుపోయే అధికారుల గురించి "కోసుకు పీసం బివ్వమన్న సర్కారుమాటనే తోసేసారయ్యో, తాలేలిల్లియ్యలో" అనే పాటలు పాడుకుంటూ ఆంధ్ర మహాసభ వలంటీర్లుగా సూర్యాపేట నుండి ఖమ్మందాకా సుమారు నలభైమైళ్ళు కాలినడకన ఊరూరు తిరుగుతూ, ఊరేగింపులు సాగిస్తూ ప్రచార కార్యక్రమంలో విద్యార్థులు ఉచితపాత్రను నిర్వహించారు.

మొండ్రాయిదేశముఖ్‌లు, కడారు సోదరులు నరసింహారావు, రామచంద్రరావులు లంబాడీ కౌలు రైతులను భూములనుండి తొలగించడానికి రైతులపై అనేక దౌర్జన్యాలు సాగించారు. వీరి వెట్టిచాకిరీ విధానానికి వ్యతిరేకంగా చాకలి వీరమ్మ నాయకత్వాన పోరాటం ప్రారంభమైంది వీరమ్మ కొడుకులకు రాత్రి పాఠశాలపెట్టి విద్యాబోధన చేసి వారిని నాయకులుగా తయారు చేయాలని మొండ్రాయిలో కేంద్రీకరించిన

ఆంధ్ర మహాసభ కార్యకర్త కామ్రేడ్ వెంకటేశ్వరరావును దేశ్‌ముఖ్ గూండాలు చావ చితకగొట్టారు. ఈ దురంతం విద్యార్థులలో విస్తృతంగా ప్రచారమైంది. ఒకరోజు కడారు రామచంద్రరావు దేశ్‌ముఖ్ సూర్యాపేట వచ్చి బస్సు దిగుతుండగానే విద్యార్థులు పసిగట్టి చుట్టూ సమీకృతమైనారు. అది గమనించిన రామచంద్రరావు పరుగు లంకించుకున్నాడు. విద్యార్థులు వెంటపడి తరిమారు. తుదకు ఒక హోటల్ గదిలో చొరబడి గడియవేసుకొని రక్షణ పొందాడు దీనితో గ్రామాలలో ఉద్యమ కార్యకర్తలపై దౌర్జన్యాలు సాగించేవారు. సూర్యాపేట పట్టణానికి రావటానికే ధైర్యాన్ని కోల్పోయారు.

అమరజీవి దొడ్డి కొమరయ్య మరణానికి సానుభూతిగా ఒకసారి, పాత సూర్యాపేట, బాలెంలలో నైజాం పోలీసులు సాగించిన దమనకాండను నిరసిస్తూ మరోసారి విద్యార్థులు ప్రదర్శనలు గావించారు. సూర్యాపేటలో మిల్లు కార్మికులు తమ వేతనాల పెరుగుదలకోసం తమ సంఘం పెట్టుకొని పోరాడుతుంటే వారిని ఉద్యోగాల నుండి తొలగించటం జరిగింది కార్మికుల తొలగింపుకు వ్యతిరేకంగా విద్యార్థులు ప్రదర్శనలు సాగించారు. తుదకు కార్మికులు పనులలో తిరిగి చేర్చుకోబడ్డారు

అంతేకాదు; జైళ్ళలోవున్న నాయకులను జైలు కిటికీలు బ్రద్దలుకొట్టి విడిపించుకోవటానికి ప్రయత్నించారు. అది సాధ్యంకానపుడు పోలీసుల కండ్లలో కారం కొట్టి నాయకులు పారిపోవడానికి విద్యార్థులు సహకరించారు రహస్య నాయకులకు వార్తాహరులుగా ముఖ్యమైన బాధ్యతలు నిర్వహించారు. ఉద్యమ నాయకత్వం జైళ్ళలోను, రహస్యంగానువున్న సందర్భంలో ప్రపంచ యువజనసమాఖ్య ప్రతినిధివర్గం సూర్యాపేటకు వచ్చినపుడు నైజాం పోలీసుల దమనకాండను ప్రతినిధివర్గానికి అవగతం చేయించడానికి ప్రతినిధివర్గాన్ని బాలెంలకు తీసుకువెళ్ళే బాధ్యతను కూడా విద్యార్థులే నిర్వహించారు.

1947 ఆగస్టు 15 నాటికే తెలంగాణా గ్రామసీమలలో నైజాం ప్రభుత్వము, దేశముఖ్‌లుసాగించే వెట్టిచాకిరీకి వ్యతిరేకంగా ఉద్యమం ఉన్నతస్థాయికి చేరుకోవడం, ఆ ఉద్యమాన్ని అణిచివేయడానికి తీవ్రమైన నిర్బంధాన్ని, దౌర్జన్యచర్యలను ప్రభుత్వం, దేశ్‌ముఖ్‌లు కొనసాగించటం, ఈ నిర్బంధవిధానాన్ని తట్టుకొని ఉద్యమం పురోగమించటానికి ప్రతిఘటనోద్యమం అప్పుడే ప్రారంభమై ఉంది. అయిలమ్మ పొలాన్ని సాధించడం, విసునూరు గూండాలను తరిమికొట్టడం, బాలెంల, పాతసూర్యాపేట, మల్లారెడ్డి గూడెంలలో పోలీసుదాడులను ప్రతిఘటించడం అప్పటికే జరిగింది.

ఇక ఆగస్టు 15 తో భారతదేశానికి స్వాతంత్ర్య ప్రదానం జరగడం, స్వతంత్ర భారతదేశంలో చేరడానికి నైజాం ప్రభుత్వం—ఫ్యూడల్ శక్తుల మధ్య, రైతు కూలీలమధ్య మందుతున్న వైరుధ్యానికితోడుగా భారత బూర్జువావర్గానికి, నైజాం నవాబుకు మధ్యవైరుధ్యం ప్రారంభమైంది. హైదరాబాద్ స్టేట్ భారతదేశంలో విలీనం

కావాలన్న భావం అన్ని వర్గాలలో వ్యాపించింది. హైదరాబాదు సంస్థానంలోని బూర్జువావర్గం, దాని ననుసరించే విద్యార్థులుకూడా ఈ ఉద్యమంలో భాగస్తులయ్యారు. దీని పర్యవసానంగానే శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారి ఇంటిలో జరిగిన సమావేశంలో తెలంగాణాలోని అన్ని జిల్లాలకు, వివిధ రాజకీయ గ్రూపులకు చెందిన విద్యార్థులు పాల్గొన్నారు ఆ సమావేశంలోనే "క్విట్ కాలేజి" నినాదం ఇవ్వబడింది. విద్యార్థులంతా విద్యాలయాలు వదిలివేసి గ్రామీణప్రాంతాలకు వెళ్ళి సాయుధ ప్రతిఘటన ఉద్యమంలో పాల్గొనాలన్న కార్యక్రమం తీసుకోబడింది.

విద్యార్థి ఉద్యమం అనేకమంది మహావీరులను సృష్టించింది. క్విట్ కాలేజి నినాదాన్నందుకొని అనేకమంది విద్యార్థులు విద్యాలయాలు వదిలిపెట్టి సాయుధగెరిల్లా దళాలలో చేరిపోయారు గెరిల్లా ఉద్యమంలో చాలా వీరోచితమైన పాత్రను నిర్వహించారు.

విద్యార్థి నాయకుడూ, అద్వితీయమైన పాత్రను నిర్వహించిన కామ్రేడ్ పసునూరు వెంకటరెడ్డి సాయుధపోరాటరంగంలో గూడ సాటిలేనిమేటి నాయకుడుగా తన పాత్రను నిర్వహించాడు. నకిరేకల్ ప్రాంతంలో గెరిల్లా ఉద్యమాన్ని అణచటానికి రజాకారు సైన్యాలు గుంపులనుపయోగించినపుడు మన ఉద్యమం చాలా విషమసమస్యల నెదుర్కొన్నది. ఈ క్లిష్ట సమయంలో కూడా తన ప్రాంతాన్ని వదిలిపెట్టకుండా వుండి, ప్రజలను ఉత్తేజపరుస్తూ ఎంతో ధైర్యంగా తన బాధ్యతలను నిర్వహించాడు. చివరకు తన ఇరువదేండ్లప్రాయంలో ఒక విద్రోహి వార్త అందించిన ఫలితంగా రజాకార్లు అన్నారం గ్రామాన్ని చుట్టుముట్టి కామ్రేడ్ వెంకటరెడ్డిని పట్టుకొని కాల్చిచంపారు.

సూర్యాపేట, వరంగల్లులో విద్యార్థి ఉద్యమంలో ఉత్సాహంగా బాధ్యతలు నిర్వహించిన కామ్రేడ్ పానుగోటు సీతారాంరావు గెరిల్లా పోరాటంలో కూడా అంతకంటే ఉత్సాహంగా తన బాధ్యతలు నిర్వహించాడు ఆర్గనైజర్‌గావుండి, ఆ తర్వాత జోనల్ కమాండర్‌గా ప్రమోట్ చేయబడ్డాడు. తాను కమాండర్‌గావున్న సమయంలో పోలీసు క్యాంపును చుట్టుముట్టి చేసిన వీరోచిత పోరాటానికి నాటి ఏరియా కమిటీ సీతారాంరావును అభినందించింది. పోలీసుచర్య తరువాత అడవులలోనికి దళాలు రిట్రీటు యైన తరువాత బయ్యారం ప్రాంతీయ కమిటీ కార్యదర్శిగా బాధ్యతలు నిర్వహించాడు. ఈ సమయంలో మన దళాలు ఇల్లెందు బొగ్గుగనులపై దాడిచేసి కొన్ని సంవత్సరాలకు సరిపోయేంత ప్రేలుడుపదార్థాల్ని సంపాదించటం జరిగింది. ఈ విజయోత్సాహంతోనే మేమంతా వేరువేరు ప్రదేశాలకు విడిపోయాము రెండోరోజే పిడుగులాంటి వార్త. పోలీసుదళం తాము మరోప్రాంతంలోంచివచ్చిన గెరిల్లాదళమని మోసగించి సమీపించి స్టెన్‌గన్‌తో కాల్చగా సుమారు 20 గుండ్లదాకా పొట్టలోపడి సీతారాంరావు చనిపోయాడు. అప్పటికి ఆయన వయస్సు 19 ఏండ్లు మాత్రమే.

విద్యార్థులుగా వుండి తన అన్నలతోపాటు సాయుధ పోరాట ఉద్యమంలోకి వచ్చి ప్రాంతీయ నాయకుడుగా బాధ్యతలు నిర్వహించాడు కామ్రేడ్ రామిరెడ్డి. పోలీసు

యాక్షన్ తరువాత తాను వున్నస్థలాన్ని కనుగొని శత్రువులు చుట్టుముట్టారు. కాల్పులు సాగించారు. తన దగ్గరవున్న స్టెన్‌గన్‌తో ఆఖరు తూటావరకు ప్రతిఘటించి వీర మరణం చెందాడు. ప్రజలలో భయోత్పాతాన్ని సృష్టించడానికేమో ? నాయకుని శవాన్ని బండిపై వుంచి సూర్యాపేటలో ఊరేగింపు జరిపారు శత్రువులు. కుర్చీపై కూర్చుండబెట్టిన తీరుచూస్తే నాయకుడు తన తుది సందేశ మివ్వటానికి వచ్చారా అన్నట్లుగా వున్నది. ప్రభుత్వం వొకటి తలిస్తే మరొకటి జరిగింది. ప్రజలలో భయానికంటే ప్రభుత్వ దుష్ట చర్యలమీద అక్కసు పెరిగింది. నాయకుడి తుది సందర్శనంకోసం సూర్యాపేట పట్టణమంతా కదిలింది

కామ్రేడ్ సీతారాములు ఆర్గనైజర్‌గా వుండి దేవరకొండ దాకా ఉద్యమాన్ని విస్తృతం గావించాడు. శత్రువుచేత చుట్టుముట్టబడి శత్రువు తుపాకీ గుండ్లకు ఎరయై చనిపోయూనే తన దగ్గరవున్న హాండ్ గ్రెనేడ్ విసిరి కొందరు శత్రువులను బలిగొని తన 18 వ ఏట కన్నుమూశాడు.

కామ్రేడ్ వెంకటేశ్వరరావు బయ్యారం ప్రాంతంలో మొదటి గెరిల్లా దళాన్ని నిర్మించి శత్రువులకు సింహస్వప్నంగా వుండి తుదకు శత్రువులచే చుట్టుముట్టబడి హోరాహోరీగా పోరాడి ఆ పోరాటంలోనే ప్రాణాలు వదిలాడు.

కొండవీటి ప్రతాపరెడ్డి, మునుగ వెంకటరెడ్డి, నాగిరెడ్డి చంద్రారెడ్డి లాంటి విద్యార్థి నాయకులు సాయుధపోరాటంలో తమ బాధ్యతలు నిర్వహిస్తూ వీరమరణం పొందారు.

భూమికోసం, భుక్తికోసం పీడిత ప్రజలు సాగించిన చారిత్రాత్మక సాయుధ పోరాటంలో అనేకమంది విద్యార్థులు యువకిశోరాల్లాగా ఉద్యమించి తమ ప్రాణాలను తృణప్రాయంగా బలిదానంచేసి పునీతమైన మహాపీఠిల్ని సృష్టించిన మన విద్యార్థి ఉద్యమ చరిత్ర చిరస్థాయిగా ఉంటుంది. భావితరాలకు ఆదర్శప్రాయమౌతుంది.

— మల్లు వెంకట నర్సింహారెడ్డి.





# తెలంగాణా గెరిల్లాయోధుల సాహసం

కామ్రేడ్ పుత్తిరెడ్డి వెంకటాచలం, గుంటూరుజిల్లా రేపల్లె తాలూకాకు చెందిన ఒక మధ్యతరగతి రైతుకుటుంబంలో జన్మించాడు. ఆయన పొలాలలో పని చేసుకుంటూ, కృష్ణానదిలో ఈదటానికి బాగా అలవాటుపడ్డాడు. చాలా తొలిరోజులలోనే ఆయన కమ్యూనిస్టు ఉద్యమంలో చేరాడు. 1948-49 లో కాంగ్రెస్ ప్రభుత్వం పోలీసు బీభత్సకాండను విచ్చలవిడిగా ప్రయోగించినప్పుడు, హత్యచేయాలన్న దుష్ట బుద్ధితో పార్టీ కార్యకర్తలపై దాడులు ప్రారంభించినపుడు ఆత్మరక్షణకోసం ఎదురు దెబ్బతీయవలసిందిగా పార్టీ పిలుపునిచ్చింది. పోలీసు బీభత్సకాండ సాగుతూవుండగా అక్కడ తట్టుకొని నిలవడం అతికష్టంగామారిన తర్వాత, వారిని ఫారెస్టు ప్రాంతాలకు తప్పుకోవలసిందిగానూ, పోరాడుతున్న తెలంగాణా గెరిల్లా దళాలలో చేరవలసింది గానూ పార్టీ కోరింది. అలా వెళ్ళినవారిలో ఆయన ఒకరు.

1951 జులైలో ఒకరోజున నేను కృష్ణానది సమీపాన దేవరకొండ కొండలలో ఆ ప్రాంత నాయకులతో మాట్లాడుతున్నాను. వందగజాల దూరంలో సాధారణ దుస్తులు ధరించిన ఒకయువకుడు, ఇద్దరు లంబాడీ యువకులతో తీవ్రంగా సుదీర్ఘచర్చ సాగిస్తుండటం గమనించాను. దాదాపు ఒకగంటసేపు తర్వాత వారక్కడనుండి వెళ్ళిపోయారు. ఆ సాయంత్రం, ఆ ప్రాంతానికి చెందిన మన నాయకుడు ఖిన్నవదనంతో నా దగ్గరకొచ్చాడు. కామ్రేడ్ సుబ్బయ్య (వెంకటాచలం మారుపేరు) కృష్ణానదిలో కొట్టుకపోయాడనేవార్త చెప్పాడు ఆ కథంతా నాకు వివరించాడు.

కృష్ణానదిని దాటి, అవలివైపువున్న గెరిల్లా దళాన్ని కలుసుకొని, ఆంధ్ర ప్రాంతంలో అది చిక్కుకొనివున్న ప్రమాదకర స్థితినుండి బయటపడటం కోసం ఆ దళాన్ని సురక్షితంగా తెలంగాణాకు చేర్చే పని కామ్రేడ్ వెంకటాచలంకు అప్పగించబడింది ఈతలో నిపుణులైన యిరువురు లంబాడీలు, కృష్ణానదిని దాటటంలో ఆయనకు తోడ్పడటంకోసం ఒప్పగించబడ్డారు. అయితే దురదృష్టవశాత్తు వాళ్ళు కృష్ణానదిని దాటటానికి నిర్దేశించబడిన రోజు అకస్మికంగా పెద్ద వరదలొచ్చాయి. ఆ కొండల వద్ద అప్పుడు నదిని దాటవలదని నిపుణులైన ఆ లంబాడీ ఈతగాండ్రు సలహాయిచ్చారు. వరదలు తగ్గుముఖం పట్టేంతవరకు కొలదిరోజులు ఆగటంగాని, లేదా 50 మైళ్ళు దిగువకు వెళ్ళి అచట మైదాన ప్రాంతాలలో నదిని దాటి, ఆవలి ఒడ్డునుండి మరల వెనుకకు నడిచి ప్రమాదంలో చిక్కుకొనివున్న దళంవున్న ప్రాంతానికి చేరటంగానీ- ఏదో ఒకటి చేయవగునని వారు సూచించారు. వెంకటాచలం బదులు చెప్తూ "ఇది మనకు అసాధ్యం. ఒప్పగించబడిన పనిని నిర్వర్తించడంలో తప్పక విఫలమౌతాం. శత్రు ముట్టడిలో చిక్కుకొని, ఆ దళం సర్వనాశనం చేయబడే ప్రమాదం ఎంతగానో వుంది" అని పార్టీ యిచ్చిన పనిని విడనాడవలదని ఆయన లంబాడి ఈతగాండ్రకు విజ్ఞప్తి చేశారు. పార్టీ ఆదేశాన్ని నిర్వర్తించడంకోసం తమ ప్రాణాలు కోల్పోవటానికికూడా సిద్ధం కావలసిందిగా ఆయన వారిని కోరాడు తర్వాత పదిమంది సభ్యులుగల దళంయొక్క ప్రాణాలు కాపాడవలసిందిగా విజ్ఞప్తి చేశారు. పార్టీ పేరు చెప్పడంతోనే లంబాడీ కామ్రేడ్స్ తమ అభ్యంతరాలను వదులుకున్నారు.

ముగ్గురు మూడు ఎండు దుంగలు చేతపట్టుకొని పరవళ్ళు తొక్కుతున్న కృష్ణానదిలో దూకారు. కామ్రేడ్ వెంకటాచలం నది ఒడిలోకికొట్టుకపోయాడు మిగతా ఇరువురూ ఒడ్డుకు నెట్టబడ్డారు. వెంకటాచలంతో కలుసుకోవాలని వారు పదే పదే ప్రయత్నించారు. కాని కలువలేకపోయారు. ప్రవాహవేగంలో వెంకటాచలం నీటి క్రిందికి నెట్టబడటం: ఆయన తన దుంగనే గట్టిగా అంటిపెట్టుకొని, వీరోచితంగా పైకి తేలుతుండడం వారు గమనించారు. వారు ఖిన్న వదనంతో నది ఒడ్డు నుండి ఆయనను అనుసరించారు. ఆయన వారికి కనిపించకపోయిన తరువాత ఆ విషాద వార్తను తెలియజేయటానికి వారు తిరిగి వచ్చారు. ప్రస్తుత నాగార్జునసాగర్ ఆనకట్టకు కొంచెం పైనే యిది జరిగింది.

మేమంతా నిర్ఘాంతపోయాం! అలాంటి కామ్రేడ్స్‌ని కోల్పోవటమా ? అని ముగ్గురు కామ్రేడ్స్ ప్రాణాలను ప్రమాదానికి లోనుచేయటానికి సిద్ధమై కృష్ణానదిని దాటటానికి ప్రయత్నించటానికి ఆయనను మేమనుమతించటం సరైనదేనా? మొత్తం దళం ప్రాణాలు గోల్పోయే ప్రమాదానికైనా సిద్ధపడి, ఆ దళాన్ని కాపాడేయత్నం విరమించితే బాగుండేదికదా ? అయితే ఆ సమస్యకు సమాధానంకోసంగాని, ఆదేశం కోసంగాని, ఆ ప్రాంత నాయకత్వానికిగాని నాకుగాని నివేదించటం జరగలేదు. కామ్రేడ్ వెంకటాచలం, కార్యదీక్షాపరులైన ఆ యిరువురి అంబాడీ కామ్రేడ్స్ తమంతట తామే ఆ సమస్యను పరిష్కరించారు.

ఎంతటి సంతోషకరమయిన విషయం! నాలుగురోజులనంతరం ఒకనాటి సాయంత్రం కామ్రేడ్ వెంకటాచలం మాకు కనిపించాడు. దళాన్ని వెంటపెట్టుకువచ్చి ఆయన మాకు సైనిక వందనం చేశాడు. మేమాయనను ఆలింగనం చేసుకొని జరిగిన దాన్ని గూర్చి ప్రశ్నలు గుప్పించాం.

"కామ్రేడ్స్ ! అసాధారణమైనదేమీ జరగలేదు. నేను ధైర్యం కోల్పోలేదు. నా కొయ్య దుంగను గట్టిగా పట్టుకున్నాను. అవలి ఒడ్డుకు చేరాను. అక్కడ గొడ్లకాపరులు నాకు సహాయపడ్డారు. దళాన్ని కలుసుకోవటానికి నిర్దేశించబడిన చోటికి వారు నన్ను చేర్చారు. వరదలు తగ్గుముఖం పట్టిన తరువాత మేము కృష్ణానది దాటాం. అదిగో మొత్తం దళమంతా సురక్షితంగా వుంది" అని ఆయన చెప్పాడు.

అయితే ఆ దళ నాయకుడు నాకు అడ్డుతగిలి, గొడ్లకాపరులు చెప్పగా తాను విన్నగాథను వివరించాడు. కామ్రేడ్ వెంకటాచలం తెంపరితనంతో ఈదుతున్నాడు. ఆయన చిన్న సుడిగుండాన్ని ఒకదాన్ని సమీపిస్తున్నాడు. చిట్టచివరి ప్రయత్నంతో ధైర్యసాహసంతో సాగించవలసిందిగా కోరుతూ గొడ్లకాపరులు ఆయనకు కేకలు పెట్టారు తమ పైపంచెలు ముడివేసి దానిని పొడుగాటి వెదురుబొంగుకుకట్టి ఆయన వైపుకు విసిరి పట్టుకొనవలసిందిగా కోరారు.

ఆయన సుడిగుండంలోకి ఈడ్చబడితే మరణం తథ్యం. కామ్రేడ్ వెంకటాచలం ఈదాడు. వెదురుబొంగును పట్టుకున్నాడు ఒడ్డుకు చేరుకున్నాడు. సురక్షితంగా బయటపడ్డాడు.

వాళ్ళు తన విషయం చెప్పటానికి ఆయన ప్రయత్నిస్తున్నాడు. అయినా వారాయనను మాట్లాడనివ్వలేదు. "కామ్రేడ్స్ మీరు చెప్పనవసరం లేదు. ఈ వరదలలో కృష్ణానదిని దాటటానికి తెలంగాణా గెరిల్లాకాక మరెవరు సాహసించగలరు ! ఈ రాత్రి కిక్కడ విశ్రాంతి తీసుకోండి" అని కోరారు. కామ్రేడ్ వెంకటాచలం విశ్రాంతి తీసుకోనిరాకరించాడు. తాను వచ్చినపని వివరించి చెప్పాడు. వారు ఆ రాత్రంతా నడిచారు నిర్ణీత ప్రకారం చేరవలసిన చోటుకు చేరారు. దళాన్ని కలుసుకున్నారు.

మేమంతా ఆనందించాం. 1951 అక్టోబరు 21 న తెలంగాణా పోరాటం ఉప

సంహరించబడినప్పుడు ప్రభుత్వం అంతకుముందు చేసిన ప్రగల్భాలను పాటించకుండా పగ సాధింపు చర్యలకు పూనుకొన్నది.

కామ్రేడ్ వెంకటాచలం ఒక గ్రామంలో జరిగిన సభలో కమ్యూనిస్టు (పి.డి.ఎఫ్) అభ్యర్థికి ఓట్లు వేయవలసిన ఆవశ్యకతనుగూర్చి వివరిస్తున్నాడు. పోలీసులు ఆకస్మికంగా ఆ సభను చుట్టుముట్టి వెంకటాచలంను తీసుకొని వెళ్ళి కాల్చి చంపారు.

తెలంగాణా మహాయోధుల త్యాగం, దీక్ష అంతటి మహత్తరమయినది. అవి రానున్న తరాలను ఉత్తేజపరుస్తాయి. ప్రజా విప్లవం, విజయం కోసం, నవసమాజం కోసం పయనించే వారి మార్గాన్ని కాంతివంతమొనరించగలవు.

—సుందరయ్యగారి "వీరతెలంగాణా విప్లవపోరాటం" గ్రంథంనుండి



# అమరవీరుడు కొండల్ రెడ్డి

కొండవంటి కొండల్ రెడ్డి పోయాడోయ్
మనకందరికి దారిచూపి పోయాడోయ్ ॥కొండ॥

వీరుడు కొండయ్య
విస్తాళ్ళ పురమందు
రైతూలోకమున బహు
దొడ్డవాడై పుట్టి
దోపిడీ పాలనా గూల్చుటకు తాను
కాంగ్రెసు సంఘమందు జేరాడోయ్ ॥కొండ॥

బీదోరి కష్టాలు
పోవుటాకు తాను
అడ్డమై కాంగిరేసు
బుద్ధితప్పిన దొరోళ్ళ
పెద్దాతనమును నిల్ప
బాధాలు పడుతుంటె
వీరూడు ఓర్వలేకపోయాడోయ్
మన గెరిల్లా దళమందు జేరాడోయ్ ॥కొండ॥

నళ్యంపేట. ఆత్మకూరు,
మిరియాలగు ఎఱ్ఱబాడు
ఎన్నోనోన్నో దాడులందు
అన్నిట్లో గెలిశాడు
దళమంతా దెబ్బతినిపోయిందోయ్
కొత్త - దళమును తయారె
చేశాడోయ్ ॥కొండ॥

అదరకా బెదరకా
గుండ్లెక్కి మిల్ట్రీని
గుండెకూ గురిజూసి

గుండ్లెన్నో వదిలాడు
పోలీసు సిబ్బంది అదిరిందోయ్
దెబ్బకే వాడొకడు సచ్చాడోయ్ ॥కొండ॥

ఆరుగంటలసేపు
అతిఘోరయుద్ధంబూ
గుట్టాదద్దరిల్లా
గొప్పగా జరిగింది
గుండ్లు లెక్కకుమించి పేలాయోయ్
కొన్ని బాంబూదెబ్బలు కూడా
వేగాయోయ్ ॥కొండ॥

జై ఎర్రజెండాకు జై అండీ
మన కొండర్రెడ్డికీ జై అండీ
నీ పేరు నిలిపెదము కొండయ్యా
నీకివే జోహార్లు కొండయ్యా ॥కొండ॥

[ఆ ప్రాంతంలో నేటికీ ఇది ప్రచారంలో
వున్న కోలాటంపాట.
వీరి జీవిత విశేషాలను సుందరయ్యగారి
గ్రంథంలో చూడవచ్చు
—సం॥]





# 10

## పూనుగొండ వీరులు

బ్రిగ్సు ప్లానును తెలంగాణాలో అమలుజరుపుతున్న రోజులవి. గ్రామాలకు గ్రామాలను పూర్తిగా భస్మీభూతం చేసి, కోయ ప్రజలందరనూ అశోక్‌నగర్, పటేల్ నగర్ అని ఆర్భాటంగా పేర్లు పెట్టబడిన కాన్సంట్రేషన్ క్యాంపులకు తోలుకు పోయిన కాలమిది.

గెరిల్లా దళాల కార్యకలాపాలు మానుకోట ఏరియాలో బాగా జరుగుతూ వుండేవి. ములుగు, నర్సంపేట తాలూకాల అడవి ప్రాంతం ఇందుకు ప్రధానరంగ భూమిగా వుండేది.

దీనిని అణచటానికై 4, 5 మైళ్ళకొక మిలిటరీ క్యాంపు పెట్టబడింది. అడవి

ప్రాంతంలో ప్రజల సంఖ్యకుమించి మిలిటరీ వున్నదా అన్నట్లు వుండేది. మిలిటరీ క్యాంపులలో గెరిల్లాదళాలు మెరుపుదాడులు గావిస్తూవుండేవి.

బొగ్గుట్టలోని కాలరీస్‌పై గెరిల్లాదళాలు దాడిచేసి పెద్దమొత్తంలో తుపాకి మందునూ, డైనమైట్లనూ, వాటి ఫ్యూజులనూ స్వాధీనంచేసుకొనటం జరిగింది. దీనం తటినీ అడవిలో ఒకచోట భద్రంగా దాచటం జరిగింది.

కొద్దివారాల తర్వాత ఆ దాపులలోనే మిలిటరీక్యాంపు వెలిసింది. మిలిటరీ గాలింపు ప్రారంభమైంది. అందువల్ల అక్కడి మందుగుండు సామాగ్రిని మరొకచోటికి చేర్చటం అవసరమైంది.

మానుకోట ఏరియా కమిటీ కేంద్రం ఆరోజుల్లో పూనుగొండ ప్రాంతంలో వుండేది. ఆ కేంద్రాన్ని సురక్షితంగా వుంచటానికీ, చురుకుగా పనిచేస్తానికీ గ్రామస్థు లంతా విశేషంగా సహాయంగావించేవారు.

మందుగుండు సామాగ్రిని పూనుగొండప్రాంతానికి తరలించాలని నిర్ణయించ బడింది. పూనుగొండ ప్రజల సహాయం అర్థించడం జరిగింది. ఎంతో ఉత్సాహంతో 22 మంది వలంటీర్లుగా ముందుకువచ్చారు.

మందుగుండు సామాగ్రిని తరలించటం అతిప్రమాదకరమైన పని. ఒక మిలి టరీక్యాంపు దగ్గరనుండి పూనుగొండకు కావిళ్ళలోగాని, నెత్తిపైగాని మోసితేవాలి. త్రోవలో కామారంలో మరొక మిలిటరీ క్యాంపు వుంది. ఏమాత్రం అలికిడి తగిలినా మందుగుండు సామాగ్రి పోవటమే కాదు; 22 మంది కోయ వాలంటీర్లు ఆహుతై పోతారు. కాని ఆ వీరులు జంకలేదు. 4 రోజులలో 2 పర్యాయాలు తిరిగి ఆ మందు గుండు సామాగ్రినంతటినీ డైనమెట్లుతోసహా పూనుగొండ ప్రాంతానికి జేర్చటం జరిగింది ఏరియా కమిటీ స్వాధీనంలోవున్న తుపాకుల స్టాకునుకూడా వీరితోనే మోయించి, అదే ప్రాంతంలో భద్రంచేయడం జరిగింది.

కొంతకాలానికి మానుకోట ఏరియాకమిటీ కేంద్రం పూనుగొండప్రాంతంలో వున్నట్లు శత్రువు పసిగట్టాడు. కామారం క్యాంపు మిలిటరీ 5 రోజులలో 4 పర్యా యాలు పూనుగొండ గ్రామంపై దాడిచేసి ప్రజలపై అనేక అత్యాచారాలు గావించారు. కోళ్ళు, మేకలూ కొల్లగొట్టుకు పోయారు. అయినా కేంద్రం ఎక్కడ వున్నదో ఎవ్వరూ చెప్పలేదు.

4 వ దాడిలో మిలిటరీ విచక్షణా రహితంగా స్త్రీలను కూడా కొట్టటమే గాక సమ్మక్క అనే ఒక యువతిపై అత్యాచారం గావించారు. చివరకు ఆమె భయపడి, తనకు తెలియదనీ, పెణకి సమ్మయ్య అనే అతనికి తెలియవచ్చుననీ చెప్పింది మిలిటరీ పెణకి సమ్మయ్యను పట్టుకొని గొడ్డును బాదినట్లు బాదారు. చివరకాతడు తనకు తెలియ దనీ, ఒక మడుగువద్ద వుంటారని జనం అనుకొంటూ వుంటారనీ, ఆ మడుగు దగ్గరకు తీసుకుపోతాననీ అన్నాడు.

మిటలిరీ గ్రామం మీద దాడి చేయగానే, పాలకై రోజూ వూరిలోకి

వచ్చే దళ సభ్యులను వూరిలోకి రావద్దని ప్రజలు కబురు పంపటం జరిగింది. కాబట్టి మేము వూరికి దూరంగా అడవిలో కూర్చొని చూస్తూ వుండటం జరిగింది. పాలతో ఒకరిని పంపి సమ్మక్కపై జరిగిన అత్యాచారాలను తెలియజేశారు. సమ్మయ్యతో మిలిటరీ మడుగుదగ్గరకు వస్తున్నట్లు తిరిగి కబురు పంపారు. వెంటనే కేంద్రానికి వెళ్ళ వున్న గుడిసెను తగులబెట్టి రికార్డునూ, సామగ్రినీ క్షేమంగా మరొక ప్రాంతానికి తర్లించడం జరిగింది.

మడుగు దగ్గరకు మిలిటరీ వచ్చుసరికి బూడిద, పొగ, ఇంకా పూర్తిగా ఆరిపోని కొరివులు మాత్రం కన్పడ్డాయి.

ఆగ్రహోదగ్రులైన మిలిటరీ సమ్మయ్యను గ్రామంలోకి ఈడ్చుకు వచ్చి ప్రజల సమక్షంలో అతనిని కాల్చివేశారు.

పెనక సమ్మయ్య కమ్యూనిస్టుపార్టీ సభ్యుడు, వలంటీరు. పార్టీ కేంద్రాన్ని కాపాడటంలో ఆ మహావీరుడు ప్రాణ బలిదానం గావించాడు.

సమ్మయ్యను హత్యచేసిన మరుక్షణం మిలిటరీ గ్రామంలోని ప్రతి యింటికీ చిచ్చుపెట్టింది. ఒక గంటలో సుమారు 100 యిండ్లకు పైగావున్న గ్రామం శ్మశాన వాటికగా తయారైంది.

పశువుల మందను తోలుకుపోయినట్లు పూనుగొండ ప్రజలనూ, వారి పశువులనూ మిలిటరీ 20 మైళ్ళ దూరానవున్న పాఖాల చెర్వువద్దకు తీసుకుపోయి, కాన్సెన్ట్రేషను క్యాంపును ఏర్పర్చింది.

అదే నేటి అశోక్‌నగరి.

సమ్మయ్య కాల్చివేయబడ్డాడు. గ్రామం భస్మీభూతం గావింపబడింది; తాము దూరప్రాంతాలకు కట్టుగుడ్డలతో తర్లించబడ్డారు. అయినా, ఒక వ్యక్తికూడా మందు గుండు, తుపాకుల ఆచూకీని మిలిటరీకి చెప్పలేదు, తాము నాశనమైనా తమకొక నూతన వెలుగును, కొత్త జీవితాన్ని చూపించిన కమ్యూనిస్టుపార్టీకి ద్రోహం చేయ దలచుకోలేదు.

ఆనాడు పట్టుబడి, ఒకలాఠీ మీదబడగానే బట్టలు తడుపుకొని రహస్య స్థావరాలన్నింటిని బయటపెట్టిన కొందరు నాయకులతో ఈనాడు పట్టుబడి, ఒక్క లాఠీ కూడా మీదపడకముందే రహస్య స్థావరాలను గూర్చి, రహస్య కార్యకలాపాల గూర్చి పోలీసులకు పేజీలకు పేజీలు రిపోర్టులు వ్రాసి ఇచ్చిన "విప్లవ" నాయకులతో ఆనాటి పూనుగొండ వీర ప్రజానీకాన్ని పోల్చిచూడండి.

ఉత్తర కుమారులొకరు, అభిమన్యు కుమారులొకరు :

ఈనాటికీ పూనుగొండ ప్రజలు మార్క్సిస్టు కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన సంఘటితమై పనిచేస్తూనే వున్నారు.

- నండూరి ప్రసాదరావు



11

# తెలంగాణా సాయుధ పోరాటంలో మహిళల మహోన్నతమైన పాత్ర

నేనూ, నలుగురుదళ సభ్యులం కలసి అడవిలోకి వెళ్ళిన ప్రారంభ దినాలవి. గ్రామాలలో, ప్రజలతో సంబంధం పెట్టుకో వలసిందిగా పార్టీ మాకు ఆదేశాన్నిచ్చింది.

ఐతే ఏ ఊరు వెళ్ళాలి ముందు, ప్రజలను యెలా కలుసుకోవాలి అని ఆలోచిస్తూ ప్రయాణం సాగించాం. మేము వెడుతున్న దారిలోనే కొంతమంది ప్రజలు బుట్టలు, అంబలి పోసుకునే బుర్రలు చంకనేసుకొని విప్పపువ్వు ఏరుకొనేదానికి వస్తున్నారు. వాళ్ళు మమ్ము చూచి, బెదురు బెదురుగా వాళ్ళభాషలో కీసరబాసరగా మాట్లాడుకొంటూ పరుగెత్తడం ప్రారంభించేరు. వాళ్ళ పరుగు చూసి పోలీసులు వస్తున్నారా అని పరికించాం కానీ వారు మమ్ము చూసే పరుగెత్తుతున్నారని గమనించేం.

ఎందుకంటే, అదివరకే ఒకటి రెండు దళాలు ప్రజలను కలుసుకునేందుకు

వెళితే ప్రజలు దగ్గరకు రాకుండా బెదిరిపోయారని తెలిసింది. ప్రజలలో దళాలంటే చంపుతారనీ, దోచుకుంటారని శత్రువులు విపరీత ప్రచారంచేశారని తెలిసింది. 'ఎలాగైనా వీళ్ళని కలుసుకోవాలి కామ్రేడ్' అన్నాను. మాలో ఒకరు "ఓ అన్నా! ఓ దొరపట్టపన్నా! (కోయలను గౌరవంగా అలా పిలుస్తారు) మేము మీవాళ్ళమే ఆగండి" అని కేకలు వేశాడు. కానీ వాళ్ళు పరుగెత్తుతూనేవున్నారు. నేను "ఓ సమ్మక్కా! సైదక్కా! ఆగురల్లా!" అన్నాను. "దూపబౌతుంది. అంబలి పోయరల్లా!" అన్నాను. స్త్రీగొంతు విన్న ఆ స్త్రీలు వెనుదిరిగి చూశారు, ఆగారు. ఎలాగైతేనేం వాళ్ళను కలుసుకున్నాం. అంబలిబుర్ర చూపిస్తూ పోయమన్నాను. నువ్వంటే నువ్వు అనుకుంటూ ఒకామె అంబలిపోసింది. ఆమె దృఢంగా, ఎర్రగా, ఎత్తుగావున్నది. ఇలాంటివాళ్ళు దళాలతో చేరితే, ఎంతబాగుండును అనిపించింది. అంతా ఒకచోట జేరాం. నేను వాళ్ళతో ఇలా అన్నాను :

"అడవి సంపదంతా మీరే అనుభవించాలి. ఈ అడవి చౌకీదారులను గూడేల నుండి తరిమివేయండి. పన్నులు కట్టవద్దు. కాయలు, గడ్డలు స్వేచ్ఛగా ఏరుకోండి. తునికాకులు మీరే కోసుకొని బొగ్గుట్ట, ఇల్లెందులలో అమ్ముకోండి. కంట్రాక్టర్లనువెళ్ళ గొట్టండి.ఇలా మీరుచేయగలిగితే ఆకలితోమాడవలసిన పనిలేదు.చూడండి,మీ ఒంటిపై గుడ్డ పీలికలు కనీసం శరీరం సాంతం కప్పుకొనేందుకైనా చాలకుండా వున్నాయి. చలికి, ఎండకి, వానకి గురియై బాధపడటం వుండదు" అని చెబుతుండగా ఒక అతను "పౌజుని రాజు తోలడా?" అని అడిగాడు. "నిజమే తోలుతాడు ఈ అడవిలోకి పౌజు (పోలీసు) రావడం అంత తేలికకాదు. మీరంతా ఒకటిగా వుండి, సంఘంలో చేరి, దళాలతో కల్సి పోరాడి వారిని ఎదుర్కొనవచ్చు. స్వేచ్ఛగా బ్రతకవచ్చు" అనే మాటలు భయపడే ఆ ప్రజలు విన్న తర్వాత వారిలో ఉత్సాహం కనబడింది.

"మీ గూడెం వస్తాం. మీరా గూడెం వాళ్ళను అందరినీ కూడ గడతారా?" అన్నాం. వాళ్ళు "మీరు రావద్దు; మేము వెళ్ళి గూడెం దొరకు చెబుతాం. ఆయన ఎట్లా సెపితే అట్లా సేద్దాం" అన్నారు. "ఎల్లుండి ఇక్కడే కలుసుకుందాం" అని చెప్పి ఎవరిదారిన వారిమి వాళ్ళిపోయాం.

సాయంత్రానికి మరొక గూడెం దగ్గరకు చేరాం. మాలో ఒకరు వెళ్ళి శత్రువుల ఏజెంట్లు ఎవరైనా వున్నారేమోనని తెలుసుకొనివచ్చారు. ఎవరూ లేరని తెలిసి అందరం వూళ్ళోకి వెళ్ళాం. ఎదురైన వాళ్ళనందరినీ పలకరిస్తూవున్నాం. కానీ ఎవరూ మాట్లాడటం లేదు. అడుగగా అడుగగా కుల పెద్ద ఇల్లు చూపెట్టారు. ఆయనతో మాట్లాడాం. అందరినీ కూడగట్టమన్నాం. ఆ కుల పెద్ద గూడెంలో ఎవరూ లేరని అబద్ధమాడాడు. నేను స్త్రీలనైనా కొద్ది మందిని కూడగట్టితే మాట్లాడి వెళ్ళిపోతామనీ, మాకు బాగా ఆకలిగా వుంది తింటానికి ఏమైనా పెట్టమనీ ఆ పెద్ద నడిగాను. ఆ కులపెద్ద ఇంటిలోపలకెళ్ళి మొక్కజొన్న పేలాలు, ఇద్దరు స్త్రీలను కూడా తీసుకువచ్చాడు. ఆ స్త్రీలతో మమ్మల్ని చూసి భయపడవద్దని చెప్పి, చాలా

విషయాలు వారికి వివరించాను. ఇదే పద్ధతిని మూడు గూడేలు తిరిగి మొదటివాళ్ళను కలుసుకున్న ప్రదేశానికి చేరాం. అక్కడవాళ్ళు విప్పపువ్వు ఏరుకుంటున్నారు. వాళ్ళను "మీ కులపెద్ద ఏమన్నాడు?" అని అడిగాం. "మా కులపెద్ద 'చీకటి దొరలువస్తే ఫౌజు (మిలిటరీ) వచ్చి బాధలు పెడతారు. వాళ్ళను కలవొద్ద'న్నాడని చెప్పారు అందులో ఒకామె ముందుకొచ్చి "నీవు అప్పుడు 'సమ్మక్కా' అని కేకపెట్టావు. నా పేరు నీకేం ఎరికే" అని అడిగింది. (నిజంగా నాకు ఆమె పేరు తెలిసికాదు సామాన్యంగా వాళ్ళ పేర్లు అవి అని కేకేశాను అంతే.) "మేము మీ చుట్టాలం. అందుకే మీ పేరు తెలుసు కోగలం" అన్నాను. ఆమె ఎంతో సంతోషించింది. అనేకం వాళ్ళ విషయాలు ఇతర గూడెంల విషయాలు చెప్పింది.

ప్రక్కవూరిలో పెద్ద భూస్వామి వున్నాడనీ, వడ్డీలు లెస్స గుంజుతున్నాడనీ మేము పండించిన ధాన్యం అంతా ఆయన నాగులకే పోతుందనీ, కోళ్ళు, ఆవులు, నజరానాలు పంపాలనీ, జవానులు వసూళ్ళ కొచ్చినప్పుడు అన్నీ దోచుకపోతారనీ, అవ్వా పీడిపీడ వదిలితే దాగుండునని ఆ పదిమంది స్త్రీలు చెప్పారు.

"మీ సమస్యలు పరిష్కరించడానికే సంఘం, దళం వున్నది మీ కోర్కెలు తీరాలంటే మీరు చాలా చెయ్యాలి. మీ వూరి వారికి నచ్చజెప్పండి. మేము ప్రక్క గ్రామములో ఆడోళ్ళనుకూడా కలుసుకున్నామని, నేను వారిపేర్లు చెప్పాను. వాళ్ళు సంతోషంతో 'అళ్లు మా చుట్టాలే' అన్నారు. వాళ్ళలో కొంతమంది స్త్రీలు మరింత సన్నిహితంగా వచ్చారు. ఉత్సాహం వెలిబుచ్చారు.

తర్వాత వీళ్ళను మరల కలుసుకున్నాను. పూర్వం వచ్చిన వాళ్ళంతా లేరు గాని సమ్మక్క ఆమెవెంట మరో వూరిలో కలిసిన ఇద్దరు యువతులు, వీరుగాక మరికొత్తగా నలుగురు స్త్రీలు వచ్చారు. వాళ్ళు చొరవతో చాలా విషయాలు చెప్పారు. వాళ్ళను పీడించి ఎలా దోపిడీ చేస్తుందీ, రోజంతా కష్టపడినా కడుపు నిండని స్థితిని గురించీ వివరించారు. వాళ్ళవాళ్ళ గూడెంవాళ్ళకు నచ్చజెప్పామనీ వాళ్ళ గూడెం వాళ్ళ నందరినీ ప్రక్క అడవిలోకి తోలుకొస్తామని, మీరు వచ్చి మాట్లాడమనీ చెప్పారు. ఆ మాటలు విన్న నాకు ఆశ్చర్యం కలిగింది. ఎందుకంటే వాళ్ళను గురించి నాకు అంత అంచనా లేదు.

ఎప్పుడు వస్తామో వారికి చెప్పాము నా దగ్గరన్న తుపాకీ వారుత్సాహంగా చూస్తూ ఈ బందూకులు (తుపాకులు) చాలా వున్నాయా? అన్నారు. ఉన్నాయన్నాను. వాళ్ళ పేర్లు సమ్మక్క, ఆదెమ్మ, పాపక్క అని తెలుసుకున్నాను మరికొందరి పేర్లు ఇప్పుడు నాకు గుర్తులేదు.

వాళ్ళు చెప్పినప్రకారం తగిన రక్షణ ఏర్పాట్లతో గూడేలన్నిటా మీటింగులు జరిపాం. వాళ్ళలో ఒక ఆచారం వుంది. కులపెద్ద చెప్పినమాట జనం జవదాటరాదు. అలాగే జనం గూడెం మధ్యచేరినిర్ణయించినదాన్ని ఆ కులపెద్దజవదాటరాదు. అందరూ సమావేశాలలో పాల్గొన్నారు. ఎంతో ఉత్సాహపడ్డారు. ఫారెస్టు చౌకీదారులు పెట్టే

బాధలు ,ప్రభుత్వ జవానులు పెట్టే హింసలు, భూస్వాముల దౌర్జన్యం, రౌడీయిజం, దుండగాలు అన్నీ వివరించేరు.

మేము మీరంతా ముందుకువస్తే శిక్షణయిస్తామనీ, మేమే అండగా నిలబడతామనీ, అందరం కలిసి శత్రువులను పారద్రోలి మనబాధలు విరగడ చేసుకుందామని, హాయిగా, స్వేచ్ఛగా జీవించవచ్చనీ చెప్పాం.

మనదళాలు అడవిచేరిన సడి విని ప్రభుత్వ ఏజంట్లు, భూస్వాములు వాళ్ళ వాళ్ళ జాగ్రత్తలు ప్రారంభించారు. ఇదేగాక పాతబాకీలు బెదిరించి-అదిరించి వసూలు చేస్తున్నారు. అడగకుండానే కోళ్ళను, గొర్రెలను తోలుకుపోయేవారు. ఈ పరిస్థితి ప్రజలలో భయాందోళన కలుగజేసింది.

ఈ పరిస్థితినిబట్టి ప్రభుత్వ ఏజంట్లను ఊళ్ళు విడిచిపొమ్మని నోటీసులు అంటించాలని 'అనంతరం' భూస్వామి ఇంటిపై దాడిచేసి ధాన్యాన్ని ప్రజలకు పంచాలని పార్టీ కమిటీముందు సూచనపెట్టాం.

ఇపుడీ చర్యలు సాగిస్తే శత్రువు నిర్బంధ విధానం ఎక్కువ చేస్తాడని' మైదాన ప్రాంతాలనుండి వచ్చిన దళాలకు రక్షణ కష్టమని కమిటీలో కొందరు అభిప్రాయాలు వెల్లడించారు.

మేము ప్రజల సమస్యల విషయంలో వాళ్ళ బాధల, ఇబ్బందుల విషయంలో మనం పట్టించుకోకుండా ఆలస్యం చేస్తే ప్రజలు ఈ ఉద్యమం విషయంలో ఆసక్తి కోల్పోతారని, తొందరపడాలని పట్టుబట్టాం. ఎలాగైతేనేం ఈ రెండు కార్యక్రమాలకి పార్టీ అనుమతి పొందాం.

నోటీసుల కాపీలు20తయారుచేశాం.అనంతరం దాడి తేదీకూడా నిర్ణయించాం. నోటీసులు తీసుకుని కోయ యువకులతో రాత్రులకు రాత్రే 15 గూడేలలో నోటీసులు అంటించివచ్చాం. అనంతరం పంపక విషయంకూడా చెవులలో గూడేల ప్రజలకు వూదివచ్చాం.

ఇంకా కొందరు యువకులను తీసికొని 'లవ్వాల' గుట్టలలో మకాం పెట్టాం. శిక్షణ ప్రారంభించాం.

ఉదయం లేవగానే కమాండర్ 'వన్' – 'టూ' అంటూ శిక్షణ ప్రారంభించేడు. శిక్షణలో తయారవుతున్న యువకులను చూస్తుంటే నాకు బలే ఆలోచన వచ్చింది. అరే ! వాళ్ళను సమీకరించడానికి ఆనాటి స్త్రీలే ఆధారం కదా ! ఆరోజు సమ్మక్క అడిగిందికూడా, 'బందూకులు మాకిస్తారా ?' అని. అయినప్పటికీ వారిని ఈ శిక్షణకు పిలవలేదు, ఆడవాళ్లు ఎంతపని చేసినా వెనుకేనా అనిపించి, ఏమైనాసరే వాళ్ళను కలుసుకొని ఈసారి శిక్షణలో సిద్ధపడిన స్త్రీలందరికీ శిక్షణ యివ్వాలని నిర్ణయించుకున్నాను.

నోటీసులు శత్రువులలో చాలా సంచలనాన్ని కలిగించాయి. ప్రభుత్వ

[illegible]
గోడులతో మొరపెట్టుకొన్నారు ప్రభుత్వం వారికి హామీ ఇవ్వలేకపోయింది.

పోలీసు చర్య అనంతరం కొద్ది కాలానికే మైదాన ప్రాంతాల ప్రజలపై క్రూర నిర్బంధ రాక్షసకాండ సాగిస్తూ శక్తినంతా అక్కడే కేంద్రీకరించడంవల్ల ఈ చౌకీదార్లకు ప్రభుత్వం రక్షణ కల్పించలేకపోయింది.

ఇక గత్యంతరం లేక ప్రభుత్వ ఏజెంట్లు మూటాముల్లె కట్టుకొని ప్రజలకు మర్యాదగా చెప్పి వెళ్ళిపోవటకు సిద్ధమయ్యారు. ఇదే సమయంలో అనంతారం భూస్వామి కూడా వూరునుండి పారిపోయాడు

మనం నోటీసులు అందించింది 15 గ్రామాలలో. వాళ్ళు పారిపోయింది 30 గ్రామాలనుండి. మనకో సంబంధంలేని ప్రజలు 'ఏమిటి, వెళ్ళిపోతున్నారా?' అని చౌకీదారులను అడిగారు. చౌకీదారులు "మమ్మ సర్కారువాళ్ళు పిలిపిస్తే పోతున్నా" మన్నారు. 'మరల ఎప్పుడొస్తారు?' అని ప్రజలు అడిగితే 'ఇంకేమివస్తాం, కమ్యూనిస్టులు వస్తున్నారు' అని చెప్పేవారు.

ప్రజలు భలే సంతోషించారు. చీకటి అన్నల (మన దళాలను అలా పిలిచే వారు) పుణ్యమా అంటూ ఈ దుర్మార్గులపీడ వదిలిందని ఆనందంతో దళాలకోసం ప్రజలు వెతకనారంభించారు. కమ్యూనిస్టులయెడ ప్రజల ప్రేమాభిమానాలు పెంపొంద సాగాయి. అనంతరం వంపకానికి గూడెం గూడెంకి ప్రచారం సాగించబడింది.

ఒకరోజు తెల్లవారుఝాము 4 గంటలకు అనంతారం వూరికి నాలుగుప్రక్కల దారులు కాపలా వేశాయి దళాలు. భూస్వామి ఇంటిచుట్టూ నిఘా వేశారు. తెల్లవారేసరికి ఒక్కొక్క గూడెం నుండి గుంపులు గుంపులు జనం చేరుకున్నారు. 8 గంటలకన్నా మొదట 6 గూడేల వాళ్ళు చేరుకున్నారు.

నా కళ్లు మొదట స్త్రీలకోసం వెదికాయి. కాని ఆ జనంలో గుర్తించలేక అరుగుఎక్కి 'సమ్మక్కా' అని కేకపెట్టాను. సమ్మక్క మందిలో నుండి దూసుకవచ్చి అరుగెక్కి నా భుజంపై తలవాల్చింది. (అది మర్యాద-వాళ్ళ ఆచారం)

దోచుకున్న వారి సంపద వారికే దక్కుతుంది అని బంగారు ఆలోచనలతో నిండివున్న జనం ఇదిచూసి ఉప్పొంగిపోయి 'జై' అన్నారు. అనేకమంది స్త్రీలు సమ్మక్క, రాజమ్మ దగ్గరకు పరుగెత్తి కౌగలించుకొన్నారు. ఇంతలోనే తుపాకీ ఎవరో తాకుతున్నట్లు అనిపించి ఒక్కసారి వెనుదిరిగాను. ఆ స్త్రీ గుంపులోకి పారిపోయింది. ఎవరు సమ్మక్కా ఆమె అన్నాను. సమ్మక్క గుంపులోనుండి ఆమెను తీసుకవచ్చి నాముందు నిలబెట్టింది. ఎవరు నువ్వు అన్నాను. ఆమె ధైర్యంగా "నాపేరు వెంకటమ్మ గూడెం 'లింగాల' నేనూ మీతోవస్తా"నంది. నాకు చాలా ఆనందం కలిగింది ఆమెను చూస్తుంటే.

కమాండర్ కార్యక్రమం ప్రారంభిస్తున్నామని ప్రజలకు ప్రకటించాడు.

ప్రజలు ఎలా పాల్గొనాలో వివరించాడు. ధాన్యం, మొక్కజొన్నలు, చిక్కుడు గింజలు ఉన్నవన్నీ సమంగా పంచుకోవాలన్నాడు.

సమ్మక్క, వెంకటమ్మ నాయకత్వాన 10 మంది స్త్రీలు, పోచయ్య నాయకత్వాన 20మంది యువకులు ఖాస్వామి ఇంటిలో ప్రవేశించారు. సామానంతా బయట వేశారు. ధాన్యం బస్తాలు బయటికి దొర్లించారు. చీరెలు, నగలు, వస్తువులు బయటకు తెచ్చారు. కొన్ని కాగితాలు కూడా తెచ్చారు.

కులపెద్దలు చెప్పినప్రకారం ముందు ధాన్యం అందరికీ పంచటం జరిగింది. వెనుకవచ్చిన జనానికి-ధాన్యం అందనివారికి చీరెలు, వస్తువులు పంచారు. తాకట్టు కాగితాలప్రకారం నగలు ఎవరివి వారికియిచ్చారు. ఒకబస్తా బియ్యం, ఒకపప్పుడిజాడీ దళానికి వుంచామని ప్రజలలో ప్రకటించారు. ఆనాటి భోజనానికిగాను చిక్కుడుగింజలు కొన్ని ఉడకబెట్టమని వెంకటమ్మకు చెప్పారు.

కొన్ని గూడేలనుండి జనం ఇంకావచ్చారు. వారికి పంచడానికి ఏమీలేవు. అందుకని దళానికని వుంచుకున్న బస్తాబియ్యం కూడా అందరినీ పంచుకోమన్నాము.

జనం ఆనందంతో ఉత్సాహంగా ఉన్నారు. వెంకటమ్మ పరుగెత్తుకొచ్చి అరుగు ఎక్కి "చీకటి అన్నలజాడ ఎవరికీ చెప్పొద్దు. పోలీసోళ్ళకు లొంగొద్దు. ఆడోళ్ళు గూడా దళాల్లోకి పోవాలి" అని చెప్పింది.

ఇంతలో కమాండరు విజిలు వేశాడు. దళ సభ్యులంతా అనుకున్న ప్రదేశానికి కదలిపోయారు. వారితో కొంతమంది యువకులు అనుసరించారు.

మాతో వచ్చిన యువకులను కూర్చోబెట్టాం. ఎంతమంది మిలిటెంట్సు శిక్షణకు వస్తారో పేర్లు తీసుకొని వాళ్ళనందరినీ ఫలానా చోటికి చేర్చమని కార్యక్రమమిచ్చి దళాన్ని వాళ్ళవెంట పంపించాం.

ప్రజలు అడవి సంపదను స్వేచ్ఛగా అనుభవిస్తున్నారు. దళాలు రాత్రిపగలు లేకుండా సంచరిస్తున్నాయి. ఉన్న రోడ్ల మార్గాలు ధ్వంసం చేస్తున్నారు. అర్గనైజర్లు గూడెంలను ఆగమేఘాలతో అందుకుంటున్నారు గూడెంలలో నున్న యువతీయువకులు వలంటీర్లుగా చేరి శిక్షణ పొందుతున్నారు. సమ్మక్క, వెంకటమ్మ నాయకత్వాన 15 మంది స్త్రీలు కూడా శిక్షణ పొందుతున్నారు.

అడవిలో పనులకై వెళ్ళిన జనం వింతగా గంటలు గంటలు ఈ విన్యాసాలు చూస్తున్నారు. ఇళ్ళకు వెళ్ళి కథలు కథలుగా చెప్పుకోసాగారు.

ఒకసారి తుపాకుల్లాగా కర్రలు చంకనేసి కమాండరు శిక్షణా దళాన్ని పాకిస్తున్నాడు. ఒక వరుస అందరూ పాకిన తరువాత మరల రెండవసారి పాకించప్రారంభించాడు. సమ్మక్క రెండవసారి రొప్పుతూ ఆగిపోయింది. కమాండరు "సమ్మక్కా పాకు" అని గర్జించాడు. సమ్మక్క మారు పలకకుండా కూలబడింది దగ్గరకు వెళ్ళి నెమ్మదిగా అడిగాను. ఆమె తలవంచి కడుపువైపుకు చూపిస్తూ 'మావ-మావ' అంది.

అయ్యో! ఈ ఉద్యమానికి పునాదిరాయిలాంటి సమ్మక్కా ఒక దళాన్ని

నడపగలిగే కమాండరు కావాలనే నీఆకాంక్ష నెరవేరలేదుకదా అనిబాధపడ్డాను. ఆమెను విశ్రాంతి తీసుకోమని-దిగులుపడకు నీవు చేయాల్సిన పనులు చాలా వున్నాయి. అని ఉత్సాహపరిచాను. మర్నాడు గూడెం వెళ్ళడానికి సమ్మక్క సిద్ధపడుతుంటే తోటి స్త్రీలు కూడా వాపోయారు.

"అందర్నీ కూర్చోబెట్టి అన్నినిబంధనలు ముందే చెప్పాంగదా మీరు ముందు ఎందుకు చెప్పలేదు" అని అడిగాను. వాళ్లు దళంలో చేర్చుకోరేమో అని భయపడి చెప్ప లేమ అన్నారు. వాళ్ళు ఆ మాట అనగానే నాకు మైదాన ప్రాంతంలో జరిగిన ఒక ఘటన మనసులో మెదిలింది.

మైదాన ప్రాంతంలో ఒకామె 3 నెలల గర్భిణితో దళాలలో చేరింది. ఈ సంగతి ఎవరికీ తెలియదు. మూడు రోజుల శిక్షణ తరువాత ఒకరోజు పరుగెత్తడం, రెండవ రోజు ఎత్తు ఎగరడం (హైజంప్) శిక్షణ ఇస్తున్నారు. శతృవులు వెంబడిస్తే మనం పరుగెత్తేటప్పుడు గోడలు అడ్డువచ్చినా ఎత్తు ఎగిరి గోడలపైనుండి తప్పించు కొనే పద్ధతి శిక్షణ ఇస్తున్నారు. ఇసుకవాగు. యువతీయువకులు ఎత్తు దూకుతున్నారు. ఆమె మూడుసార్లు దూకింది. నాలుగవసారి 'అమ్మా' అని కూలబడింది. గర్భస్రావం జరగడం రక్తం పోవడం ప్రారంభించింది. ఆమెను నేలజోలె కట్టి దళ సభ్యులం మోశాం. డాక్టర్ రామదాసుగారి చికిత్సతో కోలుకుంది నెమ్మదిగా.

ఈ ఘటన జరిగిన వెంటనే దళ నాయకులంతా మాపై విరుచుకుపడ్డారు. స్త్రీలకు సహజంగా యిలాంటి ప్రమాదాలు వస్తాయి. కనుక స్త్రీలు దళాలలో పనిచేయ రాదు. నర్సులుగా, వార్తాహరులుగా, ప్రచారకులుగా వుండిపోవాలన్న నిబంధనలు పలుకసాగారు.

వారి వాదనలు బాధ కలిగించాయి, తర్వాత చరిత్రలో ఈ నిబంధనలు పనికి రావని స్త్రీలు రుజువు చేశారు.

మరికొన్ని రోజుల తర్వాత సమ్మక్క, ఆదెమ్మ, వెంకటమ్మల నాయకత్వాన అనేక దఫాలుగా మొత్తం 40 మంది స్త్రీలు దళ శిక్షణ పొందారు.

వెంకటమ్మ ఇంటికివెళ్ళి భర్తను సమ్మతింపజేసి ప్రాంతీయ దళాలలో చేరా లని నిశ్చయించాం.

వెంకటమ్మ ఇంటికిపోయి దళాలలో చేరుతానని చెప్పింది. భర్త మండిపడి కొట్టడానికి తయారయ్యాడు. వెంకటమ్మ "నీకు ఇంకా ముగ్గురుపెళ్ళాలున్నారుగా, వాళ్ళతో కులుకు. నేనుమాత్రం దళాలలో చేరాల్సిందేనని ఇంటినుండి పరుగుతీసింది. అంతే; మళ్ళీ ఇంటిముఖం చూడలేదు.

అడవిలో కామ్రేడ్స్‌ను కల్సుకొని విషయం చెప్పి దళంలో చేరతానంది. ప్రాంతీయదళ నాయకులు ఆమెను దళసభ్యురాలుగా చేర్చుకోడానికి వెనకాడారు. ఎందుకంటే ఇలా చేర్చుకుంటే శత్రువులు 'అడవాళ్ళను ఎత్తుకుపోయా'రని ప్రచారం చేస్తారేమోనన్న ఆలోచనలో పడ్డారు. వెంకటమ్మ ఏమైనా సరే నేను వెనుకకువెళ్ళేది

లేపని పట్టుబట్టింది. "మొగాళ్ళంతా ఆడాళ్ళను చెప్పివస్తున్నారా?" అని ప్రశ్నించింది. "మీరు భయపడకండి, నా మొగుడు నా సంగతి పట్టించుకోడులే" అంది.

అప్పనిసర్రైన వెంకటమ్మను ప్రాంతీయదళంలో సభ్యురాలుగా చేర్చుకున్నారు. ఆమె శత్రువుపై చేసే దాడుల సమయంలో ఎంతో చాకచక్యంగా నేర్పుతో బాధ్యతలు నిర్వహించేది. ఆమె పోరాట వదును, చౌరవ వల్లనక కమాండరుగా ఎన్నుకోబడింది.

# నాగమ్మ చరిత్ర

నాగమ్మ భర్తతో సహా దళంలో చేరింది. నాగమ్మ సూటిగా తుపాకి కాల్చడంలో ఆరితేరింది. నాగమ్మకి పాపం ఒక యిబ్బంది వుంది ఆమె చాలా పొట్టిమనిషి. తుపాకి అందరిలాగా చంకన వేసుకోడానికి వీలుండేది కాదు. తుపాకి భుజంపై పెట్టుకొని మోయవలసివచ్చేది. అది ప్రమాదమని ఈమెను కొరియరుగా పనిచేయమని నిర్ణయించారు. ఈ నిర్ణయాన్ని ఎదిరించి పోరాడింది. ఆఖరికి పార్టీ శిక్షణను అమలు జరపాలని బాధతోనే అంగీకరించింది. వార్తలు తేవడంతోపాటు కొన్ని దాడులలో ఈమె చాకచక్యంగా, సాహసంగా, నిర్ణయాత్మక పాత్ర నిర్వహించుతూ వుండేది.

ఒకరోజు మధ్యాహ్నం వెళ్ళి 5గురు పోలీసులు, ఇద్దరు చాకీదార్ల ప్రక్క గూడెంకు వస్తున్నారన్న వార్త తెచ్చింది.

ఎచ్చట దళం మాటు కాయాలో నిర్ణయించుకున్నారు. ఎవరి స్థానాలలోవారు నిర్ణయం ప్రకారం సిద్ధంగా వున్నారు. ఈమె చివరి కామ్రేడ్ వద్ద ప్రేక్షకురాలుగా నిరాయుధురాలుగా నిలబడి వుంది.

మొదట కమాండరు (ఒకరికొకరు కనబడకుండా దూరందూరంగా నిర్ణయించిన స్థానాలలో వున్నారు.) పోలీసులు వద్దకురాగానే మొట్టమొదట తుపాకి పేల్చాలి. ఆ ధ్వని విని దళసభ్యులంతా అదే ఆజ్ఞగా అనుకొన్న ప్రకారం తుపాకులు పేల్చాలి. వారిని దెబ్బతీసి ఆయుధాలు సంపాయించాలని ప్లాను. అనుకొన్నట్లుగానే శత్రువులు ఆ స్థలం మధ్యకు వచ్చేస్తున్నారు. కమాండరు తుపాకి చెడిపోయింది. ఆది మిగతావారికి తెలియదు దళ సభ్యులంతా కమాండరు ఎందుకు తుపాకి కాల్చలేదని ఆతురతతో ఆజ్ఞకోసం ఎదురుచూస్తున్నారు. ఆవేదనతో నాగమ్మ శత్రువులు దాటి పోయేట్టున్నారని ప్రక్క కామ్రేడ్‌ని తుపాకి ప్రేల్చమంది. ఆ కామ్రేడ్ కమాండర్ ఆజ్ఞలేనిదే కాల్చేదెలాగా అన్న సందేహం వెలిబుచ్చాడు. ఇక లాభంలేదని నాగమ్మ ఆ కామ్రేడ్ వద్ద నున్న తుపాకీ అందుకుని పరుగులంకించుకుని ప్రక్కనున్న శత్రువుల కంటే ముందువెళ్ళి ఎదురుగామాటువేసి వాళ్ళు దగ్గరకు రాగానే గురిచూసి ప్రేల్చింది. యీ ధ్వని విని దళసభ్యులంతా అన్నివైపుల నుండి తుపాకులు ప్రేల్చారు. దళకమాండర్ తుపాకీ బాగుచేసుకొని ఆనందంతో సింహగర్జన చేస్తూ వెనకనుండి కాల్పులు సాగించాడు. నాగమ్మ తుపాకిదెబ్బకే పోలీసు పడి చచ్చిపోయాడు. అందరికీ

గాయాలు తగిలాయి. తుపాకులు విడిచి పోలీసులు పారిపోయారు. కొంత టైము వేచి వుండి శత్రువులు పోయారని నమ్మకం కలిగిన తరువాత నాగమ్మ పరుగెత్తి ఆయుధాలు చంకనబెట్టుకొని కమాండర్‌కు అందించింది. కమాండర్, దళ సభ్యుల ఆనందం చెప్పనలవికాదు. నాగమ్మను ప్రాంతీయ దళ ఉప కమాండరుగా ఎన్నుకున్నారు. నాగమ్మ ఉప్పొంగిపోయింది.

## ఆదెమ్మ

ఆదెమ్మ మాటకారి. ఈమెను గూడెంలో జనాన్ని కదిలించే కార్యక్రమాలకు ఆర్గనైజర్‌గా నియమించారు. ఈమె కృషి ఫలితంగా స్త్రీ, పురుషులు ఉత్సాహంగా బ్యాచీలు, బ్యాచీలుగా వస్తున్నారు.

ఆదెమ్మ దళాల లోనికి యువతీయువకులను పంపటమేగాక ప్రజలకు అనేక విధాల ట్రైనింగు ఇచ్చింది. శత్రువులను తప్పుదారులు పట్టించడం, పోలీసులు ప్రజలపై దాడులు చేసినప్పుడు ప్రతిఘటించడం, దళాలకు వార్తలు అందించడం, ఆహారం చేరవేయడం, రహస్య స్థలాలను కాపాడటం మొదలగునవి ఎంతో నేర్పుతో ప్రజలను వెంటేసుకుని చేసేది. అంతేగాక భూమిదున్నే కార్యక్రమం ప్రజలు చేపట్టిన సందర్భంలోకూడా ఆమె పాత్ర యెంతో వుంది. పాపమ్మ, అలాగే అనేకమంది స్త్రీలు దాడుల్లో చేరి, అనేక దాడులలో, పోరాటాలలో యెంతో నేర్పుగా వారి బాధ్యతలు నిర్వహించారు.

ఈదళలో స్థానికంగావున్న స్త్రీలుకూడా ఎంతో చాకచక్యంగా నేర్పుతో బాధ్యతలు నిర్వహించేవారు. అన్నాలు చేరవేయడం, అడవులలోవున్న దళాలకు బస్తీలనుండి వార్తలు అందించడం– పోలీసులు ఒంటరిగా వెళుతుంటే స్త్రీలు గుంపుగా వాళ్ళపైబడి తుపాకులు గుంజుకొని దళాలకు అందించిన ఘటనలు కూడా వున్నాయి.

## సమ్మక్క

ఆ ఊరువారు ఆ రోజు అడవిలో పనికిపోయారు. ఆ ఊరు రావాలంటే గుట్టయెక్కి రెండు గుట్టలమధ్య ఇరుకుదారిగుండా గుట్టదిగి రావాలి. చౌకీదారులు, పన్నులు వసూలుచేసేవారు ఆ ఊరికి పోతున్నారు. వాళ్లు ఈ గుట్ట యెక్కకముందే సమ్మక్క మరికొందరు వాళ్ళను చూశారు. చౌకీదారులు మొత్తం నలుగురే వున్నారు. మంచి ఛాన్సు. తుపాకీ గుంజుకోవాలన్నారు. చౌకీదారులకంటే ముందే గుట్ట యెక్కి ఇరుకుదారిలో సమ్మక్క వాళ్లు మాటువేశారు. వాళ్లు ఇరుకుదారిలోకి రాగానే వారిపై ఒక్కసారిగా బండలు తోశారు. చెట్లపై నుండి కొంతమంది రాళ్ళవర్షం కురిపించారు. దీనితో వాళ్లు గాబరా పడి దెబ్బలు తిని 'బందూకుఇస్తాం, మమ్మ వదలండి అని కేకలు వేశారు. సమ్మక్క ప్రక్కనున్న చెట్టుకు తుపాకి తగిలించి చేతులెత్తమంది చౌకీదార్లు

అలాగే చేశారు. సమ్మక్క మూతా అంతా వారిదగ్గరకెళ్ళి తుపాకి తీసుకొని వాళ్ళను గుంజీళ్ళు తీయించి, అనేక బాధలు పెట్టి ఈ విషయం యెక్కడయినా చెప్పారా మీ ప్రాణాలు దక్కవని బెదిరించింది. వాళ్లు చెప్పం అన్నారు. ఆ తర్వాత చెప్పలేదు. తుపాకి దళానికి అందించేరు.

ప్రజలు భూమి దున్నుకునే కార్యక్రమం విరివిగా చేబట్టారు. ఇపుడు అడవికి హద్దులులేవు. వాళ్ళకు ఇష్టమైన మంచి భూమిని చదునుచేసి పంటలు పండించారు. ఈ కార్యక్రమం ప్రజలను వూపివేసింది. ప్రజలు ఒక పంటను పండించుకొని అనుభవించారు. మొక్కజొన్న బాగా పండింది. చిన్న చిన్న వాగుల దగ్గర వరి కూడా పండించే పద్ధతి ప్రవేశపెట్టారు. ప్రజలలో ఇక తిండికి మాడవల్సిన అవసరం వుండదనే విశ్వాసం పెరిగింది.

1950 ప్రారంభమైంది. అడవులలో ప్రవేశించి ప్రజలను అణచడానికి, దళాలను గాలించడం కోసం తీవ్ర ప్రయత్నాలు చేస్తున్నారు. రోడ్లపై లారీలను ఆపి, గూడెంలో వున్న జనాన్ని కొట్టి ఒకచోట చేర్చి అడవుల దారులను చూపించమని వేధించడం ప్రారంభించారు. ఆ సమయంలో ప్రజలు మిలిటరీకి బాగా బుద్ధి చెప్పారు. దళాలు కూడా దారులలోకాచి సైనికులను దారి చూపిస్తాం అని కీకారణ్యంలోకి తీసుకెళ్ళి అటూ ఇటూ చీకటిపడేదాకా తిప్పి రాత్రి అక్కడ వుండేలా చేసేవారు. ఆ రాత్రి అక్కడ మకాం చేయాల్సి వచ్చేది. మిలిటరీ ప్రాణాలు గుప్పెట్లో పెట్టుకొని క్షణమొక యుగంగా గడుపుతూ ఏ చెట్టు కదిలినా, దళాలు అని కాల్పులు చేసేవారు. ఒక్కొక్కసారి గుట్టలమధ్యకు మిలిటరీని తీసుకెళ్ళి దళాలకు అప్పజెప్పేవారు దళాలు మెరపు దాడిచేసి మిలిటరీని దెబ్బతీసేవి. దానితో సైనికులు భీతిల్లిపోయారు

ఈ మహోద్యమ చరిత్రలో ప్రజలు - స్త్రీలు చేసిన త్యాగం, కృషి, కార్యక్రమాలు వ్రాయాలంటే పెద్ద గ్రంథమౌతుంది. ప్రభుత్వం ఎంతో క్రూర నిర్బంధ విధానం సాగించింది పురుషులు వుండేవారుకాదు. రాక్షసంగా స్త్రీలను చిత్రహింసలు పెట్టడం, కాన్‌సెంట్రేషన్ క్యాంపులకు తీసుకెళ్ళి ఎన్నోఅవమానాలకు గురిచేసేవారు. వారి విలువైన శీలాన్ని కూడా దుర్మార్గులు దోచుకొనేవారు. ఎన్నోబాధలు పెట్టినా, ఓర్పుతో సహించారేగాని ఏ స్త్రీనుండీ శత్రువులు రవ్వంత రహస్యం చెప్పించలేకపోయారు. అన్నింటినీ సహించి -వాళ్ళ జీవితాలు సర్వనాశనమైనా- పార్టీని, దళాలను కన్నబిడ్డలకంటే మిన్నగా కాపాడారు.

తెలంగాణా అంతటా కూడా మహోద్యమ పోరాటచరిత్రలో వందలు, వేలు తల్లులుగా, యువతులుగా వీరుచేసిన త్యాగాలు, కృషి ఇంకా మరుగునపడే వున్నాయి. అలా స్త్రీలోకం పార్టీని, దళాలను కంటికి పాపలాకాపాడి, అనేక పోరాటఘట్టాలలో పాల్గొని, వీరోచిత పాత్ర నిర్వహించి చరిత్ర సృష్టించుకున్నది.

**-శ్రీమంతి మల్లు స్వరాజ్యం**

# 12

# నిజాంకు గోరీ కడతామని నినదించిన విప్లవకిశోరం యాదగిరి

["నైజాము సర్కారోడా-నాజీల మించినోడా" అనేపాట నాటికి, నేటికీ విప్లవాగ్నులు విరజిమ్ముతూ వీర తెలంగాణా పోరాటంలో పాల్గొన్న అశేష ప్రజ ఆశయాలకూ, ఆవేశానికీ తార్కాణంగా నిలిచివుంది. ఆ పాట రచించిన కామ్రేడ్ యాదగిరి స్వయంగా విప్లవ వీరుడు. 1946 జూలై 4 న ఆలపర్తి గ్రామంలో దేశ్‌ముఖ్ విసునూరు రామచంద్రారెడ్డి గూండాల చేతుల్లో కామ్రేడ్ దొడ్డి కొమరయ్య ఆహుతి కావడంతో తెలంగాణా పోరాటానికి అంకురార్పణ జరిగింది. జూలై 4న రానున్న ఆ పోరాట వార్షికోత్సవం సందర్భంగా యాదగిరిని గురించి తెలంగాణా పోరాట అగ్రనాయకుల్లో ఒకరు, నేటి మార్కిస్టుపార్టీ నల్గొండ జిల్లా కమిటీ కార్యదర్శి అయిన శ్రీ భీమిరెడ్డి నరసింహారెడ్డి రాసిపంపిన స్మృతులను పాఠకులకు అందజేస్తున్నాం—

—సంపాదకుడు॥]

బండెనక బండిగట్టి
పదహారు బండ్లగట్టి
ఏ బండ్లొ వస్తవు కొడకో
నైజాం సర్కారోడ
నాజీల మించినోడ
నైజాం సర్కారోడ ॥బండె॥
పోలీసు మిల్టిరి రెండు
బలవంతులానుకోని
పల్లెలు దోస్తివి కొడుకో
నువు ఇల్లెల్ల దోస్తివి కొడుకో
నైజాం సర్కారోడ ॥బండె॥
జాగీరుదారులంతా
జామీనుదారులంతా
నీ యండా జేరిరికొడుకో
నైజాం సర్కారోడ ॥బండె॥
స్త్రీ పురుషులంత కలసి
పిల్లాలమంత కలిసి
వడిసెలల రాల్లు నింపి
వడివడిగా గొట్టతేను
కారాపునీల్లు తెచ్చి
కండ్లళ్ళ జల్లితేను
నీ మిలిట్రి జారిపోయే
నైజాం సర్కారోడ ॥బం॥
బండెనక బండి గట్టి
పదహారు బండ్లుకట్టి
ఏ బండ్లొ పోతవు కొడకో
నా కొడక ప్రతాపరెడ్డి ॥బండె॥
చినమంది మల్లిగాడు
పెదమంది మల్లిగాడు
అల్లిద్దర్ని తింటవుకొడుకో
నా కొడక ప్రతాపరెడ్డి ॥బండి॥
చుట్టుముట్టి సూర్యాపేట
నట్టనడుమ నల్లగొండ

నీవుండే హైదరబాదు
దానిపక్క గోల్కొండ
గోల్కొండ ఖిలాకింద
నీ గోరికడతము కొడుకో
నైజాము సర్కారోడ ॥నీగోరి॥

నాటి చరిత్ర నిప్పులను నేటికీ చెరుగుతున్న ఈ పాట మొదటపాడిన ఆ వీర యోధుడు ఎవరు? అమర వీరుడు యాదగిరి, గ్రామం ఎల్కపెల్లి, తాలూకా సూర్యా పేట, జిల్లా నల్లగొండ.

32 ఏళ్ళక్రితం యాత్రగా సాగిపోతున్న ఒకానొక విమోచన దళం ముందు నడుస్తున్న ఈ వీరుని గళం నుండి, స్వయంగా బాధలు, బసవులు అనుభవించిన ఈయన హృదయాంతరాల్లో నుంచి అలలు అలలుగా పెల్లుబికి వచ్చిన అగ్నికణాలివి.

ప్రక్కనున్న జన్నారెడ్డి దొరల దాడులు, దౌర్జన్యాలను చెండాడుతూ వాటి అంతుచూడగలమని గర్జించిన గాండ్రింపుఇది. అప్పటికి తరతరాలుగా పాదుకున్న ఈ దొరలు, వారిని కాపాడుతున్న నిజాం పాలకులు ప్రజాప్రవాహము ముందు నిలువలేరు, గెలువలేరు అని, అమాంతంగా పడిపోగలరని పూరించిన శంఖారావమిది.

ఇంతకూ ఆ అమరవీరుడు యాదగిరి మరణించినదెక్కడ? ఏ సందర్భంలో?

ఆ మధ్యనే తోటి కామ్రేడ్ కృష్ణమూర్తితో నేను జీపులో జనగాం నుండి సూర్యాపేటకు వస్తుండగా తిర్మలగిరి దాటిన తర్వాత సమీపంలో కనిపించిన ఎత్తైన ఒకానొక రాగిచెట్టు నేటికీ నాటి చరిత్రను చెప్పడానికా అన్నట్లు సజీవసాక్షిగా నిలిచి యున్నది. మిత్రుడు కృష్ణమూర్తి ఆ చెట్టును గుర్తుచేయుచూ నాటి చరిత్ర చక్రాన్ని కదిలించాడు.

అది 32 ఏళ్ళనాటి మాట రోడ్డుకు ఉత్తరభాగాన ఉన్న ఆ చెట్టుకు ఇద్దరము చెరొకవైపు సాయుధ సైనికులుగా సన్నద్ధమైవున్నాము ఆ ప్రక్కనే అక్కడక్కడ వున్న రాళ్ళను చాటుచేసుకొని మరికొంతమంది కామ్రేడ్సు ఆయుధాలు రోడ్డుపైకి దక్షిణ పడమటి ముఖము గురిపెట్టి రెప్పవాల్చకుండా చూస్తున్నారు. మిలటరీ సర్వీసులో అనుభవం కలిగి ఆరితేరిన మరో యిద్దరు కామ్రేడ్స్ రోడ్డుకు దక్షిణ, పడమటిభాగంలో పొలాల్లోగల లావాటి తాటిచెట్లను చాటు చేసుకొని రోడ్డుకి అభి ముఖంగా ఆయుధములు ఎక్కుపెట్టుకుని సమయంకోసం కాచుకుని వున్నారు. ఇలా మూడువైపులనుండి గెరిల్లాయోధు లందరి ఆయుధాలు రోడ్డుపైగల ఒకానొక ప్రదే శానికి ఎక్కుపెట్టబడి వున్నాయి. ఆ ప్రదేశంలో ఒకబండి అడ్డంపెట్టబడి వున్నది. రెండు కొయ్యమొద్దులు వేయబడివున్నవి. మా చేతుల్లోవున్న ఆయుధాలు ఆధునిక మైనవికావు. ఒకటి, రెండు మజిల్లోడర్స్ తప్ప తక్కినవి అన్నీ నాటుతుపాకులే.

మెషిన్గన్లు, సబ్ మెషిన్ గన్లతో సమీపంలోని మొండ్రాయిలో, ప్రక్కన పరిగిరిలోనూ ఇరువైపుల క్యాంపువేసివున్న సాయుధ శత్రువును ఎదుర్కో

డానికి ఇవేమీసరిపోవు. ఐనా గ్రామాలలో నాటికి మారణహోమం సాగిస్తున్న రాక్షస రజాకారుమూకను అడుగడుగునా ప్రతిఘటించాలనే ప్రజల ఆవేశం, ఆగ్రహం మమ్మలనీదాడికి పురికొల్పాయి.

అయితే నిత్యం బస్సులో కాపలాదారులుగా వచ్చే సాయుధ పోలీసుకోసం కాచుకున్న మా ముందుకు అనుకోకుండా ఒక మిలటరీ ట్రక్కు నిండుగా సాయుధ నిజాం మిలట్రీ మూక వచ్చింది. అడ్డంకులను చూచి దిగాలుపడుతూ కంగారుతో ప్రక్కకు తప్పుకోవటానికి ప్రయత్నిస్తున్న ఆ కసాయిమూకల తలలకు గురిపెట్టి మూడువైపులనున్న నాటు ఆయుధాలతో కాల్పులుసాగాయి. ప్రక్కనేవున్న మిత్రుడు కృష్ణమూర్తి తొలిదెబ్బ సరిగ్గా గురిగాతగిలింది. కనురెప్పపాటులో ఆ కసాయిమూకలో నలుగురైదుగురు ప్రాణాంతకంగా గాయపడి షుడియ కూడా నిలువకుండా కంగారుకొద్దీ ప్రక్కనుండిఅడ్డంకులనుఅధిగమించి అతివేగంగా చిత్తుబొత్తుగాకాలుస్తూ వాహనాన్ని పరుగెత్తించారు. వారు ప్రక్కనే వున్న మొండ్రాయి క్యాంపు నుండి అదనపు బలగాలతోతిరిగి రాగలరని గమనించిన మేము మొత్తం దళానికి కేక వేశాము. కాని పరుగెత్తుతున్న కసాయి మూకను వెంటతరుముతున్న కామ్రేడ్స్ ఆవేశంలో మాయొక్క పిలుపును వినిపించుకోలేదు. మా తొలి దెబ్బకు గురియై పరుగెత్తుచున్న ఆ మిలటరీ మూకలను చూచిన మన కామ్రేడ్స్ ఆ నాటు తుపాకులతోనే కొంతదూరం రేచుల్లా వెంటబడ్డారు అలా వెంటబడ్డ కామ్రేడ్స్‌లో యాదగిరి ముందున్నాడు. తక్కినవాళ్లు మా కేకలను ఆలస్యంగానైనా వినిపించుకొని వెనుదిరిగారు.

కాని వీరావేశంలో మైమరచియున్న యాదగిరి మాత్రం శత్రువువెంట పరుగెత్తుచున్నాడు. ఆ క్షణంలోనే ఒకదాని వెంట ఒకటి రెండు లారీల మిలటరీ మూకలు ప్రళయంగా కాలుస్తూ అతివేగంగా తిరిగి రానేవచ్చాయి. వీరుడు యాదగిరి వేగంగా మమ్మలనందుకునే ప్రయత్నంలో వెనుకకు కాలుస్తూ మావైపుకు పరుగెత్తుకొని వస్తున్నాడు. విధివిరామం లేకుండా గుండ్లవర్షము మావైపు సాగిపోతూనేవుంది. లారీలు మావైపే వచ్చాయి. అక్కడున్నటువంటి పొదలను ఆసరా చేసుకొని అడుగడుగునా మెలికలు తిరుగుతూ ఎలాగో పొలాల్లో దూకాము. ఎకరాలకొలది ఉన్న ఆ పచ్చటి పొలాల్లోకి లారీలు దిగలేకపోయాయి. కాని మరింత అందుబాటులోకి వచ్చిన యాదగిరిని అందుకొనే ప్రయత్నం చేశాము. వీరుడు యాదగిరి పామువలే మెలికలు తిరుగుతూ లారీకి అందకుండా గంతులువేస్తూ చివరిదాకా పరుగెత్తాడు. అక్కసుతోవున్న ఆ రజాకారులు అంతటితో వదలలేరు. చివరికి అతిసమీపంలో నుంచి గురిపెట్టి కాల్చారు. ఆదెబ్బతో గాయపడిన యాదగిరి వల వలా వంటినిండా రక్తం కారుతున్నా కొనవూపిరితోనే అందకుండాపోయే ప్రయత్నం చేశాడు. నిలువెల్లా క్షతగాత్రుడైన ఆ యోధుడు పరుగెత్తుతూనేవున్నాడు.

మెలికలు తిరుగుతూ కాల్చుతూ తనపాట పాడుతూ కమ్యూనిజం జిందాబాద్, ఎర్రజెండా జిందాబాద్, నిజాం రాజ్యం నశించాలి అనే నినాదాలతో నిప్పులుగ్రక్కుతూ

కామ్రేడ్ యాదగిరి నేలకొరిగాడు. ఆ వెంటనే మీద దుమికి యాదగిరిని అందుకున్నాయి ఆ రజాకార్ మృగాలు. ప్రక్కనే మొండ్రాయి క్యాంపుకు తీసుకువెళ్ళి అప్పటికే కొనవూపిరితో వున్న యాదగిరిని రహస్యాల కోసం అనేక చిత్ర హింసలకు గురిచేశారు.

రహస్యాలకు బదులు "ఎర్రజెండా జిందాబాద్", "నిజాం నిరంకుశ రాజ్యం నశించాలి", "ప్రజారాజ్యం వర్థిల్లాలి" అనే నినాదాలతో నిప్పులుగ్రక్కుతూ కడ శ్వాస వదిలాడు అమరుడు యాదగిరి.

యాదగిరి గురించి తెలియని వాళ్ళు ఏదో వూహ. ఏదో పేరూ ఏమో రాశారు. కానీ వీరుడు యాదగిరి మా దళ సభ్యుడిగా, మేము పాల్గొన్న ఈ చారిత్రాత్మకమైన పోరాటంలో యోధుడుగా పోరాడుతూ మరణించిన అమరుడు. ఈయన గ్రామం స్వయంగా మా తాలూకాలోని ఎల్కపెల్లి అనే గ్రామం. విప్లవవీరుడు యాదగిరి జిందాబాద్. ఆయన గర్జించిన గర్జన ఆరని జ్యోతిగా నిల్చింది. చివరికది దశదిశలా మహాజ్వాలగా విజృంభించి నిజాంప్రభుత్వాన్ని దాని ఫ్యూడల్ వ్యవస్థనే దగ్ధంచేసింది.

'ప్రజాశక్తి' 29 జూన్ 1980



13

# ఆ తేరువద్ద గెరిల్లాదళం బాహాబాహి పోరాటం

అప్పుడే మేల్కొన్నాను కంట్లు తుడుచుకొని నలువైపులా పరికించినాను. అంతా సవ్యంగానే వుంది. దళం గాఢనిద్రలో వుంది. కొద్దిగా దిబ్బగావుండి పదిగజాల దూరంలోవున్న స్థలంలో సెంట్రీమాత్రం మెలకువతోవున్నాడు.

ఆకాశం నిర్మలంగా వుంది. చీకటిరాత్రిలో కూడా నక్షత్రాల వెలుగుకు నాచుట్టూ యాభైగజాల దూరం స్పష్టంగా చూడగలుగుతున్నాను. వర్షాకాలంలో వంపు నీరుపారిన చెల్కలో చిన్న ఇసుకవాగు— ఒకచోట వెడల్పు, మరొకచోట ఇరుకుగా ఏటవాలుతో కొంతదూరం తెల్లగా కన్పించుతూవుంది.

ఈ ఇసుక వెడల్పున్నచోట ఒడ్డుగా, యిరుకుగావున్నచోట నిలువుగా దళ సభ్యులు ఇసుక చూసుకొని పడుకొనివున్నారు. ఇసుకలో పడక మెత్తగా వుండటమే గాక బట్టలుమాయవని, పురుగు, పూచీ ఇసుకలోకిరావని దళాలు సాధారణంగా చెల్కల లోని వాగులను తమ పడకలకు ఉపయోగించుకునేవారు. కొందరు పక్కకు 'తువ్వాలు' వంటి గుడ్డలను వేసుకొన్నారు. కొందరు పొట్టియిసుకలో పడుకొని సంచులు నెత్తి

కింద పెట్టుకున్నారు. కొందరు నిదురలోకూడాతుపాకిపై చేయివుంచినారు. మరికొందరు తమపొట్టకు ఆనించుకొని పైనుండి చేయివేసి నిదురపోతున్నారు నేను తుపాకి (రైఫిల్) రెండు తొడలపై అడ్డంగాపెట్టి కూర్చున్నా. మాదళంలో ఒక స్టెన్‌గన్, ఒక గైడర్, రెండు పన్నెండవ బోర్ తుపాకులు, రెండు గ్రెనేడ్లు— తతిమ్మావి నాటు తుపాకులున్నవి.

ఇవి శత్రువు సమీపానికి వచ్చినప్పుడు మరియు ఎదుర దాడికి బ్రహ్మాండంగా పనిచేస్తాయి. దూరం నుండి శత్రువును దెబ్బకొట్టి తప్పుకొనుటకు రైఫిల్ ఉపయోగం అవసరం ఆనాడు ఎంతో వుంది. బస్మేర మక్తేదారు వద్ద లాగుకున్న రైఫిల్ మాంచెస్టర్ గార్డియన్ అనునది మాదళంకు వున్న కొరతను తీర్చింది. కానీ ఈ రైఫిల్ తూటాలు 99 మాత్రమే దొరికినవి. ఇవి ఖర్చు పెడితే తిరిగి దొరకడం కష్టమని తేలింది. కనుక జాగ్రత్తగా వాడాలని ఆ రైఫిల్‌ను నాచేతిలో వుంచుకున్నాను. దీనికి దూరమును బట్టి గురిచూసే గేజుకు ఒక చిన్న దూరదర్శిని అద్దం కూడా అమర్చి వుండటం, మా దళానికి రైఫిల్‌పై ప్రత్యేక అభిమానానికి కారణం అయింది.

అంతకు 3, 4 రోజుల క్రితమే ఈ రైఫిల్ వచ్చింది. వచ్చినప్పటి నుండీ శత్రువుతో పోరాడటం తటస్థపడలేదు. ఈరోజు తెల్లవారకముందే ఆలేరు సమీపానికి మా దళం చేరవలసివుంది. ఆలేరులో ఒక పోలీసు క్యాంపు తిష్టవేసి వుంది. కల్లు గీయించుతూ పన్నులు వసూళ్ళు చుట్టుపట్ల గ్రామాల్లో లేనివాటిని ఇచ్చట ఈ క్యాంపు సాయంతో ప్రభుత్వం సాగించుచూ వుంది. దీనిని బంద్ చేయించాలని పార్టీ కమిటీ నిర్ణయించింది.

ఈ నిర్ణయానుసారం ఆ చీకట్లో మా దళం బయలుదేరవలసి వుంది. టైం ఎంత అయిందో తెలియదు. మా దళానికి ఉన్న ఒకే ఒక రిస్టువాచి సెంట్రీ వద్ద వుంటుంది. ఆ వాచ్ రేడియం డయల్ గలది చీకటిలో వెలుతురు సహాయం లేకుండా టైం గుర్తించవచ్చు. అయితే అప్పుడప్పుడు కొంత అస్పష్టంగా వుండేది.

నేను లేచి నిల్చుని రైఫిల్ భుజానికి వేసికుంటూ కావలా కామ్రేడ్ వద్దకెళ్ళి మెల్లగా టైం అడిగాను. ఆ కామ్రేడ్ మూడు అయివుంటుందని అన్నాడు. వాచ్ తీసుకొని చూడగా టైం స్పష్టంగా కన్పించలేదు. నా ఒడిలో వాచ్‌పెట్టి టార్చిలైట్‌ను డయల్‌పైకి ఫోకస్ చేసినాను అప్పుడు స్పష్టంగా 3 గంటలు చూపించుతూ వుంది.

"కామ్రేడ్స్! లేవండి, తెల్లవారకముందువెళ్ళాలి." పడుకున్నవారికి దగ్గరగా వెళ్ళి చెప్పినాను. మా దళంలోని వారంతా 24 సంవత్సరాలు అంతకు తక్కువ వయసు గలవారే. లేచి కూర్చొన్నాక 2, 3 నిమిషాలు నిద్రమత్తు వదిలేదికాదు. లేచి సంచులు, తుపాకులు భుజాలకు తగిలించుకున్నారు.

మా దళానికి యిద్దరు కొరియర్స్ ఉండేవారు. ఒకరు ఎల్లప్పుడు దళంతో ఉండేవారు. మరొకరికి బయటి వార్తలు, ఉత్తర ప్రత్యుత్తరాలు తేవడం, తీసుకొని

పోవడం పనిగా వుండేది. దళంలో వున్నవాప వార్తలు తేవడమేకాక దళంకు కొంత దూరం ముందర నడిచేవారు.

కామ్రేడ్స్, మనం ఆలేరు గ్రామం వద్దకు చేరాలి. త్రోవలో ఒక రోడ్డును, మరియు రైలు పాటను దాటవలసివుంది. కనుక నిశ్శబ్దంగా నడవాలని దళంలో ఒక గొంతు కొంచెం బిగ్గరగా వినబడింది. మరొకరు ఇక నడవండన్నారు. దళం నడక ప్రారంభించింది. రోడ్డు 50 గజాల దూరం ఉండనగా కొరియర్ మమ్ముల ఆగమని సంకేతమిచ్చి తను ఒక్కడే రోడ్డుదాకా వెళ్ళి తిరిగివచ్చి మమ్ముల రమ్మని సైగచేశాడు. రోడ్డుదాటి అలానే రైలుమార్గం వద్దకూడా జాగ్రత్తగా దాటి శాయగూడెం వద్దకు దళం చేరింది. నిర్ణయానుసారం భువనగిరి దళం మావద్దకు చేరలేదు. ఇద్దరు కామ్రేడ్స్ నాటు తుపాకులతో వచ్చి మాలో కల్సినారు.దళం ఆలేరు తాటివనంలోకి ప్రవేశించింది. కూలీలందరినీ ప్రోగుచేసి "నిజాం ప్రభువును గద్దె దింపుటకు ప్రజలంతా తెగించి పోట్లాడుతుంటే మీరు కల్లుగీత గీసి పన్నులు ఇస్తున్నారని, ఇదికూడదని 15 నిమిషాలు వారికి నచ్చజెప్పడం జరిగింది. వారు ఇకముందు గీయమని, పన్నులు చెల్లించమని హామీ ఇచ్చినారు. అలాంటప్పుడు మోకులు, ముస్తాదులు యివ్వమని అడిగి వాటిని పనికి రాకుండా చేశాం. కొందరితో తాళ్ళు ఎక్కించి గెలలు కోయించడం జరిగింది. ఈ పని ఒకవైపు సాగుతుండగా ఉత్తరం వైపున వుంచిన కావలా కామ్రేడ్ వద్దకు వెళ్ళాను. ఆలేరు గ్రామం లవే వుంది. కనుక శత్రువు వస్తే అటునుండే వస్తారు కనుక ఆ పరిసరాలు చూడాలని అటువైపు నడచివెళ్ళినాను. సెంట్రీకి ఒక వంద గజాల దూరంలో ఆలేరు గ్రామం చివరి ఇండ్లు, ఊరు కన్పించుతూ వుంది. గ్రామంలో పోలీసు క్యాంపు వుండగా అంత చేరువలోకి ఉదయం 8 గంటల సమయంలో వెళ్ళడం తెలివితక్కువతనం అవుతుంది. శత్రువు మొండిగోడల చాటునుండి కాల్పులు సాగించితే మాకు రక్షణ సరిగాలేదు. తాటిబొత్తలు చాటుచేసుకోవల్సి వుంటుంది. ఏకాద్దో నర్రతాళ్ళలాగ వున్నవితప్ప తలిమ్మాని బొత్తలు. వీటినుండి తుపాకిగుండ్లు అవలీలగా దూసుకుపోతవి. కనుక ఇవి రక్షణకు ఉపయోగంకావు. కనుక ఆట్టే ఆలస్యంచేయకుండా దక్షిణంవైపు దళంపోయి సెంట్రీని 200 గజాలు వెనక్కి పిలిచి కార్యక్రమం ముగించుకొని శాయిగూడెం చేరినాము. దళం టీత్రాగి ప్రయాణమునకు సిద్ధమౌతుండగా పోలీసుదళం వస్తూవుందని సెంట్రీ పరిగెడుతూవచ్చి చెప్పినాడు. ఊరి వెలుపల ఎదిరించాలని ఊరిలో వొద్దని, మనకు అనుకూలస్థలం వచ్చేవరకు శత్రువును వెంటాడనీయాలని, ఎలాంటి కాల్పులు మొదటే చేయరావని తెల్పినాను. గ్రామంలోవుండి పోరాడాలని, అలా చేయకపోతే మనం పిరికివారమని ప్రజలుభావిస్తారని ఒక కామ్రేడ్ అన్నాడు. అప్పటికే రేణుకుంట్ల పోరాటంనుండి గుణపాఠంగా పార్టీ ఒకలేఖ పంపింది. గ్రామాల్లో బురుజులపైవుండి పొజిషనల్ వార్‌ఫేర్ (నిలబడి వాహ్యయుద్ధం)కుదిగరాదని, మనదళాలను చక్రబంధంలో ఇరుక్కోకుండా చూడాలని, ఇరుక్కుంటే విడిపించగల అదనపుదళాలు మనకు లేవుగాబట్టి కొట్టి తప్పుకోగల చాటు

మాటు యుద్ధ (గెరిల్లా) తంత్రంను మరచిపోరాదని ఖచ్చితంగా చెప్పబడింది. ఈ విషయం ఆ కామ్రేడ్ దృష్టికి తీసుకువచ్చినాను.

గ్రామంలోపలండి ఎదిరించవద్దని, ఒక పోలీసు చచ్చినా ఊరు మొత్తాన్ని తగులబెడతారని గ్రామం వెలుపల పోట్లాడమని గ్రామస్థుల్లో ఒకరు కోరినాడు. దళం గ్రామం బయటకు నడిచింది. పోలీసు మమ్ముల వెంటాడుతూనేవుంది. కొంతదూరం వెళ్ళాక ఒక రాతిదొడ్డి రక్షణకు అనువుగా, తుపాకులు పెట్టి కాల్చుటకు వీలుగా గూళ్ళు కలది కన్పించగానే కొందరు దళసభ్యులు దళ నాయకుని సూచనల మేరకు దొడ్డిలోకి ప్రవేశించినారు. మరికొందరు చెట్ల రక్షణగా నిల్చున్నారు.

ఆ దొడ్డివెంటే వరిపొలం కరిగట్టు చేయబడుతూ వుంది. కొందరు స్త్రీలు నారు పీకుతున్నారు. కొందరు నాటువేస్తున్నారు. కొందరు మగకూలీలు నాగండ్లు దున్నుతున్నారు. మరికొందరు నారుకావళ్లు మోస్తున్నారు. వారందరిని ఉత్తరంవైపు వెళ్ళిపొమ్మని, నాగండ్లనుకూడా అటువైపే కొట్టమని, లేకుంటే కాల్పుల్లో యిబ్బంది వచ్చిపోయే ప్రమాదముందని దగ్గిరగావెళ్ళి గట్టిగా చెప్పినాము. పోలీసువారి రాక చూచిన కూలీలు చిందరవందరగా పరుగులు పెడుతూ అచ్చటచ్చటే తిరుగసాగారు. నాగండ్లు దూరం కొట్టబడలేదు. శత్రువు సమీపించుచున్నాడు. మేం కాలిస్తే శత్రువు ముందుకు రాలేడు. కాని పిచ్చిపిచ్చిగా కాల్పులు సాగిస్తాడు. మా మధ్య-పోలీసుమధ్య కాల్పుల్లో ఆడ, మగ కూలీలకు, నాగలి పశువులకు ప్రాణనష్టంతప్పదు. మేం ప్రజలకు నష్టం జరగకుండా జాగ్రత్తపడగలం. కాని శత్రువు నేరుగా ప్రజలకు గురిపెట్టి కాలుస్తాడు. కనుక అచటనుండి మరొక ప్రదేశానికి, మనకు అనుకూలమైన ప్రదేశానికి శత్రువును తీసుకుపోవాలి.

కొంతదూరం తర్వాత శత్రువు మమ్ము తరిమివేశామని భావించి నిలబడి పోయాడు ఒక నాటుతుపాకి పేల్చమని ఒక కామ్రేడ్ చెప్పటం, వెంటనే పేలడం జరిగిపోయింది. మేం పారిపోవడంలేదని, పోరాటానికి సిద్ధమని శత్రువుకు ఇది సిగ్నల్. దీనితో శత్రుమూక కోపంతో తరుముతూ వస్తున్నది. మా దళం కొరియర్‌తో సహా 15 మందికి మించిలేము. శత్రువులు 40 మంది రైఫిల్స్‌తో కావల్సినన్ని గుళ్ళతో వెంటాడుతున్నారు.

కొంత దూరం పోయాక శారాజిపేట గడ్డ (మైదానం) వచ్చినది. 1949 లో ఈ స్థలంలో బ్రిటిష్ సైన్యపు గుడారాలుండేవట. చెట్టుచేమా ఏదీలేదు. మూత్రాలు పోయుటకు కట్టిన ఒకటిరెండు సిమెంటు కట్టడాలు చిన్న అరుగులు మాదిరివి ఉన్నవి. వాటి ప్రక్కనే ఒక పెద్ద గొయ్యి వుంది. ఆ గోతిలో దళం అంతా రక్షణ తీసకొనుటకు వీలుంది. నేను, ఉపకమాండర్, మరిద్దరు కామ్రేడ్స్ ల సిమెంటు అరుగుల చాటున రక్షణ తీసుకున్నాము.

పోలీసుదళం మమ్ముల వెంటాడటం మాని రెండు దళాలుగా చీలి ఒక దళం

వచుకొని మాపై కాల్పులు ప్రారంభించింది. రెండవదళం దక్షిణంవైపునుండి తూర్పు దిశకు నడుస్తూ మా వెనక తట్టుకు నడుస్తూవుంది.

శత్రువు మమ్మ చక్రబంధంలో యిరికించాలని చూస్తున్నారని మేము అర్థం చేసుకున్నాము. ఆలేరునుండి జీడికల్లు వెళ్ళేరోడ్డుపై ఒకలారీ పోలీసులను పంపి శారాజీ పేటవద్ద కొందరిని, పోరాటం ప్రారంభమైన స్థలానికి కుడిప్రక్క దగ్గరగావున్న పాయింట్‌పై కొందరిని దింపితే మేము చక్రబంధంలో బిగింపబడతాము. కనుక తూర్పువైపు నడచి, లేక ఉత్తరంవైపునుండి రోడ్డును ఎంత త్వరగా దాటగలిగితే అంత క్షేమమని భావించాం.

కాని శత్రువు మాపై ఎడతెరిపి లేకుండా గుండ్లవర్షం కురిపిస్తున్నాడు. మాకు కదల మెదలలేనిస్థితి ఏర్పడింది. కర్రుమని భయంకరమైన గుండ్లమోత చెవుల ప్రక్కనుండి శబ్దంచేస్తూ పోతూవుంది. తలపై తేనెటీగల దాడిమాదిరి గుండ్లు ఎగురుతూ అటుప్రక్క ఇటుప్రక్క దూసుకుపోతున్నవి. మేం సిమెంటు అరుగుకు ఒక్కరవ్వ అంచు ఏటుజరిగినా గుండ్లు తగలటం ఖాయంగా కన్పించింది. సిమెంటు అరుగుకు యిరువైపులా తగిలిన గుళ్లు ప్రక్కలకు దూసుకుపోయి భూమిపై దుమ్ము లేపుతున్నవి. నా చేతిలో ఆయుధంవుండీ శత్రువుపై ప్రయోగించ వీలుకాకుండావుంది. నా తలపైకి ఎత్తే వీలులేకుండా గుండ్లురావడం, ఇరవై రైఫిళ్లు ఒకే టార్గెట్‌గా సిమెంటు అరుగుపై కేంద్రీకరించటం, ఒక నిమిషం దాడిలో 240 గుళ్ళు పేల్చడం-అదే మొదటి అనుభవంకనుక నన్ను కలవరపర్చుచున్న భయంకర ఘడియలు. ఒక నిమిషం ఆలస్యం మా కంఠాలకుదగ్గరగా ఉచ్చు బిగించబడుతున్నట్లు భావించుకున్నాం. పోలీసువాళ్ల కాల్పులు ఎప్పుడు ఆపుతారో తెలియదు. ఆ శుభసమయంలో మాత్రమే నేను తలపైకెత్తి గురిచూచుటకు అవకాశముంది. సిమెంటు అరుగు యింకా కొంత వెడల్పు, ఎత్తువుంటే ఈ చిక్కు వుండేదిగాదు. అరుగువెడల్పు, అడుగున్నర ఎత్తు వుండటం అదే రక్షణగా తీసుకోవాల్సిరావడం, మేము కదలలేనిస్థితికి కారణంఅయింది. చివరికి పోలీసువాళ్ళ మ్యాగ్జిన్ (తూటాల తొడుగు)లలో గుండ్లు అయిపోయి నిర్భయంగా నిల్చున్నారు. మా దళం బర్మారువళమని భావించివుంటారు. నిల్చుని గుండ్ల మ్యాగ్జిన్‌లు తగిలించుకుంటున్నారు.

ఇంతకంటే మంచిఅదను దొరకదు. అంతకుముందే 1500 గజాలకు ఎక్కువే ఉంటుందని గేజు సరిచేసిపెట్టి ఉంచినాను. నా తల మూడుఅంగుళాలు ఎత్తి గురిచూసి ట్రిగ్గర్ నొక్కడమే నేను చేయవలసిన పని. తతిమ్మా కామ్రేడ్స్‌వద్ద శత్రువులవద్దకు చేరి గాయపర్చగల ఆయుధాలు లేక ప్రేక్షకులుగా ఉండవలసి వచ్చింది. మాన్‌చెస్టర్ రైఫిల్ ఒక్కటే ఇప్పుడు ఉపయోగపడుతుంది. గురిపెట్టి దూరదర్శిని అద్దంలోంచి శత్రువులను సమీపంలో చూడగలిగాను. ఇద్దరు ఇనుపటోపీలుధరించిన తలలు ఒకరిపై నుండి ఒకరు ఇద్దరూ ఒకే యాంగిల్‌లో కన్పించారు. ట్రిగ్గర్ నొక్కడం వెంటనే శత్రువుల్లో యిద్దరు పడిపోవడం, తతిమ్మావారు చిందరవందరగావడం మేం స్పష్టంగా

చూచాము. ఇదంతా కొన్ని సెకండ్లలో జరిగింది. దళంయొక్క మొదటి రైఫిల్ గుండు యిది

"కా మ్రేడ్స్! వాళ్ళుపడ్డారు. వెంటబడి తరమాలన్నాడు ఒక కామ్రేడ్. అలా వద్దని చక్రబంధం ప్రమాదం నుండి తూర్పుకు పరిగెత్తుతూ శారాజిపేట గ్రామానికి దక్షిణ దిశన పొలాలు, ఈతచెట్లు ఉన్న పాయింటుకుచేరాము. మేము దాటి ఊరికి తూర్పుదిశ చింతమానుల రక్షణకు చేరుకున్నాము. ఆ రెండులారీల పోలీసులొచ్చి ఒకటి జీడికంటివైపు వెళ్ళిందనీ, ఒకటి పోరాటం జరిగిన ప్రాంతమునకు దగ్గరగాఉన్న ఉత్తరదిశ రోడ్డుపై ఆగిందని తెల్సింది. ఈ విధంగా శతృచక్రబంధం నిరుపయోగం చేయబడి, మా దళం విజయం సాధించింది.

తర్వాత లారీలనిండా పోలీసులు శారాజిపేట గ్రామంవచ్చి చచ్చినవారిపై గుడ్డలుకప్పి కమ్యూనిస్టులను చంపామని ప్రజలతో చెప్పిపోయారు.

పోలీసులు పడిపోయిన స్థలంలో రక్తంతో తడిసినమట్టిని త్రవ్వి తీసుకు పోయారని, గుర్తించకుండా పొడిమట్టి చల్లారని తెల్లవారి వార్తవచ్చింది.

నోటు : పోరాట ప్రారంభంలో పార్టీ కల్లుగీత మాన్పించింది. తాటిగెలలు కోయు కార్యక్రమం యిచ్చింది. తర్వాత గీత పనివారు తమ బ్రతుకుతెరువు దెబ్బ తిన్నదంటే నిజాంకు పన్నులుకట్టకుండా కల్లు గీసుకొమ్మని చెప్పింది. ఈ ఘటన ప్రారంభరోజుల్లోది.

- సి. యాదగిరిరావు



# 14

# గెరిల్లాదళం ఆకస్మికదాడి

అది 1948 వ సంవత్సరం ఫిబ్రవరినెల. నిజాం పోలీసు రజాకారుమూకలు గ్రామాలమీదపడి ఇండ్లు లూటీచేస్తూ, తగులబెడుతూ, ప్రజలను చిత్రహింసలకు గురిచేస్తూ ప్రజా నాయకులను కాల్చివేస్తూ, పడతుల శీలాన్ని హరిస్తున్న అత్యంత భయంకర కాలమది. ప్రజలు అరచేత ప్రాణాలు పెట్టుకొని ఏక్షణంలో ఏమి జరగనున్నదోనని బిక్కుబిక్కుమంటూ జీవిస్తున్న రోజులవి.

అదేకాలంలో తెలంగాణా ప్రజలు భూమికోసం, భుక్తికోసం, మొత్తం తెలుగు ప్రజల ఐక్యతకోసం, వెట్టిచాకిరి రద్దుకోసం, పటేలు, పట్వారీల దోపిడీ దౌర్జన్యాలను అరికట్టేదానికోసం, నిజాం నిరంకుశ రాచరిక ప్రభుత్వాన్ని, దాని మూల స్థంభాలుగావున్న జమీందార్లను, జాగీర్దారులను కూలగొట్టుటకు సాగిస్తున్న అగ్నివంటి విప్లవపోరాటంలో ప్రజల ధన, మానరక్షణకోసం ప్రజారక్షణదళాలు (గెరిల్లాదళాలు) ఏర్పడి ప్రజలను నిరంతరం కాపాడుతున్న కాలమది.

అటువంటి పరిస్థితుల్లో ఒకనాటిరాత్రి 10 మంది సభ్యులుగల మా దళం

పర్మాయపల్లి శివారులోని బావులవద్ద నిద్రించి తెల్లవారి చీకటితోనే లేచి కర్వీరాల కొత్తగూడెం చేరుకోవాలని బయలుదేరింది. త్రోవలోవున్న అన్నారం చేరుకునేసరికి దాదాపు ఉదయం 6 గం॥లు కావస్తున్నది. గ్రామములోని రైతులు వేసంగి పొలం చేసుకునేందుకు పొలాలకు వెళ్ళుచున్నారు. గ్రామంలో కొందరు పెద్దలు, పిల్లలు ఊరి పశువులను మేతకోసమని గ్రామం వెలుపలకు తోలుకు వెళ్ళుచున్నారు స్త్రీలు వాకిళ్ళ ముందర ఊడ్చి, కళ్ళాపి చల్లుతున్నారు. అంతా నిద్రనుండి లేచి తమ తమ పనుల్లో చేరేందుకు సందడిగా ఎటు వెళ్ళేవారు అటు వెళ్ళుచున్నారు. అంతలోనే వున్నట్టుండి ఎవరో కేకవేశారు. "గుర్రాల పోలీసులొచ్చె, గుర్రాల పోలీసులొచ్చె" ఈ వార్త క్షణాలమీద గ్రామమంతా ప్రాకిపోయింది. జనం ఎక్కడి వారక్కడ బయటికి కనపడ కుండా తప్పుకున్నారు. కొలదిసేపట్లోనే వీధులన్నీ నిర్మానుష్యమైనాయి.

అన్నారం గ్రామానికి దాదాపు మూడుమైళ్ళ దూరంలో తుంగతుర్తి పోలీసు స్టేషన్‌వున్నది. అక్కడ సాయుధులైన పోలీసులు, రజాకార్లు క్యాంపువేసి వున్నారు. ఆ క్యాంపులోకొన్ని గుర్రాలు కూడా వున్నాయి. ఆరోజు 7 గుర్రాలతో 25 మంది పోలీసులు, రజాకార్లు కలిసి తుంగతుర్తికి 15 మైళ్ళ దూరంలోవున్న ఏపూరు పోలీసు క్యాంపుకు వెళ్లుచున్నారు. ఎందువల్లనో ఈ పోలీసులు అన్నారంలో అట్టేసేపు ఆగ కుండా హుటాహుటిగా ఏపూరుదిశగా బయలుదేరి వెళ్ళుచున్నారు.

అంతవరకు కొత్తగూడెం వెళ్ళాలనుకొని వస్తున్న మా దళానికొక ఆలోచన వచ్చింది. ఈ ముష్కరులు ఏపూరు చేరేలోగా త్రోవలోవున్న ఏదో ఒక గ్రామం మీద తప్పక దాడిచేస్తారు. కనుక ఈ పోలీసులను వెంబడించి మంచి రక్షణగల ప్రదే శానికి ముందుగానే చేరుకొని పోలీసు, రజాకారులను పారద్రోలి గ్రామాలమీద జరుగ బోయే దాడిని అరికట్టాలని నిర్ణయించుకున్నాము. ఐతే పోలీసులు వెళ్ళేత్రోవనే వెడితే వాళ్ళనుదాటి ముందుకువెళ్ళడం సాధ్యంకాదు కనుక త్రోవవదిలి పొలాల వెంటబడి వెళ్లాలనుకున్నాము. మేము యీ నిర్ణయానికి వచ్చేసరికి పోలీసులు గ్రామంవదిలి వెళ్ల చున్నారని మాకు వార్త చేరింది. ఇక్కడ మేము ఒక్క క్షణం కూడా ఆలస్యం చేయ కుండా బయలుదేరి పొలాల వెంబడి నడక సాగించాము. పోలీసులు దారివెంట వెళ్ళు చున్నందువల్ల నేమి, గుర్రాలమీద వెళ్లుచున్నందువల్లనేమి ప్రయాణం వేగంగా సాగుచున్నది మేము బురదల్లో నుండి, చెలకల్లో నుండి, చెట్లలో నుండి నడవవలసి రావటం వలన పోలీసులు మాకన్నా ఎప్పుడూ ముందుగానే వెళ్లుచున్నారు.

మా దళం దారి, డొంకా లేకుండా పొలాల్లో నడిచి పోలీసులను వెంబడిస్తున్న సంగతి చెలకల్లో, పొలాల్లో పనులు చేసుకుంటున్న జనం అంతా చూస్తూనే ఉన్నారు. పోలీసులపై దళం దాడిచేయబోతున్నదని వారు అర్థం చేసుకున్నారు. ఏమి జరగ నున్నదోనని అందరి ముఖాల్లో ఒక రకమైన ఉత్సుకత ద్యోతకమౌతున్నది. మేము పోలీసులను వెంబడిస్తున్న విషయం వందలాదిగా జనం చూస్తున్నారు. కాని, ఈ విషయం పోలీసులకు చెప్పటానికి ఎవ్వరూ సాహసించలేదు.

ఆ విధంగా వెంబడిస్తూ వెళుతున్న మేము పోలీసులను సంగెంలో అడ్డుకోవాలనుకున్నాము. కాని సాధ్యం కాలేదు. ఎలుకపల్లికి చేరేసరికన్నా ఎదురు తిరగవచ్చు ననుకున్నాము. కాని మా ప్రయత్నం నెరవేర లేదు. చివరకు చిల్పకుంట్ల లోనైనా అడ్డుకొనక లాభంలేదను కొన్నాము. కాని మా ప్రయత్నం వృధా అయింది. శత్రువులు చాలా వేగంగా వెళ్ళుచున్నందువల్ల మేము అందుకోలేకపోయాము. మేము చిల్పకుంట్ల చేరేసరికి పోలీసులు నూతనకల్లు సమీపించారు. దానితో మాలో నిరాశాభావాలు అలముకున్నాయి. దానికి తోడు చాలా దూరం దారీ డొంకాలేని ఎగుడు దిగుడు స్థలాల్లోంచి వడివడిగా నడిచిరావటం వల్ల బాగా అలసిపోయాము ఇకముందు నడవటం కష్టసాధ్యమని తోస్తున్నది. అయినా చిల్పకుంట్లలో ఒక 5 నిముషాలు ఆలోచించుకున్నాము. పోలీసులు ఏపూరు గ్రామం చేరేలోపల త్రోవలో ఇక ఒక్క నూతనకల్లు గ్రామమే దాటవలసి ఉన్నది. వాళ్ళు అక్కడ ఆగటం జరిగితే తప్పక మాకు దొరుకుతారు. ఈ ఆలోచన మాకు కలిగే సరికి మళ్ళీ మాలో ఆశ చిగురించింది. తిరిగి శక్తినంతా కూడదీసుకొని వేగంగా నడక ప్రారంభించాము. బొలాల వెంటబడే, నూతనకల్లు చేరుకున్నాము.

సరిగ్గా మేము అనుకున్నదే జరిగింది. పోలీసులు నూతనకల్లుపై దాడిచేసి ప్రజలను బెదిరించి పాలు, సిగరెట్టుపెట్టెలు, కోళ్ళు, నేతిడబ్బాలు, ఇతర సరుకులు వసూలు చేసుకొంటున్నారు. ఊరికి దక్షిణదిశగానున్న బజారుకు చేరుకున్న మాకు గ్రామములో పోలీసులు సాగిస్తున్న చర్యలగురించి ప్రజలు చెప్పారు. ఇది మాకు అదునుగా దొరికింది. ఈ స్వల్పవ్యవధిని జారవిడుచుకోకుండా ఊరివెంబడి వున్న చెరువుకట్ట మీదుగా ఊరికి తూర్పుదిశగా ఏపూరుత్రోవలో బాగా రక్షణగానున్న ఈత తోపుకు చేరుకున్నాము. అప్పటికి దాదాపు ఉదయం 10 గంటలైంది. మా దళంలో అంతా బాగా అలసిపున్నారు. పైగా ఇంతదూరం నడిచిరావటంవలన తీవ్రంగా దప్పిక కాసాగింది. కొలదిదూరంలోవున్న బావివద్దకు వెళ్ళి దప్పిక తీర్చుకుందామనుకున్నా వ్యవధిలేదు. దాహం తీర్చుకొనివచ్చేలోగా పోలీసులు వెళ్ళిపోతే మా శ్రమంతా వృధా అవుతుంది అందుకని వేసంగి పొలాల్లోవున్న మురికినీరు త్రాగి దాహంతీర్చు కున్నాము. ఇక ఏమాత్రం ఆలస్యం చేయకుండా 10 మందిగావున్న మేము రెండుగా చీలి త్రోవకు రెండువైపులా ఐదుగురు చొప్పున చెట్లలో మాటువేశాము.

మేము రక్షణ స్థలంలో మాటువేసిన 15,20 నిముషాల్లోనే పోలీసులు గ్రామంలో దోచుకున్న సరుకు సామాగ్రితో ఆర్భాటంగా గ్రామం నుండి బయలు దేరటం గమనించాము. త్వరలో జరుగనున్న దాడిని ఊహించుకున్న మాగుండెలు వేగంగా కొట్టుకోవటం ప్రారంభించాయి. ఏమి జరుగనున్నదోనవనే ఆదుర్దా మాలో ఎక్కువైంది. కాని అంతలోనే మా కర్తవ్యం స్ఫురణకు వచ్చింది. విజయం సాధించాలనే పట్టుదల మనస్సుల్లో మెదిలింది. అంతవరకు అలసట చెందినట్లున్న మాలో ఏదో నూతన శక్తి వచ్చి చేరినట్టయింది. పోరాటంలో శత్రువును పరిమార్చుటకు

దళం సర్వసన్నద్ధమైంది ఇంతలో పోలీసులు కొన్ని గజాల చేరువలోకి వచ్చారు. వెంటనే దళ కమాండరు కాల్పులకు ఆర్డరిచ్చాడు. అంతే! ధన్....ధన్....ధన్ మంటూ మా దళం కాల్పులు సాగిస్తున్నది. ముందు వరుసలో వస్తున్న గుర్రాలకు, పోలీసులకు శరీరాల్లో తుపాకి గుళ్ళు దూసుకపోయాయి.

ఆకస్మిక మెరుపుదాడిలో తుపాకి కాల్పులకు గురైన గుర్రాలు పెద్దగా సకిలుస్తూ ముందు రెండు కాళ్ళు పైకెత్తి వెనక్కు తగ్గటం ప్రారంభించాయి. ఖంగు తిన్న పోలీసుల గుండెలు జారిపోయాయి దిక్కుతోచని స్థితిలో గబ గబా గుర్రాలపై నుండి క్రిందికి దుమికి అంతా క్రిందపడి ప్రాకుకుంటూ ఈతచెట్ల చాటున చేరు కున్నారు. తర్వాత చెట్ల చాటున రక్షణ తీసుకున్న పోలీసులకు గెరిల్లా దళానికి చాలా సేపు పోరు జరిగింది. కాని దళంలో ఎవరికీ ఎలాంటి ప్రమాదం జరుగలేదు. ఇక అక్కడ ఆలస్యముచేస్తే తమకు చావు మూడుకుంచనుకున్నాడు కాబోలు, ఎక్కివచ్చిన గుర్రాలను, గ్రామములో దోచుకవచ్చిన సామగ్రిని వదిలివేసి కాల్పుల్లో గాయాలు తగిలిన తమ సహచరుల్ని తీసుకొని చెట్లను రక్షణగా చేసుకుంటూ ప్రక్క వాటుగా ఏపూరు దిశగా పారిపోయారు.

ఈ దాడిలో దళం సాగించిన కాల్పుల్లో ఒకడు మరణించాడని, ఇరువురు తీవ్రంగా గాయపడ్డారని తర్వాత తెలిసింది.

పోలీసులు, రజాకార్లు బ్రతుకు జీవుడా యంటూ, రంగంనుంచి పారిపోయిన తర్వాత, వాళ్ళు వదిలివేసిన సరుకు సామగ్రినంతా స్వాధీనం చేసుకొని దెబ్బలు తగిలి గాయపడిన గుర్రాలను వెంట తీసుకొని మిగతా గుర్రాలమీద ఎక్కి మా దళం నూతన కల్లు చేరుకున్నది. పోలీసు, రజాకారు మూకలకు మాటుగాచి దాడిచేసి వాళ్ళను పార ద్రోలుతున్న సంగతి ముందుగానే తెలిసిఉన్న గ్రామ ప్రజలు మా రాకకోసం వందలాదిగా ఎదురువచ్చి మాకు ఘనస్వాగతం యిచ్చారు. ఆనందోత్సాహాలతో జయ జయ ధ్వానాలు చేశారు. ఆ తర్వాత అక్కడ గుమికూడిన ప్రజలు, దళ సభ్యులను గ్రామమంతా ఊరేగించారు. ఊరేగింపు ముగిసిన తర్వాత మా దళం నూతనకల్లు నుండి బయలుదేరి చిల్పకుంట్ల చేరుకున్నది.అప్పటికే చిల్పకుంట్ల ప్రజలకు ఈవిజయ వార్త తెలిసింది గ్రామంలోని ఆవాలగోపాలం మారాకకు ఎదురుచూస్తూ గ్రామంబయట ఉన్న బందావుర్రివద్దకువచ్చి దళానికిఘనస్వాగతంఇచ్చారు మిన్నుముట్టేహర్షధ్వానాలు చేస్తూ నినాదాలు చేశారు. అందులో అనేకులు దళసభ్యులను ఆలింగనము చేసుకొని తమ హర్షాతిరేకాన్ని వెల్లడించారు. వారిలో నామాల గుర్వయ్య అను మధ్యవయస్కు డగు వ్యక్తి దళ కమాండరును వెతుక్కుంటూవచ్చి ఇట్లావ్యాఖ్యానించాడు. "అలనాడు అర్జునుడు యుద్ధంలో శత్రువులను ఓడించి ఆవులను మలిపితే ఈనాడు మీరు పోలీసు లను ఓడించి గుర్రాలను మలిపింద్రు. ఇక రాజ్యం మనకు వచ్చినట్లై" నంటూ ఆ దళ నాయకుణ్ణి ప్రేమాతిశయం ఉట్టిపడగా గాఢాలింగనం చేశాడు. ఆ విధంగా అక్కడ

కూడిన ప్రజలంతా రాజ్యాన్నే గెల్చుకున్నంత సంతోషంతో ఉప్పొంగిపోయారు. ఎవరి ముఖాల్లో చూచినా ఆనందోత్సాహాలు తొణికిసలాడాయి. ఆనాడు గ్రామంలో విజయోత్సవం జరుపుకున్నారు. పోరాటంలో పాల్గొన్న దళాన్ని గ్రామంలో వీరోచితంగా ఊరేగింపు జరిపారు. ఈ దాడిలో గెరిల్లాలు సాధించిన విజయం చుట్టుప్రక్కల 10 గ్రామాలలో జనాన్ని ఎంతో ప్రభావితం చేసింది. వారిలో ఎంతో ఆత్మవిశ్వాసం పాదుకొల్పింది.

- శ్రీ తొట్ల మల్సూరు



# 15

# కామ్రేడ్ కొంతం కొండల్ రెడ్డి వీరమరణం చెందిన ఘట్టం

అది సూర్యాపేట తాలూకాలోని పాత సూర్యాపేట గ్రామం. లెవీగల్లా వసూలుకు వ్యతిరేకంగా నైజాం నిరంకుశ ప్రభుత్వ పోలీసు దళాలను ఎదిరించుటకు సిద్ధమైన స్థానిక ప్రజలకు అండగా ఆ గ్రామం చుట్టూ 10, 15 గ్రామాల నుండి వేలాదిగా జనం సమీకృతులై సాగించిన వీరోచిత పోరాటంలో చరిత్ర ప్రసిద్ధికెక్కిన గ్రామమిది. ఆ గ్రామం ప్రక్కనేవున్న చక్రయ్యగుట్టకు కూడా ఆ పోరాట చరిత్రలో ప్రముఖ స్థానమున్నది. అందుకు ఆ గుట్ట మీదనున్న ఏడు ఎడ్ల కొట్టము ఒక ముఖ్య కారణం. అది జన నివాసానికి అనువుగా వుండి ప్రకృతిసిద్ధంగా నిర్మితమైయున్న ఒక రక్షణ ప్రదేశం. ఆ గుహలో ఆనాటి పోరాటయోధులు తరచుగా రక్షణ తీసుకుంటూ వుండేవారు.

నైజాంకాలంలో ప్రజలు పోరాడి సాధించుకున్న భూములను తిరిగి

లాక్కుంటూ, ఏర్పరచుకున్న గ్రామరాజ్యాలను కూలగొడుతూ సాధించుకున్న స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు, పౌరహక్కులను నేలపేసి కాలరాస్తూ కాంగ్రెసు సైన్యాల అండతో భూస్వాములు, వారి గులాములైన గూండాలు ప్రజలను చిత్రహింసలకు గురిచేస్తూ, గ్రామాలకుగ్రామాలనే పదులసంఖ్యలో చుట్టివేస్తూ, చేతికిచిక్కిన ప్రజా నాయకులను దారుణంగా కాల్చివేస్తూ తెలంగాణా పల్లెసీమల్లో కసాయికాంగ్రెసు మిలటరీ మూకలు, కాంగ్రెసుహోంగార్డు గూండాలు కరాళనృత్యంచేస్తున్న భయానక రోజులవి.

అది 1949 సంవత్సరం జనవరి నెల. అంతకుముందు పిండిప్రోలు కొండలు, ఇతర అడవి ప్రాంతాలకు వెళ్ళిన గెరిల్లా దళాలనుండి కొన్ని దళాలు తిరిగి మైదాన ప్రాంతాలకు వెళ్ళి ప్రజలతో సంబంధాలు పెట్టుకుని పార్టీ కార్యక్రమాలు నిర్వహించా లని నిర్ణయించబడింది. ఆ నిర్ణయానుసారం నేనూ, కామ్రేడ్ కొండల్‌రెడ్డి, పరొక ముగ్గురు కామ్రేడ్స్ వాలెంల, పాత సూర్యాపేట తదితర గ్రామాలు తిరిగి ఒకనాటి రాత్రి చక్రయ్య గుట్టమీదనున్న "ఏడెడ్ల కొట్టం"లో నిద్రిస్తున్నాము. మాలో ఒక కామ్రేడ్ సెంట్రీగా వున్నాడు. మిగతా నలుగురము నిద్రపోతున్నాము. సెంట్రీగా నున్న కామ్రేడ్ కాలకృత్యాలు తీర్చుకోడానికని గుట్ట క్రింద భాగములోగల పొలం లోకి దిగాడు. అప్పటికి ఉదయం అయిదు గంటలయింది.

అప్పటికే ఆ గుట్టక్రిందనున్న మర్రిచెట్టుక్రిందకు కాంగ్రెసు మిలిటరీ, హోమ్‌గార్డ్స్ దళములు చేరుకున్నవి. నైజామ్ వ్యతిరేక పోరాటకాలంలో మర్రిచెట్టు క్రింద ఏవోకొన్నివస్తువులు దాచిపెట్టారని, వాటిని స్వాధీనము చేసుకునేందుకోసము మిలిట్రీ అక్కడకు వచ్చిందని తర్వాత తెలిసింది. ఆ విధంగా మర్రిచెట్టుకింద్రికి చేరిన మిలిట్రీ, హోంగార్డులకు అదేసమయములో పొలంలో కాలకృత్యాలు తీర్చు కుంటున్న కామ్రేడ్ కనిపించాడు. ఆ కామ్రేడ్‌ను అందులోనున్న హోంగార్డులు గుర్తించి పట్టుకొనేందుకు వెంటబడ్డారు ఆ కామ్రేడ్ కొంతదూరము పరుగెత్తాడు కాని సైనికులకు పట్టుబడ్డాడు. చాలసేపు ఆ కామ్రేడ్‌ను చిత్రహింసలకు గురిచేసి మేమున్న 'ఏడెడ్లకొట్టము' దిశగా పట్టుకువస్తున్నారు.

అప్పటికి తెల్లవారి 6, 6-30 గంటల కాలము కావచ్చుచున్నది. నేను ఉలిక్కిపడి లేచాను. కాలకృత్యాలకు వెళ్ళిన సెంట్రి కామ్రేడ్ ఇంకా తన స్థానంలోకి రానందున క్షణకాలము వరకు కలవరపడ్డాను. నా ప్రక్కనే గాఢనిద్రలో నున్న కామ్రేడ్ కొండల్‌రెడ్డిని తట్టి నిద్రలేపాను. సెంట్రీకామ్రేడ్ కన్పించనివిషయంఆయ నకుచెప్పాను. సెంట్రీ కామ్రేడ్ యెందుకురాలేదో చూద్దామని కామ్రేడ్ కొండల్‌రెడ్డి జాగ్రత్తగా కూర్చొని కదులుతూ గుహ వెలుపలకు వచ్చి చూసి గిరుక్కున వెనుదిరిగి వేగంగా కదులుతూ, తాను పడుకున్న స్థానానికి తిరిగి వచ్చాడు. వస్తూనే "రంగన్నా పోలీసులు, పోలీసులు" అంటూ వినిపించీ వినిపించని ధ్వనితో చెప్పాడు

అనుకోకుండా జరిగిన ఈ ఆకస్మిక పరిణామానికి మేమంతా కొలది క్షణాలు

నివ్వెరపోయాం. తక్షణమే కామ్రేడ్ కొండలరెడ్డి ముఖ కవళికల్లో మార్పులు రావడం స్పష్టంగాగమనించాను. ముఖంలో గాంభీర్యం,కృతనిశ్చయం,విప్లవదీక్షముప్పిరిగొన్న ట్లుగాకన్పించాయి. కండ్లు ఎర్రగా చింతనిప్పుల్లా జ్వలిస్తుండగా శతృవుపైకి లంఘించ నున్న సింహ కిశోరంలా తన చేతిలోనున్న ఆయుధాన్ని గుహ వెలుపలి దిశగా వస్తున్న మిలిట్రీవైపు ఎక్కుపెట్టి కిరాతక మిలిట్రీ మూకలు సమీపించడమే ఆలస్యం కాల్చడానికి సంసిద్ధుడయ్యాడు. ఆయన అలా గుహ ద్వారానికి ఒకవైపున నిలబడి వుండగా, రెండవవైపు ద్వారము (వెనుక) వద్ద నేను నిలచియున్నాను. అంత తొందరగా కామ్రేడ్ కొండల్ రెడ్డి, నేను సాయుధసన్నద్ధులమై మిలిట్రీని ఎదుర్కో సిద్ధపడడానికి ఒక కారణమున్నది. అదేమిటంటే శతృవుచేతిలో చిక్కి నిష్కారణంగా చావకూడదు. గెరిల్లా తాను మరణించే సమయమే వస్తే చివరకు ఒక సైనికుడినయినా చంపి చావాలనే విప్లవ నిబంధన మా మదిలో మెదలడమే.

గుహలోనున్న మావద్ద చాలా పెద్ద ఆయుధాలున్నాయన్న భయంతో మిలిటరీ హోం గార్డు మూకలు త్వరగా ముందుకు రాలేకపోతున్నాయి. అడుగులో అడుగు వేసుకుంటూ బండరాళ్ళను చాటుచేసుకుంటూ గుహ దిశగా పురోగమిస్తున్నారు. ఆ సమయంలో నాకు గుహలోనుండి తప్పుకొనుటకు ఎందుకు ప్రయత్నించకూడదని ఆలోచన వచ్చింది. ఆ ఆలోచన వచ్చిందేతడవుగా గుహలోనుండి వెలుపలికిప్రాకుతూ పోవడం సాగించాను. మిగతా కామ్రేడ్స్ ఆ గుహకు పరిసరాల్లోనే ఎక్కడో ఒకచోట నక్కిదాగుకున్నారని తరువాతతెలిసింది. కానీ కామ్రేడ్ కొండల్ రెడ్డి తప్పుకోడానికి అవ కాశంచిక్కలేదు. శతృవుదృష్టి ఆయనమీదపడి సమయంమించిపోయింది. నేను అలా కొంతదూరం ప్రాకానో లేదో అటు గుట్ట క్రిందనుండి ఒకదళం ఆ దిశగానే గుహ వైపు వస్తున్నది వాళ్ళను చూచి నేను అక్కడున్న ఒక బండరాయి చాటుకు నక్కి పడుకున్నాను. మిలిటరీ వాళ్లు నన్ను చూడకుండా ముందుకువెళ్ళారు. ఆ తర్వాత మళ్ళీ అదేవిధంగా గుట్టపై పడుకుని దక్షిణ దిశగా ప్రాకుతూ వెళ్ళాను. కానీ ఆ గుట్టదిశగా జారుడు బండవలె నున్నగావుండి దిగటానికి వీలులేని విధంగా వుండటం వలన గుట్టకు పడమర దిశగా ప్రాకటం మొదలుపెట్టాను కానీ అంతలోనే మరికొంతమంది మిలిట్రీవాళ్ళు అక్కడినుండి "ఏదెడ్ల కొట్టం" దిశగా ఎక్కి వెళుతున్నారు. వాళ్ళ దృష్టి ఎంతసేపటికీ ఆ గుహవైపే కేంద్రీకరించబడటం వలన ప్రక్కనే చాటుననక్కి వున్న నన్ను గమనించలేకపోయారు. అవకంగా నేను తప్పుకొని గుట్టదిగి, చెరువుకట్ట మీదుగా తూము వద్దకు వెళ్ళగానే వేసంగి పొలాలు దున్నేందుకు నీరు తీసుకవెళ్ళడానికి తూమువద్దనున్న రైతు నన్ను చూశాడు. అయితే నేను అలా వెళుతున్న సంగతి ఎవరికీ చెప్పకూడదంటూ రైతును హెచ్చరించి ముందుకు సాగుతుండగానే అంత వరకు ఆ ప్రాంతమంతా ఆవరించివున్న గంభీర నిశ్శబ్ద వాతావరణాన్ని భగ్నంచేస్తూ "ఢాం" అనిమ్రోగిన తుపాకీ దెబ్బతో ఆ ప్రాంతమంతా కల్లోలం రేగింది.

అతిచేరువలోకి సమీపించుతున్న శత్రువును నిరోధించుటకు కామ్రేడ్

కాన్సన్‌ట్రేషన్ క్యాంపుల్లో ప్రజా జీవితాన్ని కకావికలుచేస్తూ పాలకులు తమ కొత్త [illegible] చెప్పుకొంటూవుండగా ప్రజల ముఖాల్లో విషాదచ్ఛాయలు గాక వింత రంగుల్లో కాంతులు ఎలా కనుపించగలవు?

కామ్రేడ్ కొండల్‌రెడ్డి చనిపోయినా కాంగ్రెస్ కిరాతకుల పగ చల్లారలేదు. మిగిలివున్న మమ్మల్ని కూడా పట్టి పట్లార్పితేగాని వాళ్ళ హృదయాన్ని చల్లారేట్టులేదు. అందుకని ఆ ఏడెడ్ల కొట్టము అను గుహను, దాని పరిసర ప్రాంతాలను తీవ్రంగా గాలించారు. వాళ్ళు గాలించడమేగాక పాత సూర్యాపేట గ్రామంపెళ్ళి జనాన్ని బెదిరించి పట్టుకు వచ్చి గుట్టంతా వెదకించారు కాని ఫలితం శూన్యం. చివరకు ఆరోజు సాయంత్రం 4 గంటలకు కాని వాళ్ళు గుట్ట విడిచివెళ్ళలేదు.

మిలిటరీవాళ్లు చక్రయ్యగుట్టను విడిచివెళ్ళిన తర్వాత నేను అక్కడ్నుండి వెలుపలికి వచ్చి ఆరెగూడెం చేరుకున్నాను. ఆ పాటికే చక్రయ్యగుట్టమీద జరిగిన దాడి, అందులో కొండల్‌రెడ్డి చనిపోయినవార్త విన్న ప్రజలు విచారసాగరంలో మునిగివున్నారు. దాడిలోనుంచి తప్పించుకొని బయటపడ్డ నన్నుచూసి కొంతవిచారాన్ని మరచిపోయారు. సంక్రాంతి పండుగ సందర్భంగా వండుకున్న పులగం (బియ్యం, పెసరపప్పు కలిపివండిన వంటకం) పెట్టి వసతి ఏర్పాటుచేశారు. తరువాత [illegible] దళంతో చేరిపోయాను. కాని ఈ కాంగ్రెసు పెనుభూతం [illegible] విడిచిపెట్టలేదు. ఆ రాత్రి మళ్ళీ మిలిటరీవచ్చి గ్రామప్రజలను [illegible] చెప్పమని కర్రలతో కొడుతున్నారు. బాధలు,బందాలు వెతకాలని [illegible] నాకు భోజన ఏర్పాట్లు చేసినవారిలోనుండి ఒకరు [illegible] నన్ను సురక్షితంగా తప్పించారు.

చక్రయ్యగుట్టపైన దాడి జరిగిన రోజేగాక ఆ మరునాడు కూడా కాంగ్రెసు [illegible], [illegible] గుండాలదాడులు పాతసూర్యాపేటకు చేరంగానున్న [illegible] జరిపించినవి. అనేక గ్రామాలలో ప్రజలను మందలు మందలుగా [illegible] పంటపల్లి, ఉమ్మాపురం, వట్టికంపాడు [illegible] 1951 నుండి ప్రజలకు [illegible] మాత్రమే మిసాలు [illegible] కాంగ్రెసు పాలకులు తమ అత్యంత [illegible] స్వభావాన్ని బహిర్గతం చేసుకున్నారు.

[illegible] సాయుధ ప్రజా ఉద్యమానికి, కాంగ్రెసు మిలిటరీ పాలనకు వ్యతిరేకంగా తెలంగాణా ప్రజలు సాగించిన వీరోచిత రైతుకూలీ సాయుధ గెరిల్లా పోరాటంలో [illegible] జరిగినలాంటి దాడులు వందలు. అలాగే ఆ మహోజ్వల పోరాటంలో ప్రజలకోసం అవలీలగా ఆత్మబలిదానం చేసిన కామ్రేడ్ కొండల్‌రెడ్డి లాంటి [illegible] వేలకువేలు.

అందుకనే కామ్రేడ్ కొండల్‌రెడ్డిని స్మరించుకుంటూ ప్రజలు ఇలా పాడు కుంటున్నారు.

రాయివంటి కొండల్‌రెడ్డి పోయాడోయ్!
మనకంతటికి దారిచూపి పోయాడోయ్!

**- రాచకొండ రంగయ్య**

# 16

# శత్రుమూకను దునుమాడేందుకు మహాప్రవాహంలాకదలిన గ్రామీణులచైతన్యం

నైజాం ప్రభుత్వం తెలంగాణా ప్రజల పోరాటాన్ని అణచటానికి మార్షల్ లా ప్రకటించింది. ప్రజా ఉద్యమానికి కేంద్రాలైన గ్రామాలపై పెద్దఎత్తున పోలీస్ దాడులు ప్రారంభమయినాయి. పాత సూర్యాపేట, బాలెంలతోపాటు దేవరుప్పుల గ్రామంపై అర్ధరాత్రి దాడి జరిగింది. వెంటనే గ్రామం మధ్యలోని సంఘ ఆఫీసు పైనున్న ఢంకా దెబ్బ మోగటంతో ప్రజలంతా గ్రామానికి ఏదో ఆపద సంభవించిందని మేల్కొన్నారు. యువకులు, యువతులు కర్రలు, వడిశలలు, రోకటిబండలు చేతపుచ్చుకుని తమ గ్రామాన్ని చుట్టివేయజూస్తున్న నైజాం సాయుధ బలగాన్ని గ్రామంలోనికి ప్రవేశించకుండా రివ్వుమని వడిశల వర్షం కురిపిస్తున్నారు. తెల్లవార్లు గ్రామంలోనికి సైనికులు ప్రవేశించనీయకుండా నిలవేశారు ప్రక్క పల్లెల యువకులు వడిశలలతో రాళ్లు విసురుతూ వెనుకవైపు నుంచి దాడిచేశారు. వెనుకనుండి వచ్చిన యువకులు పోలీసు కాల్పులలో నేలకొరిగారు.

ఆ మరుక్షణమే చుట్టు ప్రాంతాలకు దేవరుప్పల గ్రామంపై జరిగిన దాడి వర్తమానం అందిన వెంటనే రామన్నపేట తాలూకా కోటమర్తి, అడ్డగూడూరు, పడిశాల, బుజులాపురం, అనాజుపురం, దాచారం, పాటిమట్ల, రాపాక, కపరాయిపల్లి, గుండాల, చిర్రగూడూరు, తాటిపాముల, జానకీపురం, వెల్దెసి, మనిమిద్దె, గురజాల మొదలగు గ్రామాలనుండి మూడువేలమంది వలంటీర్లు కర్రలతో, వడిశలలతో ఆ మహాజన ప్రవాహం వేగే గ కదలింది.

కొండూరు గ్రామం చేరేసరికి రాత్రి అయినది ఆగ్రామంలో నాలుగుబస్తాల బియ్యం వంటచేశారు. భోజనాలుపెట్టారు. మరునాటి ఉదయమే ప్రవాహంలా యీ మహాజనం దేవరుప్పల గ్రామానికి కదిలింది. దారిలోనడుస్తూ కొమ్ముసైగతో చుట్టి వేయడం, శత్రుకాల్పులలో బోర్లపడుండి తప్పుకునేపద్ధతి వగైరాచేస్తూ ముందుకి సాగారు. అప్పటికే ఒక గుంపు దేవరుప్పల గ్రామంపై దాడిచేసి ఆ గ్రామస్తులను నానాబాధలుపెట్టి పట్టుకెళ్ళి మొండ్రాయిక్యాంప్‌లో పెట్టారు దేవరుప్పల కార్యకర్తలను విడిపించుకోటానికి అక్కడిజనం మొండ్రాయిక్యాంప్‌పైదాడిచేశారు. ఆక్యాంపునుచుట్టి వేసిన జనాన్ని కాల్పులు కాల్చితరిమారు. ఆ జనం తిరిగివస్తూ ఈ జనప్రవాహంలోకలి సింది. అంతా ఆ దేవరుప్పల గ్రామంచేరేసరికి జనగామ తాలూకా దేవరుప్పల గ్రామం చుట్టుప్రాంతాలప్రజలు రెండు మూడువేలమంది సమీకృతులయ్యారు. అంతా ఒకేచోట కలిసేసరికి వూరిప్రక్క వాగు ఒకపెద్ద ప్రజలప్రవాహంగా మారింది. ఆ జనం దేవరుప్పలగ్రామంలో ఊరేగింపుతీశారు. వూళ్ళోని వీధులన్నీతిరిగారు. వూరిబయట జనం యింకామిగిలేవున్నారు. ఊరేగింపుఎటూనడవటానికి గ్రామవీధుల్లో చోటులేదు. ఎక్కడివారక్కడే నిలబడి నినాదాలు చేయవలసివచ్చినది. బయటనుండి వచ్చిన వేలాది వలంటీర్లను, జనాన్నిచూచి దేవరుప్పల గ్రామప్రజలు తమపై జరిగినదాడి బీభత్సాన్నే మరిచిపోయారు. ఎక్కడలేని నూతనోత్సాహంతో చాలా పెద్దమొత్తం ధాన్యాన్ని ప్రోగుచేసి వంటలుచేసి రాసులుపోశారు. ఇంటింట వంటలు చేశారు. అవి వచ్చినజనానికి అందరికీ సరిపెట్టేందుకు ఎలాగో సాధ్యమయింది. వచ్చినజనం వూరేగింపుతో సంతృప్తిచెందలేదు. మొండ్రాయిక్యాంపుపైబడి దేవరుప్పల నుండి పట్టుకెళ్ళిన రైతులను, కార్యకర్తలను విడిపించుకొనటానికి దాడిచేద్దామని పట్టుబట్టారు. కేవలం వడిసెలలతోదాడి ఎలాసాధ్యమని ఎంతచెప్పినా వినకుండా ముందువరుసచావగా వెనుక వరుసపై పడతామంటూ పట్టుబట్టారు అప్పుడు సాయుధులతో ప్రతిఘటించటా నికి కావలసిన సన్నాహాలు మొదలగువిషయాలు ఎన్నోవివరాలు చెప్పి అచ్చటనున్న ముఖ్యబాధ్యులమంతా చాలాకష్టంగా ప్రజలను కాపాడడమైంది. ఈ పోరాటంలో సాయుధులతో ప్రతిఘటించుటకై ప్రత్యేకశిక్షణ పొందాలనేవాంఛ రైతుకూలిబిడ్డలలో ప్రబలసాగింది.

## శాలిగౌరారం పోలీసునాకాపై దాడి

నైజాం రజాకారు గుంపులు పోలీసు సహాయంతో గ్రామాలపై వుధృతంగా దాడులుచేస్తున్నరోజులవి. రైతుకూలిబిడ్డలు, రజాకార్ల పైశాచికదాడులనుండి,దొమ్మీల

ఒకటి రెండు అంగలు ముందుకు వేయగలిగితే తప్పకుండా సాయుధ రజాకారుపోలీసు మూకలందరు ఒకరిద్దరినయినా నేలకూల్చే వాడు. ఇంతలోనే రైఫిల్ గురిపెట్టి పేల్చి ఉన్నా పైబడి ముందుకు సాగుతూనే ఉన్నాడు. నరాంతక నైజాం పోలీసు తుపాకి నుండి ఆ వీరుని నుదుటి నుండి దూసుకుపోయింది. 'సంఘానికి జై' అంటూ ఆయుధాన్ని పట్టి ఉంచి దిగాలైపోయిన ఆ వీరుడు గుప్పిట్లో పడిపోయాడు కరాకిదెబ్బకు పొడిచెటి లింగయ్య అను యువకుని పొట్టలోని పేగులన్నీ నేలకారి మృతిచెందాడు

దానితో వాలంటీరు జనము వెనుకకు తగ్గవలసి వచ్చింది. ఇంతలో నిద్రనుండి లేచిన రైతుకూలీలు చూసేసరికి వలంటీర్లంతా తప్పుకుంటున్నారు. వెంటనే ఆ ప్రాంత దళనాయకుడు ఈ పరిస్థితిలో ప్రాథమికదళంలోనున్న ఒకడు వెనుకడుగు వేసినా ముందుకెళ్ళి తన చేతిలోనున్న 'ట్వెల్' తీసి ఎదురుకాల్పులు చేయబూనగా శత్రువు రైఫిల్ గుండ్లవర్షం కురిపించసాగాడు. ప్రక్కనేవున్న రాతికట్టీల దొడ్డిచాటున 'బ్లాక్' చాటుతో ముందుకువస్తున్న నైజాం పోలీస్ రజాకార్ మూకలపై కాల్చగా ఆ గుంపులో ఏడుగురు అక్కడికక్కడే నేలకూలారు. ఆ కారుచీకటిలో పడిపోయిన, గాయపడినవారిని తీసుకొని పోలీస్ రజాకార్ మూక పారిపోయింది

కాల్పులు ఆగిపోవటంతో నలువైపుల పరికించిచూచి ఇటు కాల్పులలో పడిపోయినవారిని పరికించగా కిన్నెదోయిన సాయన్న నుదిటినుండి రక్తం ధారాపాతంగా ప్రవహిస్తోంది. గురకలుపెస్తూ కళ్ళుడిల్లిపోతున్నాడు. పొడిచెటి లింగయ్య ప్రేవులు బయటపడి మరణించివున్నాడు.

వెంటనే అందుబాటులోవున్న దళసభ్యుడు సూర్యనారాయణను గ్రామంలోనికి వెళ్ళుచున్న వాలంటీర్ జనాన్ని వెనుకకు తీసుకరండి, శవాల్ని పొందుపరచాలని చెప్పుతుండగా రెండవసారి క్రమేపి వచ్చాడు. పడియున్న శవాన్ని, కిన్నెదోయిన సాయన్నను ఎత్తుకవచ్చి, ఒక రైతు ఇంటిలోని దొడ్డిగాడిపై పడుకోబెట్టి కాపలాలు చేరలా పోస్తుండగా తెల్లవారుచున్న సమయములో తిరిగి పోలీస్ రజాకార్ మూక కాల్పులు చేస్తూ దాడికి వస్తోంది. ఈ సంగతికనిపెట్టి ఒకగంట ఆ మూక ముందుకు రాకుండా ఎదురుకాల్పులలో నిలవేయటం జరిగింది. శత్రువు రైఫిల్ పేల్చగా దెబ్బతాకి మావెనుక ఒక ఫర్లాంగుదూరంలోవున్న ఒక విద్యార్థుడు గోవులేని (కృష్ణారెడ్డి) - పొదలోనుండి దూసుకపోయింది. అతడు కేకలువేస్తూ విలవిల తన్నుకుంటున్నాడు. ఒక్కొక్కరము విడువడి చేయజాలమని ఎంచి క్రమంగా వెనుకకు తగ్గవలసివచ్చింది. దళం వెనుకకుపోయిన తర్వాత ఒకగంటకు అరిచేతిలో ప్రాణాలు పెట్టుకొని ఆ నైజాం సాయుధమూక గ్రామములోకి ప్రవేశించింది. వెంటనే కొనప్రాణాలతోవున్న కిన్నెదోయిన సాయన్న పొట్టలో బాయ్‌నెట్‌తో పొడిచి చంపారు. ఆ ఇద్దరి వీరుల శవాలను ఆ రైతులతో మోయించుక వెళ్ళి అడ్డగూడూరు సమీపంలో పూడ్చివేశారు. ఆ రోజే పోలీసుదళం కాల్పుల్లో ముగ్గురు చనిపోయారని నలుగురు తీవ్రంగా గాయపడ్డారని వార్త అంతటా వ్యాపించింది

ఇద్దరు వీరులను కోల్పోయినా ప్రజల మనోనిబ్బరం చెదరలేదు శత్రువును తరిమికొట్టాలనే దీక్ష దళంలో పెరిగింది.

- కె. కృష్ణమూర్తి

# 17

## 'ఆయుష్షు పట్టు'

"పిల్లా! ఓ పిల్లా!! లేవవేమే!! ఇంకా తెల్లారలేదా!!!" అని లేపుతోంది తనబిడ్డను లచ్చమ్మ. 55 ఏండ్ల వయస్సు నడచిన నడిగాయ. ఆజాను బాహుమనిషి, నవయువకులుగా ఇద్దరు కొడుకులు, 12 ఏండ్ల కూతురు. జీవితంలో అన్ని దక్కా-ముక్కీలు తిన్న మనిషి. వయస్సు మళ్ళినప్పటికీ బలంగావుండి ఇంటి, వ్యవసాయ పన్నులన్ని తానే చేసుకుంటుంది.

"ఈ పిల్ల లేవదాయెను! ఏందిది!! ఇది పెండ్లికి ఎదిగిందిగాని తెల్లారితే ఏంజరిగేది దీనికి పట్టనట్లుంది. ఏమోనమ్మా ముందెట్ల బతుకుద్దో! లేవే గంగమ్మా ఊళ్ళోఅప్పుడే అంతాలేచి తయారవుతుంటే ఇంకా లేవవేందే" అని బిడ్డరెక్కపట్టి లేపుతోంది.

"ఏంపే ఇంతపొద్దుగాల చీకటితోనే లేపుతావూ. యేంబడిపోయిందని?"

"ఏంబడి పోయేది నీకేమి తెలుసుద్ది-యాలకు పెడితే తినేదానివి-సరేగాని లేచిపొయ్యి రాజెయ్యి, నేను పాలుపిండుకొస్తా. రాంరెడ్డి వస్తాడట. దళం వస్తుందట, కాఫీ చేద్దాం"

"రాంరెడ్డి వస్తాడే? ఎందుకే ఇయ్యాల ఊళ్ళో సభ వున్నదా?"

"ఓ! ఒక్క సభేనా!! ఊరంతా పెద్ద పండగ చేసుకుంటుంటే. ఇయ్యాల సంఘపోరు భూములు పంచుతారట"

"ఎవరి భూములు పంచుతారే?"

"రెండువందల ఎకరములకు మించినోరి భూమి లేనోరికి పంచుతరట. వెనకటి పంటేడు అన్యాయంగా తీసుకున్న చెలకలు గూడా యెవరిది వారికి ఇస్తారట."

"మరి మన చెల్కలు పటేండ్ల చేతుల్లో వున్నాయి. మనకొస్తాయె?"

"మన ఒక్కరిదేంది : ఊళ్ళో ఎవరిది వారికి ఇస్తారు. సరేగాని నీకెందుకే ఈ రాద్ధాంతమంతా లేచి మొఖం కడుక్కొని పొయ్యిరాజెయ్యి".

అని బిడ్డకు లచ్చమ్మ చెప్పగానే బిడ్డ గంగమ్మ మొఖం కడుక్కొని పని ప్రారంభించనే ప్రారంభించింది. ఇటు లచ్చమ్మ బుర్రకు ఎక్కడలేని ఆలోచనలు తెప్పలు, తెప్పలుగా వస్తున్నాయి. గ్రామంలో భూపంపకం జరుగుతుందన్నవార్త విన గానేఅదేదో కొత్త ప్రపంచంలో తాను ప్రవేశించినట్లయింది. తనది 55 సంవత్సరాల జీవితం. తన పన్నెండేండ్ల బిడ్డ గంగమ్మకన్నా చిన్ననాటినుండి చేత కొడవలి పట్టి కోయని పొలమంటూలేదు వూళ్లో. తర్వాత తన భర్తతో కలసి రెక్కలు పిండి చేసు కున్నది. మొండి ఎద్దుల్లా రాత్రింబవళ్లు కష్టం చేశారు. ఆ మొండి కష్టమంతా తన శరీరం మీదపడి వంటినిండా ఎక్కడికక్కడ కాయలు కాచి సజీవంగా ఇంకా నిలిచే వున్నవి. ఆ మొండి కష్టము రోజురోజుకు పెరుగుతున్నది తప్పితే తరగడం లేదు. ఆ మొండి కష్టంతోనే తన భర్త జబ్బునపడి చనిపోయాడు ఇంతకూ ఇన్నేండ్ల కఠిన జీవితంలో తనకు మిగిలిన ప్రతిఫలమేమిటి? 'ఆయువుపట్టు' పదెకరాల ఎర్రగడ్డ చెలక పటేలు వశమయింది. ఈ అమూల్యమైన ఎర్రగడ్డ తమ చేయి జారిపోనంతవరకు జీవితంలో ఎన్ని ఒడిదుడుకులు వచ్చినా దాన్ని ధైర్యంతో తాను, తన భర్త జీవితాన్ని ఈడ్చుకరాగలిగారు. అంతేకాదు, ఈ పంటతల్లి తన ముందున్నంత కాలం తాము ఈ దుస్థితినుండి తేరుకోగల రోజులు ఒకసారి కాకున్నా మరొకసారైనా రాకపోతాయా అనే ఆశ తమలో మెదులుతూవుండేది; కానీ ఈ "ఆయువుపట్టే" తమనుండి దొంగి లించబడటంతో తమ ఒకేఒక ఆశాజ్యోతి ఆరిపోయింది. ఇక తమకు మంచిరోజులు రాగలవన్న ఆ యింత దింపుడు గల్లం ఆశా నశించిపోయింది.

ఇంతకూ ఈ ఎర్రగడ్డ లచ్చమ్మ చేతినుండి ఎలా దొంగిలించబడ్డట్లు? ఆమె దుఃఖరసగాథ గ్రామాధికారులుగావున్న దొరల దుర్మార్గానికి ఇది శాశ్వతసాక్ష్యం.

లచ్చమ్మ కాపురానికివచ్చిన తొలిరోజులవి. నాడే పటేలురాజయ్య కన్నుతమ ఎర్రగడ్డపై బడింది. నాటికి తమ అప్పులు అసలు నాగులు కలుపుకొని మూడుపుట్ల ధాన్యానికి అందుకన్నదని ఇందుకు తమఎర్రగడ్డ తమస్వాధీనం చేయడమే గత్యంతర మని పటేలు రాజయ్య తన కుట్రను బయట పెట్టాడు. ఇది విన్న తన భర్తకు ప్రాణంలో ప్రాణం లేకుండా పోయింది. యిచ్చిన అసలు ధాన్యం పందుము (అర

పుట్టి)కు నాలుగు నాలుగు కలిసి మూడు రెళ్లు ముప్పందుం. ఆ మరునటి సంవత్సరమే తన భర్త నిండు కష్టంలో పటేలును కొలిచాడు. అయినా మూడుపుట్లెక్కడివి ? లభవా పోసి ఈ మూడు పుట్లేసాడు, ఆరు పుట్లయినా సరే తమ యిల్లు వాకిలి తాకట్టు పెట్టి యిస్తారు విధిలేనప్పుడు. కాని తమ "అయువుపట్టు"కే ఎసరువచ్చిందికదా ! అందువల్లే సహజంగానే లచ్చమ్మ భర్త తన ప్రాణాన్నైనా ఒడ్డంగా పెట్టి తన ఎర్రగడ్డను కాపాడుకోవలసాడు. సహజంగానే ఆదర్శపోరాటంలో తన భర్తవెంట నిలబడదలుచుకుంది లచ్చమ్మ. అందువల్ల అనేకసార్లు పటేలు రాజయ్య కొందరి ఏజంట్ల బలంతో సాగించిన దుర్మార్గాన్ని తాను, తన భర్త, ఇరుగుపొరుగు రైతులు, తన పాలివారి అండదండలతో ప్రతిఘటించి భూమినిల్పుకున్నారు. అంతటితో దుర్మార్గుడు రాజయ్య ఊరుకోడుగా ! వెంటనే కోర్టుకీడ్చాడు. ఈ కష్టజీవి దంపతులు కోర్టులో తనకు వందల బాకీ ఉన్నారని దొంగదస్తావేజులు దాఖలు చేయించాడు కావలసిన దొంగసాక్ష్యానికి స్వయంగా తన పాలివాండ్లలోనే వున్న ఒక ఫుండాకోరును ఉపయోగించుకున్నాడు. అయినా తాను, తన భర్త కట్టెకు సద్దిమూట కట్టుకొని కోర్టులచుట్టూ పక్షులవలె తిరిగి తిరిగి వున్న కాస్త నగ, నాణ్యం గుల్లచేసుకొని కొత్తఅప్పులకు గురియయ్యారు. అయితేనేం, జరిగేతీరుగానే జరిగింది ! కోర్టుఆర్డరు పటేలుకు అనుకూలంగానేఇచ్చింది. ఆ దురుపుముక్కను చేతబట్టుకొని పటేలు సాయుధ పోలీసుబలగంతోగూడా దిగి లచ్చమ్మ దంపతుల 'అయువుపట్టు'ను పట్టపగలు దొంగిలించాడు.

ఈవిధంగా ఎన్నో ఒడుదుడుకులతో అనేక గండాలతో సాగిపోయిన తన సుదీర్ఘ జీవనయాత్రలో ఎన్నడూ కనీవినీ ఎరుగని అసలుభూమి పంపకం జరగగలదనే వార్త వినగానే అది లచ్చమ్మకు మింగుడు పడలేదు. ఆమె దాన్ని పూర్తిగా నమ్మజాలలేదుకూడా. ఎలా నమ్ముతుంది? తన జీవితంలో ఎందరో ఎన్నో చెప్పారు. అలనాడు రాముడు, కృష్ణుడు దుష్టులను శిక్షించినట్లుగానే ఒక కొత్త అవతార పురుషుడు భూలోకములో ప్రజలందరికీ సౌఖ్యము చేకూర్చుతాడని వారి గురువులెందరో ఎన్నో సార్లు బోధించారు. తర్వాత తురక సర్కారుపోతుంది. హిందూ సర్కారు మనకు వస్తే మంచి రోజులు వస్తాయని వారెవరో ఆర్యసమాజ పోరటం వారు చెప్పారు. అలనాటి రామునిపోలె నేడు భగవంతుడు గాంధీఅవతారమెత్తాడని,స్వరాజ్యమొస్తుందని పటేలు మల్లారెడ్డి ఏమోమో బోధ చేశారు ఇవన్నీ చెప్పిన జ్ఞానబోధనలు బోధనల తీరుగానే వున్నాయి. తన పేదరికము పేదరికముగానే వుంది ఇవేవీ రాశికి రంగానికి రాకుండా గాలిలో మాయమైపోతున్నప్పుడు యీ క్రొత్తగా వింటున్న భూమి పంపకం అసలు జరగగలదా అని! ఇదివరకు జరిగిన బోధనలు పటేండ్లకే అక్కరకువచ్చాయి. చీమల్లా తుక్కుగా పుట్లొస్తున్నతను తన తోటి పేదల అభాగ్యులకక్కరకొచ్చే ఈ క్రొత్త బోధన నెగ్గగలదాయని! తాను ఏనాడో ఆశ వదులుకున్న తన అయువుపట్టు ఒకే ఒక ఆశాజ్యోతి ఎర్రగడ్డ తిరిగి తన చేతికి రాగలదా అని? ఇవే లచ్చమ్మ మెదడులో పరుగులు తీస్తున్న ఆలోచనలు. ఈ ఆలోచనలతోనే లచ్చమ్మ ఆ పీటల్లో మాదను

పొంగు పెడుతుంది. పాలు పిండింది. పిండినపాలన్నీ రాంరెడ్డికి ప్రత్యేకించుంచి. ఎందు కంటే రాంరెడ్డిలో చాలా మార్పునని లచ్చమ్మకు తెలుసు.

"ఎవరు? ఏమి పెద్దమ్మ, రొంపరగా లియ్యి నేను పోవాలె" అని బయట కేక వినిపించింది.

ఆ పిలుపు గంగులుది గానున్నదని అర్థం చేసుకొని వెంటనే పోయి తలుపు తీసింది. తీయగానే గంగులు ప్రవేశించాడు. మనిషైన 30 ఏండ్ల వయస్సుగల యువ కుడు. చక్కని పొడవుమనిషి, సౌమ్యమైన ముఖం. ఇవాళ ఏదో మహా హడావుడిగా పనిలో మునిగి యున్నట్లున్నాడు. లోపలికి వచ్చిందే తడవుగా-

"ఏం పెద్దమ్మా పాలు పిండియ్యాల"

"దేనికిరా పిలగా పాలు"

"దేనికా! ఇంకా నీకెరుకలేదన్నమాట!" కొంచెమాగి "అమ్మో మా పెద్దమ్మకెరుకగానిది వుంటాది. ఊకనే అట్లుంటుంది గని! సరెగని నాకు పనివున్నది. నేను తొందరగా పోవాలె" అంటూ గంగులు వెనుకకు తిరిగి పోవోగా "ఉండు పిలగా ఏందాతొందర? ఎప్పుడూ తొందరేమిరా మీకు సరిగాని సంగతేదో చెప్పు."

చెప్పులో కాలుపెట్టి "ఏం చెప్పమంటావు పెద్దమ్మా, ఇయ్యాల మన ఊళ్ళో పెద్ద సంబరం. రాంరెడ్డి అప్పుడే వుళ్ళోకొచ్చిండు. కాసేపట్లో పెద్ద ఊరేగింపు. ఆ ఊరేగింపులో తప్పక నుండాలె పెద్దమ్మా."

"రాంరెడ్డి అప్పుడేవచ్చినాడ్రా" గంగులు వెనకకు తిరిగి తలుపు రెక్క పట్టుకొని "వచ్చిండొచ్చిండు! దళం గూడా వచ్చింది. మీ అప్పయ్యగూడా వచ్చాడు" అనుకుంటూ గంగులు ద్వారండాటి వెళ్ళనే వెళ్ళాడు.

"అబ్బ ఎంత ఉత్సాహము ఈ పిలగానికి సంఘం పని అంటె" అంటూ లచ్చమ్మ హృదయంలో కొత్తఆలోచన మెదిలింది. ఈ ఆలోచనల్లో ఒకవంకమునిగి తేలుతూనే పాలుబిడ్డకిచ్చి కాగపెట్టించుకున్నది. తాను బియ్యం గాలించుచుండగా తిరిగి తనలో గంగులుమన్న ఆలోచనావరస సాగింది. ప్రపంచంలో ఎన్నడూ అనుకోని మార్పులు జరుగుతున్నాయి. తన మామ ఉన్నప్పుడు మంచములోపడి దగ్గుతూ, మూల్గుతూ అదృష్టముంటే పిచోడుగూడా గొప్పోడవుతాడని యాదవుని యింట్లో పెరిగిన కృష్ణమహిమ ఎవరికి తెలుసునని, అందువల్లి నేడు కూడా అటువంటి మహాపురుషుడు ఎవడో తేలకమానడని ఏమేమో వాగేవాడు.

అయినా వాటిని తాను, తన ఇంటిల్లాదులంతా అదంతా ముసలివాని మూల్గుడు క్రింద పెట్టేవారు. కాని ఈ గంగులు చూస్తుంటే తమలోనుండి గూడా వూరినేలేవాడు తేలాడే! నిజంగా ఈ పిలగాడు ఊరుకు నాయకుడయ్యాడు నేడు. వాడంటే వూరంతా ప్రాణమిస్తారు. అసలు వాడు వూరంతటికీ ప్రాణం. వాడు తన కళ్ళముందర పుట్టిన పిల్లవాడు వాని బ్రతుకుతెరువు చూద్దామంటే తనకంటే అన్యాయం. తిప్పితిప్పికొడితే

అయిదెకరాలు కుప్తి-(మెట్ట)లేదు. అటువంటి గంగులు నేడు ఊరికే అధిపతి. ఊరికే నాయకుడు. అబ్బ ఎంతమార్పు! అంటూ ఆలోచన సాగిపోతూంది.

బియ్యం గాలింపు పూర్తిచేసి వేరు పొయ్యిమీద ఎసరుపెట్టింది బయట కేకలు, జోరుగా కేకలు.

ఆంధ్ర మహాసభకు జై!
కమ్యూనిస్టు పార్టీకి జై!
దున్నేవానికే భూమి!
నిజాంను గద్దెదింపాలె!
ప్రజారాజ్యం వర్ధిల్లాలె!

ఈ వూరేగింపు కేకలు విన్న బిడ్డ గంగమ్మ బయట గడపదాటింది. లచ్చమ్మకు హృదయం ఆగడం లేదు హృదయం రెక్కలు గట్టుకొని ప్రదర్శనవైపు పరుగెడుతున్నది. ఇంతలో ఎసరుకాగ్గానే బియ్యంపోసి ఆ కుండను,పాలకుండను మూతలు పెట్టి బయటకు దౌడుతీసింది. వూరేగింపుకూడా ఇంటిముందుకు రానేవచ్చింది వూరేగింపును చూసేసరికి, అబ్బా! ఎక్కడి జనం, వూరంతా మూలనున్న ముసలమ్మలతో సహా, పొరిగింటి లేవలేని ముసలమ్మ, యల్లమ్మకూడా వూరేగింపులో వున్నదే! నిండు చూలాలు తనయారాలుయొక్క కోడలు పిచ్చమ్మకూడా వూరేగింపు వెనకాలే గెంతుకుంటూ వస్తున్నదే! అని పరిపరివిధాలా మదిలో తలచుకుంటూ లచ్చమ్మ వూరేగింపును తలెత్తి ఎవరికోసమో నిక్కినిక్కి చూడసాగింది. తనలాగానే అనేకులు ఎవరికోసమో వెదుకుతూ ముందుకు తోసుకుపోతున్నారు. ఇంతలో ఒకాయన వూరేగింపులో ముందుశ్రేణివైపు వేలుపెట్టి చూపుతున్నాడు. అదుగో, అదుగో ఆయనే రాంరెడ్డి ముఖంనిండా నీరు కారుతోంది. భుజాన మూరెడు చిన్న తుపాకీ, ఖాకీ దుస్తుల్లో గంభీరంగా వున్నాడు. వయస్సు వాడయ్యాదే అప్పుడే! ఏదో చిన్నప్పుడు బంధువుగా పటేలు మల్లారెడ్డి ఇంటికి వచ్చినపుడు తానుచూసింది . అయితే ఆ రాంరెడ్డి ఎక్కడ! ఈ రాంరెడ్డి ఎక్కడ! నాడు రాంరెడ్డి పటేలు మనిషి-నేడో! తనలాంటి కోటానుకోట్ల అభాగ్యుల మనిషి. అంతేకాదు, తమ సంఘం మనిషి.

ఈ ఆనందంతో లచ్చమ్మ ఊరేగింపు మధ్యలోకి చేరుకోనేచేరుకుంది. అంతేకాదు, తన కళ్ళముందరి పిల్లివాడు గంగులు, తన చిన్నకొడుకు అప్పయ్య నినాదాలు యిస్తుంటే జవాబు నినాదాలతో వందల గొంతులతోపాటు తన గొంతుకూడా తనకు తెలియకుండానే ప్రతిధ్వనించసాగింది ఇంతలో ఊరేగింపు గ్రామం బయటలో గల మైదానానికి చేరుకుంది సభ గ్రామనాయకుడు గంగులు అధ్యక్షతన ప్రారంభమైంది. రాంరెడ్డి అక్కడవున్న ఎత్తుగడ్డమీద నిలబడి తన ఉపన్యాసం సాగించుచున్నాడు. సమాజంలోగల కరువుకాటకాలకు, పేదరికానికి నేడు జమిందారీ విధానము ఎలా మూలకారణంగా పనిచేస్తున్నదీ వివరించాడు.

ఈ దుష్టవిధానంపోయి కొంతమంది బడా జమీందార్ల చేతుల్లోగల లక్షల

ఎకరాల భూమి, కోటానుకోట్ల ప్రజలచేతికి వచ్చినపుడే ప్రజల ఆర్థిక, రాజకీయ విద్యాభివృద్ధి సర్వతోముఖంగా సాగిపోతుందని వివరించాడు. అందువల్ల కమ్యూనిస్టు పార్టీ, ఆంధ్ర మహాసభలు భూపంపక కార్యక్రమాన్ని నిశ్చయించాయని తెలుపుతూ :

"కమ్యూనిస్టుపార్టీ,ఆంధ్రమహాసభలఆదేశాలననుసరించిఈగ్రామంలోగూడా భూమిపంపకం సాగిపోవుటకు నిర్ణయించబడినది. ఆ పని యివాళనుండే ఈ గ్రామంలో ప్రారంభించడానికి నేను యివ్వాళ ఇక్కడకు వచ్చాను. ఈ గ్రామ కమిటీ ఆధ్వర్యాన ఈరోజు భూమిపంపకం ఆరంభమౌతుంది. రెండువందల ఎకరాలకు మించిన భూస్వాములభూములు భూములులేని పేదప్రజలకు పంచబడుతాయి. అంతేగాకుండా పూర్వము భూస్వాములు అప్పులపేరుతోనో, తదితర అనేక మాయోపాయాలతోనో అన్యాయంగా కొల్లగొట్టిన భూములుకూడా ఎవరివి వారికి పంచబడతాయి".

ఇదంతా విన్నరైతులు, కూలీలు ఉపన్యాసం పూర్తికాగానే అనేకరకాల గుసగుసలు ప్రారంభించారు. "మొత్తంమీద ఇంతకాడికి వస్తదని దొరలెన్నడనుకోక పోవచ్చు" అన్నాడు ఒక ముసలి పిల్లికండ్ల రైతు తన ప్రక్కనున్నరైతుతో. "అసలు మనంమాత్రం ఇటువంటి గొప్పరోజులు వస్తాయనుకున్నామురా?" అన్నాడు. రెండవరైతు కర్రనేలకు పొడుస్తూ.

"సరెగని ఈయన రాంరెడ్డి ఒక్కడు వచ్చిచెప్పగానే సాగనిస్తార్రా ?" అన్నాడు నోట్లోవున్న చుట్టను తీస్తూ, సందేహం వెలిబుచ్చాడు. మరొక చెవుల పోగులున్న బట్టతల రైతు. "ఓర్నీ! రామాయణమంతా విన్న తరువాత రాముడు సీత కేం గావాలన్నట్లున్నది నీ పని! అసలు వెనుక పెద్ద కమ్యూనిస్టుపార్టీ ఉన్నది.మనతో పాటు దేశ దేశాలు కలసిన సంఘమున్నది" అని తీవ్రిగా అన్నాడు మరొక కుర్రకారు మనిషి. "ఇదంతా చెప్పింది అసలుది చెప్పవేమిరా! వూరంతా రాంరెడ్డి చెప్పిన మాట మీదనామె నిల్చేది. అంతా ఒక్కటైనంక ఎవడేమీ చేయలేడు" అంటూ ఇలా నానా రకాలుగా తమలో తాము చర్చించుకుంటూ గ్రామ ప్రజానీకమంతా భూమి పంచుకొని తీరాలనే దృఢ నిశ్చయంతో తమ తమ ఇళ్ళకు వెళ్ళిపోయారు.

అందరితోపాటు లచ్చమ్మ తన యింటికి వెళ్ళి కాగి సిద్ధముగాయున్న పాలను వెంటనే గ్రామ ఆంధ్రమహాసభ ఆఫీసుకు తీసుకెళ్ళింది. తాను ఆఫీసుకుచేరేవరకుగ్రామ రైతు, కూలీలు గుంపులుగుంపులుగాఆఫీసుకుచేరుతున్నారు. తనచిన్నకొడుకుఅప్పయ్య తనచేతిలోని పాలను అందుకొని మొత్తందళానికి, రాంరెడ్డికికాఫీచేశాడు. దళం,రాంరెడ్డి కాఫీపని పూర్తి చేయగానే వెంటనే ఆఫీసు వరండాలో కిక్కిరిసియున్న వందలాది రైతు కూలీల నుండి గ్రామ ఆంధ్ర మహాసభ కమిటీ, రాంరెడ్డి వారి భూముల గాథలు విన్నారు. లచ్చమ్మ కొడుకు వెంకయ్య, తన బావయల్లయ్య. ఇరుగుపొరుగు రైతులతో సహా తమ ఎర్రగడ్డ చెల్క గాథను రాంరెడ్డికి, గ్రామ సంఘానికి పూసగుచ్చినట్లు చెప్పాడు. ఈ గాథలన్నీ వివరంగా విన్నతర్వాత గ్రామ కమిటీ తాను సేకరించిన,

విన్న భోగట్టా ఆధారంగా రాంరెడ్డి సమక్షంలో దీర్ఘంగాఆలోచించి ఏఏ భూములు ఎవరికి పంచాలో తుది నిర్ణయాలు ప్రకటించుతూ గ్రామసంఘ అధ్యక్షుడుఇలాఅన్నారు.

"అన్న తమ్ములారా! అక్క చెల్లెండ్లారా! వినండి: నేడు మనకొక గొప్ప సుదినం. మన తండ్రుల తాతలనుండిగూడా మనం చూడలేదు. అదేమంటే నేడు భూమి పంపకం ప్రారంభించుచున్నాం. మొత్తం గ్రామశివారులో ఇప్పుడు దాదాపు 500 ఎకరాల భూమి పంపకంగాయున్నది. ఇందులో 300 ఎకరాలు గ్రామ పెత్తందార్లదీ మన గ్రామం ప్రక్కనేయున్న అగ్రహారీకునిదీ. అనగా ఇది వారికి ఉండవలసిన భూమి (200 ఎకరాలు) పోగా మిగిలినదన్నమాట. 300 పోను తక్కిన 200 ఎకరాల భూమి అన్యాక్రాంతాలకు సంబంధించినది. ఇందులో అక్రిమమైనట్టి, అప్పులపేరుతో కొల్లగొట్టినట్టి, బదులుకు బదులు ఇస్తామని కాజేసినట్టి, బ్యాంకు అధికారులను ఉసిగొలిపి చేజిక్కించుకున్నట్టి మొదలగు అనేక మాయోపాయాలతో లాగుకొన్న అన్యాక్రాంతాలున్నాయి. ఇది పూర్వం కష్టపడి పోడుగట్టినట్టి రైతులకు పంచబడును" అనే మాటలు వినగానే చెవులు నిక్కబొడుచుకునివింటున్న వందలాది రైతులు, కూలీలు ఉవ్వెత్తున ఉప్పొంగి జోరుగా కరతాళధ్వనులు చేయసాగారు. "ఆంధ్ర మహాసభ జిందాబాద్", "కమ్యూనిస్టు పార్టీ జిందాబాద్", "దున్నేవానికే భూమి", "గ్రామ ప్రజారాజ్యాలు వర్ధిల్లాలి" అనే వందలాది నినాదాలతో ఒక్కపెట్టున ఆఫీసంతా దద్దరిల్లింది. ఈ మహోత్సాహం పట్టలేక లచ్చమ్మ కొడుకు వెంకయ్య మరికొంతమంది రైతులు ఒక అడుగు ముందుకు ఉరికి రాంరెడ్డిని భుజాలపై ఎక్కించుకుని బిగ్గరగా "జైజై" నినాదాలు చేయసాగారు అదే సమయంలో లచ్చమ్మ మరికొందరు స్త్రీలు రాంరెడ్డి రెండు కణతలను తమ రెండుచేతులతో అద్దుకొని హృదయానురాగంతో దీవించారు.

ఒకవంక ఈ మహోత్సవ వెల్లువలు కట్టలుతెగి పారుచుండగానే గంగులు గ్రామసంఘ పెద్దలతో భూమికొలతలకు కావలసినరాళ్ళు, గొలుసులు మొదలగు పరికరాలతో సిద్ధంకానే అయ్యారు. వెంటనే వారితో భూపంపకానికి బయలుదేరినారు. ఈ నూతన మార్పులన్నీ తనలో పూర్వం పెల్లుబికిన నానాసందేహాలను పటాపంచలు చేస్తూ అతివేగంగా సాగిపోతున్నవి. అసలు ఈ భూమి పంపకం నిజమేనా అని! అథవా నిజమైనా భూమిపంపకం జరగగలదా అని! ఎవరైనా ఆ పని చేయబోయిన గ్రామపెత్తందార్లు సాగనీయగలరా అని లచ్చమ్మతలలో పూర్వంపెల్లుబికిన నానారకాల సందేహాలమీదుగా, ఆలోచనల మీదుగా బండి సాగిపోతూనేయున్నది. చివరకు అయిష్టంగా చిత్తురులొత్తురుగా పడివున్న లచ్చమ్మ ఆలోచనలన్నీ నేటికి ఒక కొలిక్కి రాకతప్పలేదు. వచ్చాయి కూడా.

అవును భూమి పంపకాన్ని యెవరూ ఆపలేరు. దున్నేవానికే భూమి రాక తప్పదు. భూమిని పంచుకోవలసిందే. ఆ దెబ్బతో యీ పాడు జమీందార్ల రాజ్యాన్ని కూల్చవలసిందే. సంఘ రాజ్యాన్ని సాధించవలసిందే. అదీ లచ్చమ్మ హృదయంలో నేటికి స్థిరపడిన సంకల్పం. ఏర్పడిన నవచైతన్యం. ఆరోజు సాయంత్రం, తెల్లవారి

మధ్యాహ్నంవరకూ గ్రామకమిటీ ఆధ్వర్యాన పంపకందళం చెల్కచెల్క తిరిగి భూమి పంపకం కార్యక్రమాన్ని పూర్తిచేయనేచేశారు. ఇంకేముంది రైతులు, కూలీలు ఏనాడో తాము కోల్పోయిన తమ భూములు తిరిగి చరిత్రలో మొదటిసారిగా తాము చేసుకోవటమే తరువాయి. దశాబ్దాలుగా తమకు దూరమైయున్న తమ భూమిపై తాము తిరిగి అడుగుపెట్టటమే తరువాయి. ఇలాంటి మహోజ్వల ఘడియ కోసమేకదా లచ్చమ్మ హృదయం పరితపించుచున్నది అట్టి చరిత్రాత్మకమైన ఘడియరానేవచ్చింది. వెంటనే గ్రామ రైతుకూలీ సోదరులంతా తమకు భూమిపంపకంలో కొత్తగావచ్చిన చెల్కలను సాగుచేయుటకు ఒకరోజు నిర్ణయించుకున్నారు. ఆరోజు లచ్చమ్మకు, యావత్ గ్రామ రైతుకూలీ జనానికి ఒక గొప్ప పండుగ దినం

ఆ మహా సుదినం రానే వచ్చింది. ఇక లచ్చమ్మ తన బిడ్డ గంగమ్మ తోటి కూలీలందరితోపాటు తన ఇంటిబయట గోడలు శుభ్రంగా ఎర్రమన్నుతో అలికి, సున్నపు చారలతో ఘనంగా అలంకరించింది. బిడ్డ రకరకాల ముగ్గులతో తల్లిచేసిన అలంకరణకు కొత్తవన్నె తెచ్చింది. లచ్చమ్మ చిన్న కొడుకు అప్పయ్యకూడా దళం కార్యక్రమానికి రెండు రోజులు సెలవుపెట్టి ఒకరోజు ముందేవచ్చి ఇంటిఅలంకరణలో పాల్గొన్నాడు. ఇంటికి ఆయన కట్టిన సుత్తి, కొడవలి ఎర్రజెండా తాటిచెట్టుఎత్తున రెపరెపలాడుతూ ఎటుచూసినా నాలుగుఫర్లాంగుల దూరం కనిపిస్తున్నది. ఇలాగే అప్పయ్య చెల్కలోకూడా నాల్గు మూలలా నాలుగు ఎర్రజెండాలు చాలా ఎత్తున కట్టాడు. ఎంతో ఎత్తునవున్న ఆ ఎర్రజెండాలు లచ్చమ్మ ఇంటిపైనగల జెండాకు ఎదురుగా ఉంటూ పరస్పర శుభ సందేశాలు అందించుకుంటాయా అనిపించుచున్నది. తెల్లవారితేపండుగ రోజు కనుక, ఇంట్లో సన్నాహాలు మహావేగంగా సాగిపోతున్నాయి. ఇంటిల్లాదులంతా మహోత్సాహంగా ఉన్నప్పటికీ ఎందుకో లచ్చమ్మ హృదయంలో ఏదో విచారం ప్రవేశించింది. తాను రోలుమీద కూర్చొని గారెల కోసం పిండి రుబ్బుతూ ఏదో విచారంతో దీర్ఘాలోచనలో మునిగింది. అవును: తెల్లవారితే తన ఆయువు పట్టు ఎర్రగడ్డ చెల్క తిరిగి మొదటిసారి సాగుచేసే సుదినం వస్తుంది. ఆ మహాఘనత తనకు, తన కొడుకులకు దక్కుతుందిగాని, అందులో ప్రధాన భాగస్వామిగా వుండవలసిన తనభర్త నేడులేడు. అదే లచ్చమ్మ విచారకారణం. నిజానికి ఎర్రగడ్డ చెలక ఆబోతులా వున్న తనభర్త రక్తమాంసాలను వడుసుకున్నది ఎందుకూ పనికిరాని గిట్టెద్దుల అడవిగాయున్న ఎర్రచల్క రూపురేఖలు దిద్దబడి ఒక చల్కగా రూపొందించంటే అందుకు రాత్రింబవళ్లు రెక్కలు విరుచుకొని తనభర్త చేసిన మొండి కష్టమే కారణం. ఎక్కడ చూసినా యున్నట్టి నిప్పెడు బొందులు, అడ్డమైన వర్రెలు మటుమాయమై ఎర్రగడ్డ చల్క ఒక చక్కని చదునైన చల్కగా రూపొందిందంటే అందుకు తన భర్త ఉక్కు రెక్కలకే మొక్కాల. ఎర్రగడ్డ చల్క చరిత్రే తన జీవిత చరిత్ర. ఈ చల్క తన భర్తకు ఒక ఆయువుపట్టు. ఈ చల్క పోవడంతో తన భర్త ఆయువు పట్టేపోయింది. కనుకనే నాటినుండియే తన భర్త నిలువునా కుంగిపోయి జీవచ్ఛవంలా

కొంతకాలంగా జీవితంయీడ్చుకువచ్చాడు. అలా తన "ఆయువుపట్టు"కోసంతల్లడిల్లుతూ చివరకు ప్రాణం విడిచాడు ఇది తలచుకునేసరికి లచ్చమ్మ కళ్ళలో నీళ్లు గిర్రున తిరిగి నీటిధారలుపటపటాదుమికాయి. "ఏందే రేపు పెద్దపండుగంటెనేమో ఇయ్యాలేడుస్తవు. ఎందుకో నాకు చెప్పవు" అని అందుకున్నది వెంటనే పిండికి నీళ్ళందించుచున్న గంగమ్మ తల్లి కళ్ళనీళ్ళు చూసి, "ఎందుకే పిల్ల నీకు లోకంలో వున్నదంతా కావాలె. సరెగాని ఓ చుక్క నీళ్ళొంచు" అంటూ లచ్చమ్మ పిండి రుబ్బటం సాగించుతూనే యున్నది.

"ఆ నాకుచెప్పాలి. అట్లయితే నీళ్ళొంచనుపో" అంటూ గంగమ్మ నల్లచెంబు కింద పెట్టనే పెట్టింది. ఇది విని లచ్చమ్మ తలపైకెత్తి బిడ్డముఖం ఒకక్షణం చూసింది. దీంతో లచ్చమ్మకు దుఃఖం మరింత పొర్లిరాసాగింది. ఇప్పటికి గంగమ్మ అర్థంచేసుకో గల్గింది ఇదంతా తన తండ్రిని గూర్చిన దుఃఖమేనని. వెంటనే గంగమ్మ ముఖము కూడా చిన్నబోయింది.

"అమ్మా ! అయ్య గనుక యిప్పుడుంటె ఎంత బాగుండును. నేను అయ్య వెంట పోదును ఎర్రగడ్డ చెల్కకు" అంటూ కిందవున్న చెంబుఎత్తి నీరు పోయ సాగింది.

"ఆవును నేడు తనభర్తవుంటే ఎంతబాగుండును. తనముసలిభర్త కర్రచేత పట్టుకొని మహావిజేతగా చెల్కలకు ముందునడిచేవాడు. కొడుకులతో గొప్పగర్వముతో తానూ తనభర్తను వెంటాడేది. ఆదృశ్యాన్ని చూచిన తనశతృవులు(చెల్కను దొంగిలించినవాళ్లు) సిగ్గుతో తలవంచుకొనే వాళ్ల. స్వయంగా తానుపెంచి పెద్దచేసిన "ఆయువుపట్టు"ను తిరిగి స్వాధీనం చేసుకొనే ఆ మహాఘనకార్యంలో తనభర్త ఐశ్వర్యంలో తాను, తనబిడ్డలు గర్వంగా పాల్గొనేవాళ్ళు. నిజానికి అటువంటి గొప్ప అదృష్టము తన భర్తకు, తనకు పట్టలేదు. ఇందుకు ఇంకావిచారించి లాభంలేదు. పైగా తన భర్త కోల్పోయిన 'ఆయువుపట్టు'ను తాను తిరిగి స్వాధీనం చేసుకున్నట్టు రేపే తాను ప్రకటించనున్నది. తనభర్త నుండి పట్టపగలు దోపిడీచేయబడిన-తన అమూల్య వజ్రాన్నితానే సొంతంచేసుకున్నట్లు రేపేప్రకటించనున్నది. తనభర్తవదలిపోయినవీర జెండాను తానురేపే తిరిగి నిలబెట్టనున్నది. అందువల్ల యికవిచారించడం దేనికి! ఇవి పిండిరుబ్బుతున్న లచ్చమ్మకు తిరిగి పెల్లుబికీవస్తున్న నూతన అభిప్రాయపరంపరలు. ఈ నూతన నిబ్బరంతో తనపనిని త్వరగా పూర్తిచేసి, ఇతరపనులకు తన కొడుకుల, బిడ్డలసహాయంతో ఆ రోజు సాయంత్రానికల్లా పనులుపూర్తిచేసుకున్నది. తెల్లవారింది. అప్పుడప్పుడే తొలిసూర్య కిరణాలు తమలేత ఎండపొడ భూమిపై వెదజల్లుతున్నాయి. చెల్కమధ్యలో ఒకఎత్తైన మోదుగుచెట్టు వున్నది. ఈ లేత బూడిదవర్ణపు కిరణాల పదునైన తాకిడికి ఆ లేతమోదుగు ఆకులు ఎంతో రమ్యంగా మెరుస్తున్నాయి. ఈసుందర దృశ్యం అక్కడికి మూడుఫర్లాంగుల దూరానవున్న ఒంపులో వున్న లచ్చమ్మకళ్ళలో తాండవమాడుచున్నది.

లచ్చమ్మ తన ఇంటి దుల్లాలతో బయలుదేరి చెల్కా సొమపాటుకు దానె వస్తున్నది. తన బిడ్డకు ఒక కొత్తచీర కట్టింది. ఆ చిన్న అమ్మాయి లేతముఖం ఆనందంతో ఉప్పొంగిపోతుండగా ఇప్పుడిప్పుడే మీదపడుతున్న లేత ఎండపొడలు ముఖానికి కొత్త కళను కూర్చుతున్నాయి లచ్చమ్మ నిన్ననే శుభ్రంగా ఉతుక్కున్న బాదామి రంగు చీరకాశపోసుకుని నిండు హృదయంతో ముందుకు సాగుతోంది. లచ్చమ్మ ముఖంలో స్థిరపడుతున్న నిబ్బరం, నిండు ఆనందం తొణికిసలాడుతున్నాయి అందరి కన్నా ముందు వెంకయ్య అరకతో నడుస్తున్నాడు. అరకఎద్దుల నొసట లుక్కగులాలు చల్లబడి కుచ్చులు కట్టబడి చక్కగా అలంకరించబడివున్నాయి. మధ్యన తల్లీబిడ్డలు అందరికన్న వెనుక చిన్నకొడుకు అప్పయ్య భుజాన రైఫిల్‌తో నలువైపులాకనిపెడ్తూ నడుస్తున్నాడు. అందరూ వున్నంతలో శుభ్రమైన గుడ్డలు కట్టుకొని ముఖాన కుంకుమ బొట్టు పెట్టుకొని విలక్షణంగా అలంకరించుకొని ఠీవిగా సాగిపోతున్నారు.

"అదిగో ! అదే నాటి మోదుగు చెట్టు- ఆ మోదుగు కొమ్మకే తాను తన ప్రియమైన భర్తకోసం తెచ్చిన బువ్వ కట్టి వుంచేది; ఈ మోదుగు కొమ్మ క్రిందనే అరక ఆపినపుడల్లా తన భర్త క్షణం సేపు కూర్చొని చుట్ట తాగుతూ సేద తీర్చుకునే వాడు. తాను ఆ సమయంలో తన భర్త వద్ద కూర్చొని మంచి చెడ్డ మాట్లాడి ఆయనకు ఒక క్షణం మనశ్శాంతి చేకూర్చేది. తిరిగి ఆ మోదుగుకొమ్మ తనవంచన చేరింది. ఇది తన కేర్పడిన నూతన ఘనత. తిరిగి ఆ కొమ్మకు బువ్వబుడ్డి కట్టేరోజు వచ్చింది- భేదమల్లా నాడు తన భర్తకోసమైతే నేడు తన కొడుకు కోసము. త్వరలో కొత్త కోడలు వస్తే ఆ కొత్తపని ఆమె చేస్తుంది" ఇలాంటి రసవత్తర దృశ్యాలెన్నో ఒక్కొక్కటి తన కళ్ళలో గిర్రున తిరుగుచుండగా, లచ్చమ్మ కాళ్ళు ముందడుగు వేస్తున్నాయి. మరో ఫర్లాంగు నడవగానే ఒక చిన్న పసుపుబండ కనిపించింది. పడుచైన లేతకిరణాల తాకిడికి ఆ బండబొడుపులు తెల్లనిముత్యాలవలె మెరుస్తున్నాయి. లచ్చమ్మ కళ్ళలో నాడు ఈ చల్కలో పండిన పంటను కళ్ళం చేసుకొనే బండమీదనే ఆ కల్లం రోజున తాను ఏదో వున్నంతలో వరి మెతుకులు, మంచికూర, గారెలు చేసి తన భర్తకు ఈ బండమీదనే తినిపించేది. ఆ రోజు తన భర్తకు ఏదో గొప్ప జన్మహక్కు గెలిచిన వీరునిలాగా సాయంత్రం పూట ఈ బండపై కూర్చుని తన పాలివాళ్ళ, ఇరుగు పొరుగు చెల్కల వారి గుంపుతో ఠీవిగా మాటా మంచీ చెబుతుండే వాడు. వర్షాల ధాటికి ఆగలేక బండపై ఒక చిన్న గుడిసె వేసుకొని రేయింబవళ్లు తన భర్త ఇక్కడే నివసించేవాడు. నిజానికి బండ తన కుటుంబాని కొకమాదు ఇల్లు ఈ బండకు మరొక ప్రత్యేకత కూడా వున్నది తన చుట్టూ వున్న పాలివాళ్లు, తన భర్త ఒరచుగా కూడుతూ ముందు వ్యవసాయము, బ్రతుకు తెరువు సంగతి, అదీ ఇది మాట్లాడుకునేదీ బండమీదనే. తిరిగి ఆరోజు రాబోతున్నది. అదే తనకు కొత్తగా కలిగిన గొప్ప విజయం. ఇలా భావించుతూ లచ్చమ్మ తన కొడుకులతో, బిడ్డతో ఎర్రగడ్డ వరకు చేరుకోనే చేరుకుంది.

"అంజకొడుకు ఇష్టమొచ్చినట్లు అనుభవించిన్రు మనసొత్తును. యిధువాళ్ళతరం గాదులే" అని కంగున పలికింది అప్పయ్య గొంతు. "చెల్కమీద అడుగు పెట్టగానే ఇంకా వాళ్ళ కండ్లు మండులాయి. ఇంకెన్ని పానాలు తీస్తరో యీ చెల్కకోసం" అన్నాడు వెంకయ్య.

"మారె! ఎన్ని పానాలు తీసినా చల్క మనదే. ఇది మన ఆయువుపట్టు. మన చేతుల్నే వుంటుంది" అన్నాడు అప్పయ్య.

"ఆఁ మాట నిజమె. ఇక వాళ్ల చెల్కకోసం ఆశపడితే అదంతా వారి పగటి కలే" అంటూ తిరిగి వెంకయ్య అందుకున్నాడు.

"అది కలయ్యేది, నిజమయ్యేది మీ చేతిలోనే వున్నది" అని కొడుకులవైపు గంభీరంగా చూస్తూ అన్నది లచ్చమ్మ.

"ఇక చల్కపోతుందనే ఫికరే మనకక్కరలేదు. మనకండగా ఒకపెద్ద కమ్యూనిస్టు పార్టీ, ఆంధ్ర మహాసభలున్నాయి. అప్పుడంటే సంఘం అండ లేదాయె అయ్యకు" అన్నాడు అప్పయ్య కిందకు జారుతున్న రైఫిల్‌ను భుజంపైకి ఎగరవేస్తూ.

"ఊరంతాగూడా ఒకటేనాయె ఇప్పుడు" అని విసిరింది బిడ్డ గంగమ్మ. తన బిడ్డ గొప్ప వాక్కులు వింటుంటే లచ్చమ్మ హృదయంలో నూతన గర్వం, ఆనందం తొణికిసలాడుతున్నాయి.

ఇప్పటికి చెల్కలో అరక బయలుదేరవలసిన క్షణం రానేవచ్చింది. తల్లి, బిడ్డలు నలుగురూ ఒకచోట నిలబడి వున్నారు పెల్లుబుకుతున్న చిరునవ్వుతో తల్లి అందరి నొసట కుంకుమ అందించింది. తిరిగి మరొకసారి –

"ఎర్రజెండాకు జై
కమ్యూనిస్టు పార్టీకి జై
ఆంధ్ర మహాసభకు జై"

– అంటూ అప్పయ్య గొంతు ఖంగుమనసాగింది తల్లి ముగ్గురూ జవాబు నినాదాలు అందుకున్నారు. ఇది పూర్తికాగానే వెంకయ్య అరకను కదలించాడు. అప్పయ్య భుజాన రైఫిల్ వుండగా చెల్క నలువైపులా కలియజూస్తూ తిరుగుతున్నాడు. బిడ్డగంగమ్మకి పొంగులుపారుతున్న ఆనందంతో అటూఇటూ పరుగెత్తుతూ లేత మోదుగు ఆకులను అడపాదడపా తెంపుతోంది. ఇక లచ్చమ్మ మాత్రం అరక బయలుదేరినచోట అలాగే నిలబడి నడుస్తున్న అరకను విజయగర్వంతో చూస్తున్నది. నాడు తన భర్త యీ చెల్కలో అరక నడుపగా చూసిన దృశ్యమే దృశ్యం!

తిరిగి చరిత్రలో మొదటి సారిగా తన కళ్ళముందు యిప్పుడున్నదా దృశ్యం, అయితే నేడు ఆ భర్త లేడు. అయినా తన బిడ్డలు తన భర్త వీడిన ఆ జండాను తిరిగి నిలబెడుతున్నారు. నిజంగా తనకెంత గర్వకారణం! తనకిదెంత గొప్ప విజయం! ఈ ఎర్రగడ్డ ఏనాడో తమ చేతుల నుండి జారిపోయినప్పటికీ బ్రతికుంటే దాన్ని తిరిగి సాధించలేకపోతామా ? అనే కొన ఊపిరయినా వుండేది, తన భర్త జీవించి

యున్నంతకాలం. కాని ఆ భర్త పోవడంతో ఆ కాస్త దింపుడు కళ్ళం ఆశకూడా లేకుండా పోయింది లచ్చుమ్మకు. నాటి నుండి యిలా ఆశ అనేది లేకుండా పోవడం, ఈ ఒక్క ఎర్రగడ్డ గురించేకాదు, అసలు యావత్తు తన భావి జీవితం గురించే. నాటి నుండి పూర్తిగా ఎందుకూ కొరగాని అశక్తురాలనని, అభాగ్య జీవిననీ లచ్చుమ్మ భావించింది. ఇక తన బ్రతుకు అసలు తన పసికూనలకు అదనపు భారం తప్పితే, తాను వాళ్ళకోసం సాధించగలిగేది ఏమీలేదని తలపోసింది కాని చరిత్ర తాను అనుకోని కొత్తదారి తొక్కింది. తాను, తనలాంటి కోటానుకోట్ల అభాగ్యజీవులు కూడా గొప్ప శక్తివంతులని ఈ మహాశక్తి ముందు వేళ్ళమీద లెక్కించగల్గిన శత్రువుల కూటమి నిలవలేక గింగరాలు తిరుగుచున్నదని చరిత్ర చాటింది. అందుకు ఇప్పుడు లచ్చుమ్మ కళ్ళముందున్న ఈ ఎర్రగడ్డ దృశ్యమే తార్కాణం. ఇది నేడు లచ్చుమ్మలో ఏర్పడిన నూతన ఆత్మ విశ్వాసము, ఇలాటి నూతనోత్సాహముతో లచ్చుమ్మ తానున్న చోటినుండి కదిలి చెల్కనలువైపుల పరిశీలించుతూ, తిరుగుచుండగా వెనుక నుంచి చప్పుడు.

"అమ్మా! చిన్నయ్య, పెద్దయ్య, మనోళ్ళంతా వస్తున్నారు. రా!రా! అందరం బండమీదకూడి మాట్లాడుకుందాం" అంటూ అప్పయ్య తల్లిని కేకేశాడు. చప్పుడు విని వెనక్కి తిరిగిచూడగానే తనపాలివాళ్లు, ఇరుగుపొరుగు చెల్కలవాళ్లు సుమారు 20 మందిదాకా కల్లంబండవరకూ రానేవచ్చారు. వీరంతా లచ్చుమ్మవలెనే కొత్తగా వచ్చిన తమతమ చెల్కల సాగుబాటు కార్యక్రమం పూర్తి చేసుకొని వచ్చారు. అంతా ముఖాన కుంకుమ పెట్టుకొని, తెల్ల బట్టలు కట్టుకొని శుభ్రంగా అలంకరించుకున్నారు. వీరిలో లచ్చుమ్మ యారాలు పుల్లమ్మ, ఆమె కోడలు పిచ్చమ్మ వగైరాలుకూడా వున్నారు. అందరూ ముసిముసి నవ్వులతో పొంగులువారుతున్న ఆనందంలో వున్నారు. వీరిని చూసి ఇంతలో తన అర్కకూడా విడిచి వెంకయ్య, లచ్చమ్మ, బిడ్డ గంగమ్మకూడా వచ్చారు బండ మీదకి.

"పిల్లా ఆ తంగెడు మండలుతె, ఇక్కడ కొడదాం" అని తల్లి అనగానే బిడ్డ తానే తంగెడు మండలందుకుని చకచకా ఊడ్చింది.

"కూర్చుండ్రి, మాకన్నా పొద్దుగాలనె పూర్తి చేసిండ్రె సాగుపని" అని అంటున్నది వారందరినీ చూసి లచ్చుమ్మ.

"ఆఁ లేచినప్పటినుండి ఇదే పనిమీద వుంటిమి. ఎంతసేపులే" అన్నాడు లచ్చుమ్మ మునలిబావ యల్లయ్య తన నోట్లోవున్న పొడుగాటి చుట్టను తీస్తూ. వెంటనే బిడ్డ గంగమ్మ గంతేసి తన పెద్దయ్య యల్లయ్య మీద వాలుతూ, "పెద్దయ్యా ఇప్పటి నుండి ఈ చెల్కలన్నీ మన చేతిలోనే వుంటాయి గదూ" అంటూ గడ్డం పట్టుకొని ప్రశ్నించింది.

"ఆ మాట నన్నడుగుతావేందే? ముందు పెరిగేది మీరు, కాపాడేది మీరే" అన్నాడు యల్లయ్య. "చేతికొచ్చిన చెల్కనింక పోనిస్తామా రాకాసులకు" అంది

గంగమ్మ గంభీరంగా, "ఆఁ గదీమాట. ఈనాటి సంగతే వేరు యల్లయ్యబావ" అన్నాడు పొరుగు చెల్క రైతు వీరయ్య. ఇది విని అంతా గంగమ్మ ముఖం చూస్తూ పకపకా నవ్వారు. "దీనికియ్యేడు బుడబుడమనిపిద్దాం లచ్చమ్మ" అన్నాడు యల్లయ్య గంగమ్మను చూపుతూ. వెంటనే గంగమ్మ యల్లయ్య తలపై కొడుతూ, రుమాలు చెదరగొట్టింది.

"ఎట్లయినా చెల్కొచ్చె. ఈ సంబరాన నీ యిద్దరు బిడ్డలు - వెంకయ్య, గంగమ్మ-కు బుడబుడమనిపించవలసిందే" అని అందుకున్నాడు వీరయ్య. ఇది విన్న లచ్చమ్మ ఆ పొంగుతున్న ఆనందంతో బిడ్డలముఖం చూస్తూ-

"మీ అందరి దయవుంటే అదిమాత్రం ఆగతాది?" అన్నది. ఆ తరువాత అలా ఒక్క-క్షణం నిశ్శబ్దంగాగడిచింది. యల్లయ్య పొందికగాకూర్చొని తనకెదురుగా మూలచాటుగా పైఆకాశం వైపుచూస్తూ ఏదోదీర్ఘఆలోచనలో తేపకొకసారి చుట్టపీల్చి పైకెగజల్లుతూ 'ఎటోచ్చి తమ్ముడులేకపాయె! యియ్యాల వాడువుంటె ఎంతబాగుండు" అంటూ యల్లయ్యచుట్టపక్కకుతీసి నెమ్మదిగా వూశాడు.

ఇదివిన్న లచ్చమ్మ హృదయం తనభర్తే వుంటే ఎంతబాగుండు. తనబిడ్డల హృదయాల్లో అయ్యవుంటే ఎంతబావుండు; అనే నినాదాల మెరుపు మెరిసినట్లు తక్షణమే ప్రతిధ్వనించాయి. అంతా ఖిన్నులై ఒకక్షణం నిశ్శబ్దంగా వున్నారు.

"చూడాలె భూములు పొగొట్టుకున్న దొరలంతా యింకేమి దుర్మార్గాలు చేస్తారో?" అని తిరిగి ప్రారంభించాడు వీరయ్య.

"వారిప్పుడు లోక లొక్కిన తాసులుగ లేరు! రజాకార్లకు మనవూరు ఆయం వున్నది, లేనిది చెప్పి దాడులు ఇంకా ఎక్కువ చేయించుతారు." అన్నాడు వెంకయ్య. వెంటనే అప్పయ్య అందుకొని "అవునవును .వారంతటితో వూరుకుంటారనుకోవద్దు, రజాకార్ల దాడులు కూడా మన గ్రామంమీదే ఎక్కువవుతాయి."

"అయితే అప్పుడేమి వుపాయముంటాది" అని అడిగాడు అప్పయ్య యల్లయ్యను ముందుమార్గం చెప్పమన్నట్లుగా. "ఇంకా వుపాయమేంది! వూరు ఆయం చెప్పేవారికి వూళ్లోనీళ్లుకూడా దొరకనియ్యొద్దు. మీరువూళ్ళోఉండి కినిపెట్టి దాడి వచ్చినప్పుడల్లా తప్పుకుంటూనే వుండాలి. ఇటు దళంకూడా వెనుక మార్గం కాపెట్టుకొని దెబ్బ తీస్తూనే వుంటుంది. ఏదెట్లున్న ఈ చెల్కలు మనం దున్నవలసిందే. పండిన పంట అనుభవించవలసిందే."

"ఆఁ ఆఁ ఇక మనకున్న మార్గమే అది. ఏమైనా తప్పదు" అని ఒక్కసారి పలికాయి లచ్చమ్మతో సహా అక్కడవున్న వారందరి గొంతులు. అప్పుడప్పుడే వెలుగుతున్న వుద్రేకముతో కొంత ముందువైపు జరిగి లచ్చమ్మవైపు చూస్తూ వీరయ్య-

"లచ్చక్కా నీ కెరుకలేదేందిగని" గంగమ్మను చూపుతూ, "గింతపిల్లను కానించి మనం ఈ చెల్కలు బట్టుకొనేయున్నాం. మధ్యన అన్నేండ్లు మనకు దూరమయినా, తిరిగి మన చెల్కలు మన చేతికొచ్చినాయి. ఇన్నేండ్లు మనం పడని అవస్థలు

ోషం. ఇప్పటికి పెత్తనానికి వస్తున్నాం, ఇంకా చేసేదేంది! పానాలు తీస్తారు. ంతేనా మనం పోతేపోయె. జావపానం పోలేదా మనం పోయినా మన గామి మనకే దక్కాలె. అదెనాయెం, మన ఆయువుపట్టు" అని అన్నాడు.

"ఎంతైనా వూరంతా ఒకమాటకట్టు మీద వుందాం" అన్నాడు చుట్టను ఒకసారిగా పీల్చికిందేసి కాండ్రించివూస్తూ యల్లయ్య. "జాగామాటన్నావు, మెచ్చినా జావా. నాడు వూరంతా ఒకమాట కట్టుమీదుంటె ఈ చెల్కాలు పోయేయా బావా?"

"అంతేకాదు తమ్మునిపానం కూడా పోకపోయేదేమో?"

"అప్పటి కిప్పటికేం పోలిక పెద్దయ్యా! ఇప్పుడు వూరంతా ఒక్కటైంది. పెద్దకమ్యూనిస్టుపార్టీదళాలు, ఆంధ్రమహాసభ అండగావున్నాయి" అన్నాడుఅప్పయ్య

"ఆమాటా నిజం" అందుకున్నారంతా.

"సరె యిగ మన సొమ్మేదో మనచేతికొచ్చింది. దాన్ని కాపాడుకోవడమేయిగ మనమీద వున్నభారం" అని ముగించింది లచ్చమ్మ. తరువాత అంతా లేచి గ్రామానికి వెళ్ళి ఎవరిండ్లకు వారు చేరుకున్నారు.

తర్వాత కొద్దిరోజులకే, ముఖ్యంగా భూపంపకం జరిగిన గ్రామాలపై రజాకార్ల దాడులు మహా ఉధృతంగా సాగాయి. ఒక్కొక్కసారి వందల రజాకార్లు, మిలటరీలు గ్రామాలపై విరుచుకపడి గ్రామాలకు గ్రామాలే తగులబెడుతూ, దొరికిన వారిని చిత్రవధలు గావించుతూ మారణహోమం సాగించారు. ఇలాంటి మారణహోమానికి లక్ష్యమైన గ్రామాలవలెనే లచ్చమ్మ గ్రామంకూడా గురి అయింది

ఈ రాక్షస దాడుల మధ్యన గ్రామ ప్రజలందరివలెనే లచ్చమ్మ తనచెల్కాను సేద్యం చేసింది. ఆ సంవత్సరం పండిన పంటలను, ఇంట్లోవున్న ఆస్తిపాస్తులను రజాకార్లకు అందకుండా అనేక ఉపాయాలతో ప్రజలు రక్షించుకోగలిగారు. ఇంట్లో వున్న చరాస్తినంతటినీ, పండిన ధాన్యం మొత్తం అడవికి తరలించి గట్లలోని బొరికెల్లో, చెల్కాల్లోని పాతరల్లోనూ దాచుకొనిరక్షించుకున్నారు. అంతేకాదు, శత్రువులు అప్పుడప్పుడు అడవులనుకూడా గాలించేవరకు, ఆస్తినంతా ఒకటి రెండు బుట్టల్లో మల్చుకొని భుజాన వేసుకొని దినదినము మకాములు మార్చుకుంటూ రక్షించుకున్నారు. తర్వాత రానురాను గ్రామంచుట్టూ-కోటవలెనున్న గట్టు-దట్టమైన ప్రకృతి అంటివున్న సమయంలో ప్రజలు వెంటవెంటనే అందించే వార్తల ఆధారంగా గెరిల్లా దళం రజాకార్లపై దెబ్బలు తీయసాగింది. దీనివలన రజాకార్లు జంకి ఈ గ్రామానికి వందల బలంతో పెద్ద దండయాత్రకు రావడం తప్ప, మామూలు బలంతో దాడులు చేయడమే మానుకున్నారు.

ఏది ఎలావున్నా ప్రజలకు వచ్చినభూములు సేద్యంకావడం, ఆ సంవత్సరం ర్షాలుకూడా సమృద్ధిగా కురవడం వలన పంటలు పుష్కలంగా పండాయి. గట్లల్లో చిన్న బొరికచూసిన ధాన్యరాసులే. ఏ చెల్కాగడ్డను ఏ మాత్రంగెలిచినా పుష్కలంగా ంజలు ప్రత్యక్షం.

ఈ పంటలు మహోత్సాహంతో అనుభవించుతూ ప్రజలు మహాపోరాటంల
తమబిడ్డల, కొడుకుల పెండిండ్లు కూడా పూర్తి చేసుకున్నారు. ఇలాగే లచ్చమ్మ కూ
ఆ సంవత్సరం తన బిడ్డ గంగమ్మ పెండ్లి, పెద్దకొడుకు వెంకయ్య పెండ్లి దిగ్విజయ
పూర్తిచేసింది. ఇదేకాలంలో ఇంటివ్యవసాయభారం హెచ్చటంవల్ల దళంఅనుమ
అప్పయ్య ఇంటివద్దనేవుంటూ, గ్రామకమిటీ సభ్యుడుగా తన బాధ్యత నిర్వహించాడ
ఇలా ఎంతో ఆనందంగా ఆ సంవత్సరం గడచిపోయింది.

[ ఆగస్టు 15, 27-1972 "ప్రజాశక్తి" నుండి ]

149 33/1481

—: సమాప్తం :—



## Check List

| | | | |
|---|---|---|---|
| Book Number | NFR01F350 | Date | 13/4/2023 |
| Front Cover | Yes | Back Cover | Yes |
| Blank Pages | CI, 99, 2, 137, 139 | | |
| Missing Pages | NO | | |
| Prepared By | D. Mounika | Cutting By | D. Mounika |
| Scanned By | S. Lakshmi | Pages | 137 |
| Quality Checking | SWATHI | | |